దేవవ్రతచరిత్రాది మహాప్రబంధ నిర్మాతయు
శ్రీవిజయనగరమహారాజావారి యాంగ్లేయకళాశాల
యందు చిరకాల మాంధ్రగీర్వాణాధ్యాపకుఁడు నగు

మేదేపల్లి - వేంకటరమణాచార్యుఁడు

ఆంధ్రీకరించిన

# సేతుబంధ మహాకావ్యము.





త్రిక ముద్రణాలయము,
విజయనగరము.
1939





వెల:
రెండురూపాయలు

దేవవ్రతచరిత్రాది మహాప్రబంధ నిర్మాతయు, శ్రీ విజయనగర
మహారాజావారి యాంగ్లేయకళాశాలయందు చిరకాల
మాంధ్రగీర్వాణాధ్యాపకుఁడు నగు

మేదేపల్లి - వేంకటరమణాచార్యుఁడు

ఆంధ్రీకరించిన

# సేతుబంధ మహాకావ్యము.







కార్తిక ముద్రణాలయము,
విజయనగరము.

1939.

2/-

# ఆంధ్ర సేతుబంధ కావ్యము.

## కృత్యాది.

ఏమహాత్ముఁడు సేతువు • నేపునీరఁ
గడలి గట్టించి దశకంఠు • కంఠపంక్తి
నతని సతికంఠసూత్రంబు • నఖిలలోక
దుఃఖ మొకనారసమ్మున • దునిమె నతని
పాదపంకజమే నాకుఁ • బట్టుకొమ్మ. 1

కాళిదాసాది సంస్కృత•కవివృషభుల
నాంధ్రకవితాపితామహా•ద్యాంధ్రకవుల
పుండరీకాక్షపదభక్తి • పురుడులేని
ఘనుల సన్నిద్దరాళ్వార్ల • మనమునందు
దలఁచి కొలిచెద దక్కు స•ద్భక్తవరుల. 2

సకల షడ్దర్శనీ సార • నికష ఘృష్ట
విమల ధిషణావధీరిత • విబుధగురుఁడు
సరస కవితారసాస్వాద • భరిత సకల
విబుధమాన్యుండు శ్రీవత్స • విమలవంశ
శుద్ధముక్తాఫలుండును • సూరి వినుతుఁ
డగు నృసింహార్యదేశికు • నభినుతింతు. 3

మహిని గాశ్మీరదేశసా•మ్రాజ్యమేలి
విధు పయోరాశి శరదభ్ర • విమల కీర్తి

దిక్కులను బిక్కటిల్లంగ ♦ దేవభూమి
దేవసంఘంబు బ్రోచిన ♦ దీప్రవిద్యుఁ
డవనిపాలశిరోరత్న ♦ మార్యనుతుఁడు
ప్రవరసేనమహీపతి ♦ ప్రాకృతమున
దొల్లి రచియించి దోషజ్ఞు ♦ లుల్లసిల్ల
నే మహాకావ్యరత్న మి♦య్యిలను నిలిపె. 4

అట్టి సేతుమహాకావ్య ♦ మనేడు పెద్ద
పేరుతో కోవిదావళి ♦ బిలుచునట్టి
రావణవధాఖ్యకావ్యంబు ♦ రమణఁదీర
భక్తిఁ దెనిగింపఁ బూనితి ♦ భక్తులలర. 5

---

# సేతుబంధ మహాకావ్య భూమిక.

శ్లో. "అత్రసమాప్యత ఏత శ్సీతాలంభేన జనితరామాభ్యుదయమ్
రావణవధ ఇతి కావ్యమనురాగాంకం సమస్తజనినిర్వేషమ్॥

(15 ఆశ్వా-15 స్కంధకము) సీతాప్రాప్తి చే లబ్ధరామా భ్యుదయమైన యీ కావ్యమునకు రావణవధ మని పేరు. ఇందులోఁ బ్రత్యాశ్వాసాంతస్కంధకము ననురాగపదాంకితమైయున్నది.

శ్లో. "మహారాష్ట్రాశ్రయాం భాషాం ప్రకృష్టం ప్రాకృతం విదుః
సాగర స్సూక్తిరత్నానాం సేతుబంధాదియన్మయమ్."

అని యాచార్యదండి తన కావ్యాదర్శమం దీ కావ్యమునకు సేతుబంధమని మఱియొక పేరుపెట్టెను. అష్టవిధప్రాకృతభాషలలో మహారాష్ట్రభాష యుత్తమమైనదనియు నాభాషలో నీసేతుబంధ మహాకావ్యము వ్రాయఁబడినదని యుఁ జెప్పుచున్నాఁడు.

శ్లో. "అభినవరాజారబ్ధా చ్యుతస్ఖలితేషు విఘటితపరిస్థాపితా
మైత్రీవ ప్రేమఖరసికా నిర్వోఢుంభవతి దుష్కరం కావ్యకథా"

అని ప్రథమాశ్వాస నవమస్కంధకము చేతను బ్రత్యాశ్వాసమందు "ఇతి శ్రీప్రవరసేన విరచితే" అనియుండుట చేతను,

శ్లో. "కీర్తిః ప్రవరసేనస్య ప్రయాతా కుముదోజ్జ్వలా
సాగరస్య పరం పారం కపిసేనేవ సేతునా"

అని హర్షచరిత్రోపోద్ఘాతమందు భట్టబాణుఁడు వ్రాసియుండుట చేతను "యథా సెతుబంధే ప్రవరసేనస్య-

శ్లో. "దనుజేంద్రరుధిరలగ్నే యస్య స్ఫురతి నఖప్రభాసమూహే
వ్యాకులీభవంతి విపలాయితా గళితస్తనాంశుకా మహాసురలక్ష్మ్యః."

అని పదునొకండవశతాబ్దమందుజీవించిన కాశ్మీర దేశస్థుఁడగు మహాకవి క్షేమేంద్రుఁడు తాను రచియించిన "ఔచిత్యవిచారచర్చ"

లో( జెప్పియుండుటచేతను ప్రవరసేను( డనునొక మహారాజుండెనని తో(చుచున్నది. ప్రవరసేను( డను పేరుగల రాజులు నలుగురున్నారు. వారిలో నిరువురు కాశ్మీర దేశస్థులు. రాజతరంగిణీతృతీయతరంగమందు కల్హణునిచే వర్ణింప(బడిరి.

శ్లో. "శతేషు షట్సు సార్ధేషు త్ర్యధికేషు చ భూతలే
కలే ర్గతేషు వర్షాణా మభవన్ కురుపాండవాః" (రాజ. 1-51)

కలియుగము 653 సంవత్సరములు కాగా, కురుపాండవులుండిరి.

శ్లో. "వర్షాణాం ద్వాదశశతీ షష్టిః షడ్భిశ్చ సంయుతా
భూభుజాం కాలసంఖ్యాయాం తద్వా సంచశతో మతా"
(రాజ. 1-54)

అనువాక్యమునుబట్టి 1266 సంవత్సరములలో వే(బదియిద్దరు రాజులు గతించిరి.

శ్లో. "చతుర్దశాధికం వర్షసహస్రం నవవాసరాః
మాసాశ్చ విగతా హ్యస్మి న్నేకవింశతి రాజసు"

అను రాజతరంగిణీ (1 84) శ్లోకమందు వర్ణింప(బడిన ప్రకారము లవమహారాజు రాజ్యప్రారంభ కాలము 1014.

శ్లో. "శతద్వయే వత్సరాణా మష్టభిః పరివర్జితే
అస్మిన్ ద్వితీయే వ్యాఖ్యాతాః షట్ప్రఖ్యాతగుణా నృపాః"

అని ద్వితీయతరంగమందు

శ్లో. "తస్మి న్నస్తంగతే భుక్త్వా క్ష్మాం చ తు ర్త్రింశతం సమాః
అనాదిత్య మి వాశేషం నిరాలోక మభూ జ్జగత్".

అని మేఘవాహనమహారాజు పరిపాలనకాలము ముప్పది నాలుగుసంవత్సరములు గతింప(గా,

శ్లో. "అథ క్ష్మాభృ ద్రరక్షు క్ష్మాం శ్రేష్ఠసేన స్తదాత్మజం
ఆహుః ప్రవరసేనం యం తుంజీనం చాంజసా జనాః".

శ్లో. "తతః శోన్నృపాణాం నిశ్శేష క్ష్మా కేదారకుటుంబినామ్
సనమాస్త్రింశతం భూభృదనిస్త్రింశాశయోఽభవత్"

(రాజ. 3-101) అను శ్లోకమునుబట్టి ప్రథమప్రవరసేనుని రాజ్యకాలము ముప్పదిసంవత్సరములు కలిపికొనఁగా 3159—89 కల్యబ్దములుకాఁగాఁ ప్రథమప్రవరసేనుఁడు కాశ్మీరమండలమందు రాజ్య మేలెను.

శ్లో. "ప్రాప్తశ్రీ ప్రవరసేనస్య గిరా మాతుర్నృపాత్మజః
పైతామహేననామ్నైవ కులాఖ్యాఖ్యాపితోఽభవత్" (రా. 3-109

శ్లో. "నివార్య మరణోద్యోగం మాతుర్నిర్వేదఖేదితః
యయౌ ప్రవరసేనోఽథ తీర్థాత్సర్వా ద్దిగంతరమ్" (రా. 1-123

శ్లో. "రక్షిత్వా దశమాసోనాః క్ష్మామేకత్రింశతం సమాః
తస్మిన్ క్షణే హిరణ్యోఽపి శాంతిం నిస్సంతతిర్యయౌ" (3 124)

శ్లో. "తత్రానేహ స్యుజ్జయిన్యాం శ్రీమాన్ హర్షాపరాభిధః
ఏకచ్ఛత్ర శ్చక్రవర్తీ విక్రమాదిత్య ఇత్యభూత్" (3-125)

ప్రవరసేనుని మనుమఁడు తల్లియాజ్ఞననుసరించి తాతపేరు నే పెట్టుకొనెను. తల్లి మరణోద్యోగమును నివారించి నిర్విణ్ణుఁడై తీర్థయాత్రలకుఁజనెను. పదిమాసములు తక్కువ ముప్పదిసంవత్సరములు రాజ్యము చేసి నిర్వేదమును జెంది తీర్థయాత్రలకుఁబోయెను. ఆకాలమందు హిరణ్యుఁడనువాఁడునువాఁడు సంతతి లేకుండఁగాలధర్మము నొందెను. ఆకాలమందుజ్జయినీనగరమున హర్షుఁడను నామాంతరముగల విక్రమాదిత్యుఁడేకచ్ఛత్రాధిపతియై రాజ్య మేలెను. ఇట్లు పూర్వోక్త శ్లోకప్రామాణ్యముచేఁ ప్రవరసేనుని జ్యేష్ఠపుత్రుఁడగు హిరణ్యుని రాజ్యపరిపాలనకాలము 31సంవత్సరములు కలుపఁగాఁ జేలిసి 3220 కల్యబ్దములకు ముందే ప్రవరసేనుని కనిష్ఠపుత్రుఁడగు తోరణుని కుమారుఁడైన ప్రవరసేనుని జన్మము. ఇట్లు క్రీస్తుశకము ద్వితీయశతకమందు కాశ్మీరిక ద్వితీయప్రవరసేనుని కాలము నిశ్చయింపఁబడుచున్నది.

Dr. G. Buhler Ph. D. మహాశయుఁడు వాకాటక వంశమం దుఁగూడ నిద్దఱు ప్రవరసేను లున్నారని "ఇలిచపూరుశాసనము" వలనఁ గనఁబఱిచెను.

"ఓం ఓం స్వస్తి ప్రవరపురాదగ్నిష్టోమాప్తోర్యామోక్థ్యషోడ శ్యతిరాత్ర వాజపేయసవనాద్యస్క చతురశ్వమేధయాజినో విష్ణు వృద్ధసగోత్రస్య సామ్రాజో వాకాటకానాం మహారాజశ్రీ ప్రవర సేనస్య సూనోః అత్యంత స్వామిమహాభైరవభక్తస్య అంసభార సన్నివేశితశివలింగోద్వహాన శివసు పరితుష్టసముత్పాదిత రాజవంశా నాంపరాక్రమాధిగతభాగీరథ్యమలజలమూర్ధ్నాభిషిక్తానాందశాశ్వ మేధావభృథస్నాతానాం భారశివానాం మహారాజభవనాగ దౌ హిత్రస్య గౌమతీపుత్రస్య వాకాటకానాం మహారాజశ్రీ రుద్రసేన స్య సూనో రత్యంతమాహేశ్వరస్య సత్యార్జవకారుణ్య శౌర్యవిక్రమ నయవినయ మాహాత్మ్య ధీమత్వపాత్రాగత భక్తిత్వధర్మవిజయిత్వ మ నో నైర్మల్యాదిగుణైస్సము పేతస్య వర్షశతమభివర్ధమానకోశదండసాధన సంతానపుత్రపౌత్రిణః యుధిష్ఠిరవృత్తే ర్వాకాటకానాంమహారాజశ్రీ పృథివీషేణస్యసూనో ర్భగవతశ్చక్రపాణేః ప్రసాదోపార్జితశ్రీసము దయస్య వాకాటకానాం మహారాజశ్రీ రుద్రసేనసూనో ర్మహారా జాధిరాజ శ్రీ దేవగుప్తసుతాయాం ప్రభావతీగుప్తాయా ముత్పన్న స్య శంభోః ప్రసాదధృతకార్త్తయుగస్య వాకాటకానాం పరమమా హేశ్వర మహారాజశ్రీ ప్రవరసేనస్యవచనాత్"

ఇట్లిండియన్ యాంటిక్వెరీ (Indian Antiquary) 12వ-వా ల్యూమ్. 243 పేజీలోఁ గనఁబర్చఁబడినది. దీనివలనఁ బ్రథమప్రవరసేన మహారాజు క్రీ.శ. చతుర్థశతకమందును, ద్వితీయప్రవరసేనమహారాజు పంచమశతకమందును రాజ్యముచేసిరని నిశ్చయింపఁబడినది. ఇట్లు కల్హణుని రాజతరంగిణీప్రమాణ్యానుసారముగా నిద్దఱు ప్రవరసేనులు, పూర్వోక్త శాసనమువలన నిద్దరుప్రవరసేనులు గానవచ్చుచున్నారు.

వీరిలో సేతుబంధ మహాకావ్యము రచించిన ప్రవరసేనుఁ డెవ్వడో నిశ్చయింపఁబడలేదు.

భోజుఁడే ప్రవరసేనుఁడని కొందఱివాదము. "అభినవరాజార్థా చ్యుతస్ఖలితేషు విఘటితపరిస్థాపితా" అను ప్రథమాశ్వాసము లోని నవమస్కంధమును వ్యాఖ్యానముచేయుచు నేతద్వ్యాఖ్యాత యగు రామదాసు "ప్రవరసేనో భోజదేవ ఇతి కేచిత్"అని వ్రాసెను. కాని యిది సరికాదు. ఏలయనఁగా- హర్షచరిత్రభూమికలో బాణుఁడు"కీర్తిః ప్రవరసేనస్య ప్రయాతా కుముదోజ్జ్వలా। సాగరస్య పరం పారం కపిసేనే వ సేతునా"అని చెప్పియుండుటచే భోజుఁడు బాణునికంటెఁ బూర్వుఁడై యుండవలెను. ఇది యనేకగ్రంథవిరోధముగావున భోజుఁడు ప్రవరసేనుఁడు గానేరఁడు. దీనివ్యాఖ్యానమైన రామసేతుప్రదీపమందు—

"ధీరాణాం కావ్యచర్చా చతురిమవిధయే విక్రమాదిత్యవాచా యం చక్రే కాళిదాసః కవికుముదవిధు స్సేతునామప్రబంధమ్ తద్వ్యాఖ్యా సౌష్ఠవార్థం పరిషది కురుతే రామదాస స్స ఏవ గ్రంథం జల్లాలదీంద్ర క్షితిపతివచసా రామసేతుప్రదీపమ్"

అని గ్రంథప్రారంభమందున్న యీశ్లోకముచే మహారాజ ప్రవరసేనునికొఱకు మహారాజాధిరాజ విక్రమాదిత్యునాజ్ఞచే నిఖిల కవిచక్రచూడామణి యగు కాళిదాసమహాశయుఁడు సేతుబంధమను ప్రబంధమును రచియింపఁబోవువాఁడై నిర్విఘ్నపరిసమాప్త్యర్థమై రామచంద్రాత్మకమధుమథసరూపేష్టదేవతానమస్కారోపదేశముఖముగా మంగళము నాచరించుచున్నాఁడు"అని ప్రథమస్కంధకావతరణికచేఁ బ్రకృతగ్రంథమందుఁ బ్రత్యాశ్వాసాంతమందు "ఇఅసిరి పవరసేనవిరఇఏ కాళిదాసకఏ నిశముఖవహే మహాకవ్వే"అని వ్రాయుటచేత నీకావ్యము ప్రవరసేనకారితమనియుఁ గాళిదాసకృతమనియుఁ దోఁచుచున్నది. కాశ్మీరికద్వితీయప్రవరసేనవిక్రమాదిత్యు లుభయులు సమకాలికులైయున్నను విక్రమాదిత్యునికాలమందు ద్వి

తీయప్రవరసేనుఁడు రాజ్యప్రాప్తికంటె ముందే తీర్థయాత్రార్థమై కాశ్మీరదేశమును విడిచి వెళ్లిపోయెను

"యయా ప్రవరసేనోఽథ తీర్థౌత్సుక్యాద్దిగంతరమ్। తత్రానేహ స్యుజ్జయిన్యాం శ్రీమాన్ హర్షోఽపరాభిధః। ఏకచ్ఛత్రశ్చక్రవర్తీ విక్రమాదిత్య ఇత్యభూత్" (3-125) అని రాజతరంగిణి చెప్పుచున్నది. విక్రమాదిత్యునిస్వర్గారోహణసమనంతరమందే మాతృగుప్తుడు కాశ్మీరదేశమును విడిచి పైకిఁబోగా ద్వితీయప్రవరసేనునికి రాజ్యము లభింపఁగా విక్రమాదిత్యప్రవరసేనులకు సమకాలికత్వమెట్లుసంభవించును. రాజతరంగిణియందుఁ గాళిదాసుయొక్కయు సేతుకావ్యముయొక్కయుఁ జేరైనఁ గానరాదు. ఈకావ్యమునుఁ గాళిదాసు రచించియున్నయెడల బాణాదులచే నతనికృతులయం దెందుకుఁ జెప్పఁబడలేదు? మాతృగుప్తునికే కాళిదాసని నామాంతరమున్నయెడల రాజ్యమును బరిత్యజించి కాశిలో నివసించువానికి ద్వితీయప్రవరసేనునితో మైత్రి యెట్లు సంభవించును? ఈవిషయమంతయు విచారసహముగా నుండలేదు. ఏలయనగా:—ఔచిత్యవిచారచర్చాదులయందు "యథామాతృగుప్తస్య' యథా కాళిదాసస్య" అని వేఱువేఱుగాఁ జేర్లు కానవచ్చుచున్నవి. కావున ననిశ్చితపదార్థమందు యాథాతథ్యగ్రహణాదరము చేఁ జాలును.

ఈమహాకావ్యమునకు కులనాథ రామదాస శ్రీకృష్ణకృతములగు వ్యాఖ్యానములు మూఁడు కలవని Dr. Theodor Aufrecht మహాశయుఁడుCatalogus Catalogarum అను గ్రంథములోఁ జెప్పియున్నాఁడు.

రామదాసనామధేయుఁడైన యీ గ్రంథవ్యాఖ్యాత పురాతన జయపురాధీశుఁడైన మానసింహమహారాజునకు సకుల్యుఁడని వ్యాఖ్యానారంభశ్లోకములవలనఁ దెలియవచ్చుచున్నది. ఇతఁడు జల్లాలుద్దీనునకు సమకాలికుడు.

"చతుర్ఖ్యాతారిశీతాంశుభిరభిగణితే (1652),సాహసాంకస్య వర్షే। వర్షే జల్లాలదీంద్రక్షితిముకుటమణే రవ్యనంతాగమాభ్యామ్। పంచమ్యాం శుక్లపక్షే నభసి గురుదినే రామదాసేన రాజ్ఞా। విఘ్నే నాపూరి తోఽయం తిథితులితశిఖో రామసేతుప్రదీపః॥ జల్లాలదీనభూపాల నిత్యసేవనతత్పరః। బభూవ రామదాసాఖ్యో విప్రాణాముపకారకః। తాదృశాన్ బ్రాహ్మణాన్ దృష్ట్వా రామదాసో మహాయశాః। వితీర్ణస్వర్ణదుర్వర్ణో బభౌ కర్ణఇ వాపరః."



# ఆంధ్ర సేతుబంధ కావ్యము.

## ప్రథమాశ్వాసము.



* ఇష్టదేవతా నమస్కారరూప మంగళాచరణము *

వృద్ధిఁ బొరయక తుంగుఁడై • వెలయు నెవ్వఁ
డప్రసారిత విస్తృతుఁ • డౌను నెవ్వఁ
డనవనతుఁడయ్యు గాంభీర్య • మొనయు నెవ్వఁ
డప్రలఘుకపరిగ్లిష్ణుఁ • డనధిగమ్య
తత్త్వుఁడైనను బ్రకటుఁడై • దనరు నెవ్వఁ
డట్టిమధువైరి దలచెద • ననవరతము.

* మధువైరికృత హిరణ్యకశిపువక్షో విదారణవర్ణనము *

గీ. లగ్నదనుజేంద్ర వక్షస్థ • లసృభూత
రక్తమచ్ఛ ప్రభాపూగ • రంజితమయి
డంబుమీఱెడు నెవనిన • ఖంబు గళిత
కుచయుగాంశుక రీతిని • గొనబుఁజూపఁ
బరచె భీతిల్లి దైత్యేంద్రు • భాగ్యలక్ష్మి. 2

* కృష్ణుఁడు వృషభరూపుఁడైన అరిష్టాసురునివధించుట *

గీ. మురమథను భుజవినిష్ఠుర • పరిగృహీత
మతుల పీనత దుర్గ్రాహ్య • మసమవలిత
మగు నరిష్టునిగళమున • కధిక బాధ
కలుగఁ దజ్జీవితము వ్యతి • క్రాంతమయ్యె. 3

* కృష్ణునిపారిజాతాపహరణ వర్ణనము *

గీ. శ్లాఘ్య గుణమూల లబ్ధను, స్థామయుతము
ధాత్రి నవగాథవేష్టన, త్వమునమించు
నాకి కుజమూపఁదీసిన, నందసుతుఁడు
జిష్ణుయశమును దున్రించెద, చ్ఛిఘము మాడ్కి. 4

* శివస్తుతి *

గీ. ఎవని నర్తన సమయమం, దిర్లుగోలుపు
కంఠకాంతినిఁ గలిసిన, కంటిచిచ్చు
సెగలతోఁగూడి నటురవ, చితమురాజ
దట్టహాసము నైపొల్చు, హరిద నీక
మూర్ధ్వసంప్లుష్ట తిమిరాళి, యాస్వఁదాల్చు
నట్టి గిరిజేశు పాదంబు, బట్టికొనుఁడు. 5

గీ. ఎవని నర్తనసమయమం, దింపుమీఱ
హృష్టరోమాంచిత స్తన, మీఁడు లేని
రాగగరిమ విముగ్ధంబు, రాజదితర
భాగసంప్రేప్సునైయొప్ప, వామభాగ
మల్లన వడంకె భీతిచే, నాఁగెలజ్జ. 6

* శివాట్టహాస వర్ణనము *

గీ. దిశల కడలకుఁ గ్రమ్మరి, తిరిగివచ్చి
హెచ్చుగు ప్రతిధ్వనులగూడి, యెవనియట్ట
హాస విచ్ఛేదములు చంద్ర, హారినిశలఁ
బర్వు నభమున జ్యోత్స్నాప్ర, వాహరీతి.

* శివుని నృత్యమందు సముద్రజంతుక్షోభము *

గీ. ఎవని నృత్యంబునందు నీ • యేడు జలధు
లతివరిక్షోభజనిత భ • యప్రకంపి
తోరుమత్స్యౌఘ నిహత నీ • రోత్కర ప్ర
వేగములు వారిపూరణ • వికటదూమ
పుంజ బడబా ముఖంబులై • పొల్పెసఁట్టి
శివుని పాదాంబుజంబు సం • సేవ్య మెపుడు. 8

* కవి తన అనవధానమును దొలగించుకొనుటకుఁ
గావ్యము దుష్కరమని చెప్పుచున్నాఁడు *

గీ. అనవధాన కృతస్థలి • తాళియందు
మరల సంస్థాపితంబైన • మైత్రిసగిది
నూతనావనినాథ ప్రి • ణీతమైన
కావ్యకథ నిర్వహించుట • కష్టతరము. 9

* కావ్యమువలన లాభములు. *

గీ. వృద్ధినొందును విజ్ఞాన • విభవ మమల
కీర్తి గలుగును సద్గుణ • పూర్తియొసగు
బుణ్యపురుషుల చరితంబు • బోధసేయు
నేమిఫలమియ్య దిక్కావ్య • మిద్ధగుణము. 10

* నిర్దుష్టమైన కావ్యము దుర్లభము. *

గీ. ఇచ్ఛమీరిన ధనబుద్ధి • యింపుగులుకు
జవ్వనంబందు గిణనీయ • సచ్చరిత్ర
మెట్టులోకనికి దుర్లభం • బట్లె కవికి
నవ నవార్థంబు బంధసౌష్ఠ • వము నొక్క
చోట ఘటియింప దుష్కర • మాటనిజము. 11

* కర్తవ్యమైన కావ్యమునుఁ జెప్పుచున్నాఁడు. *

గీ. త్రిదశ బందీవిమోక్షంబు ♦ త్రిభువనస్థ
శోకశంకు సముత్పాట ♦ నైకపటువు
జనక నృపనందినీ దుఃఖ ♦ సంక్షయంబు
ననయమనురాగ చిహ్నిత ♦ మైదనర్చు
రావణవధంబు వినుఁడీ రు ♦ రక్తితోడ. 12

* ఇఁక సత్కృత గ్రంథకథా ప్రస్తావన *

గీ. అమిత శాత్రవదూషిత ♦ హరితనూజుఁ
డనెడు మనమున రాఘవ ♦ మనసిజేషు
విద్ధయై రాజ్యలక్ష్మిన ♦ మిద్ధయశుని
దినకరాత్మజు నభిసరిం ♦ చెను ముదమున. 13

* వర్షకాల మంతమయ్యెనని చెప్పుచున్నాఁడు *

క. వ్యవసాయ రవినిశాముఖ
మవబంధక శృంఖలౌఘ ♦ మతిరుట్కారికిన్
రవివంశ్య విజయ కేసరి
నవపంజర మబ్దకాల ♦ మవసితమయ్యెన్. 14

* . రాముఁడు స్వావస్థనుఁ జెప్పుచున్నాడు. *

గీ. గడిపితి కదంబవాయువు ♦ లక్కష్టమునను
గంటిమేఘాంధకారిత ♦ గగనతలము
నైచితిని గర్జితధ్వని ♦ చయము నైన
నాశ చెడె సీతజీవిత ♦ మందు నాకు. 15

* దండయాత్రానుకూలమగు శరదృతు వర్ణనము *

గీ. సూర్య సుతకీర్తిపథము వ • సుంధరాత్మ
జాదృగశ్రువిఘాతంబు • సవితృవంశ్య
జీవితమునకు మూలమౌ • జీవగఱ్ఱ
రావణాంతకదినము శ • రత్తు వచ్చె. 16

* శరదృతు వర్ణనము. *

సీ. తరణికర కేసరౌఘంబు • ధవళ జలద
దళసహస్ర పరీతంబు • దనుజవైరి
విగ్రహేక్షణ యోగ్యంబు • విధికి జనన
సదన పద్మంబుగాఁ బ్రవడి • సారసాక్షుం
పదము భాసిల్లె నాశర • త్పవ్రీతియందు. 17

* ఇంద్ర ధనుస్సు *

క. దినమణికిరణ స్ఫురితము
ఘనలక్ష్మీరత్నరశన • ఘనబుతు విలస
న్మనసిజ శరవక్త్రము సుర
ధనువత్తరిమింట దృగ్య • దర్శనమయ్యెన్. 18

* దిక్కుల నైర్మల్యము *

గీ. అభ్రకాల సమాకర్ష • ణావనత వి
ముక్తములు ధూతజలముక్స • మూహ మధువ
సంతతులు గగనపాదప • శాఖలైన
దిశలు స్వస్థానములఁబొందు • తెఱఁగుదోఁచె. 19

* దివసములు *

గీ. ఏకదేశ సువృష్టి సం • దృశ్యమాన
జలలవంబులు ప్రత్యగ్ర • సాంద్రమిహిర
తేజములు మజ్జనప్రాప్త • తీవ్రసుఖము
లహము లల్పాల్ప శుష్కభా • వహములయ్యె. 20

* భగవంతుఁడు నిద్రనుండి లేచుట *

గీ. నిరతిశయ సౌఖ్యమునను వి • నిద్రుఁడగుచు
నిజవియోగ సముత్కంఠ • నీరధి కిడి
ప్రాక్ప్రబుద్ధ రమావరి • వస్యమాన
చరణుఁడై నిద్రమేల్కాంచె • శార్ఙ్గపాణి. 21

* నక్షత్ర కాంతి *

గీ. రాత్రివేలా వికీర్ణంబు • రమ్యకాంతి
స్ఫుటవిభిన్న బలాహక • శుక్తిముక్త
తారకా మౌక్తికౌఘంబు • దారలీల
గగనపాథోధి యనుతప్ర • కాశమయ్యె. 22

* శరదృతువు వృద్ధినొందుట *

క. అసఁగెనుఁ గేకుల • రుతములు
పాడసూపెను రాజహంస • పూగవిరుతముల్
కడసనన లేడఁబోయెనొ
మొడఁదకు సప్తచ్ఛదాళి • యింపొసరించెన్. 2

* మరల నింద్ర ధనుర్వర్ణనము *

గీ. పీనవార్వాహాలగ్నంబు • పీతవృష్టి
సమయదత్తంబు దిగ్వధూ • సంఘమునకుఁ
బ్రథమ సౌభాగ్య చిహ్నంబు • ప్రకటసరస
నఖపదంబన నొప్పెడు • నాకవిభుని
కార్ముకంబు విశీర్ణతఁ • గాంచె నపుడు. 24

* చంద్రమండల వర్ణనము *

గీ. బహుళ మేఘ వినిర్ముక్త • వారిధౌత
మతిదవిష్ఠ సమాలోక్య • మతివిమలము
నైన నభమున నిర్మల • మబ్జవైరి
బింబ మాసన్నమైనట్లు • పేర్చెనింట. 25

* హంస సంచారము *

గీ. క్షుభ్యమానోరు కుముదర • జోవిలిప్త
మతిచిరాయాత మనధిగ • తాస్పదంబు
పంకజాకరదర్శన • బద్ధకుతుక
మంచగమి దెసల నత్తఱి • మించి తిరిగె. 26

* అహోరాత్రముల శోభ *

గీ. విమల చంద్రాతపాలిప్త • విశదరుచులు
దీవ్యదంబరమణిదీప్తి • దిత సుషమలు
క్షపలు శరదబ్జముఖి యుర • స్స్థలమునందు
మహితముక్తావళీ విభ్ర • మంబు దాల్చె. 27

* కమల వర్ణనము *

క. భ్రమర రుతదత్త సంజ్ఞము
శమిత ఘనావరణ తపన ♦ సాంద్రకరాశ్లి
ష్టము సలిల నిహితనాళము
కమలము సంసుప్తి సుఖితు ♦ కైవడి లేచెన్. 28

* హంస రవము *

గీ. పంచబాణ శరాసన ♦ పటురవంబు
కమలషండ పరిభ్రమ ♦ త్కంజగేహ
మంజుమంజీర నినదంబు ♦ మధుకరోక్తి
కబ్జినీ ప్రతిభాషలు ♦ హంసరుతులు. 29

* పద్మలత *

గీ. ఖండితోత్పాటిత మృణాళిఁ ♦ గమలినిఁగని
మధుమయాతామ్ర మధుకర ♦ మంజుశింజి
తంబు గల్గిన కమలంబు ♦ దయితముఖము
గాఁడలంచి జనాళివే ♦ డ్కను గ్రహించు. 30

* వాయు వర్ణనము *

గీ. బహుళ పంకేరుహామోద ♦ భరిత దిశము
మధురసార్ద్ర రజోరాజి ♦ మండితంబు
కరిఘటాగండ దానశీ ♦ కరవహంబు
భ్రమరసేవ్యంబు వనగంధ ♦ వహము వీచె. 3

* పద్మలతా వర్ణనము *

గీ. కంటకితగోపితాంగియుఁ • గాలవశత
వదలుచుండెడి ముగ్ధస్వ • భావ దివస
నాథ కరచుంబ్యమానమౌ • నళిని ముఖముఁ
వోలెఁ జూపదు కమల మ • కాలమునను. 32

* భ్రమర వర్ణనము *

గీ. సప్తపర్ణసుమోత్కర • సాంద్రధవళ
ధూళిసంవృత గాత్రంబు • లోలకుంభి
తుండిక కర్ణాగ్ర చామర • చ్ఛవిచరిష్ణు
బంభరవ్రాత మిభ దాన • పంకమపుడు
డాయ భీతిల్లి యవలకుఁ • బాయుఁదొడఁగె. 33

* రాముని విరహావస్థ *

గీ. రాజులెల్లరు రిపురాజ • రాజ్యలక్ష్మి
కరముఁ జేపట్టు రాత్రిము • ఖంబునూర
పంకజాక్షి ముఖాంభోజ • బద్ధవైర
చంద్రదీధితి కన దుడు • సంచయంబు
హసితకుముదాకరం బెట్టు • లాశరత్తు. 34

* హనుమంతుడు లంకనుండి తిరిగి వచ్చుట *

గీ. వేగ దరియంగ నవనిజా • విరహాకీలి
కృశశరీరుఁడు సతతాశ్రు • కీర్ణముఖుఁడు
నైన రాముండు చిరగతుం • డైన హనుమ
రాయుచే వీడె మనములో • రమణీయాశ. 35

గీ. సరవిముఖ కాంతిబోధిత • స్వామికార్య
నిర్వహణుఁడైన మారుతి • నికటమునకుఁ

జింతిత సుఖోపనత కర్మ ♦ సిద్ధి నగిది
రాగఁగని సంతసిల్లెను ♦ రాఘవుండు. 36

* హనుమంతుఁడు రామునకు సీతావృత్తాంతమును జెప్పుట *

గీ. తొలిని సామీరి హర్ష ని ♦ స్తుల వికాస
భాస్వరంబగు మోమునఁ ♦ బదనడి తన
వాక్కుచేఁ దెల్పె భూసుత ♦ వార్తలెల్ల
రఘువరుండు ప్రమోదాంబు ♦ రాశిఁ దేల. 37

గీ. నాతిఁ జూచితి ననుమాట ♦ నమ్మఁడయ్యె
క్షీణయననశ్రు సంతాన ♦ సిక్తుఁడయ్యె
నీకు శోకిల్లు నన నేడ్చు ♦ నిశ్వసించె
బ్రతికియున్నది యనిపల్కఁ ♦ బావమాని
గౌఁగిలించెను రాముఁడు ♦ తత్కంతతోడ. 38

* సీతపంపిన మణి *

గీ. విపుల చింతాహత ద్యుతి ♦ విధముగలది
కాంతినిస్సహ మైనట్లు ♦ కరగతంబు
వేణికాబంధ మలినంబు ♦ రాణిమాని
కంబు రామునికిచ్చె ♦ నాగాడ్పుపట్టి. 39

* రాముడు మణిని గ్రహించుట *

గీ. ఉదిత బాష్పావసన్న మ ♦ యూఖచయము
కరతలాంజలి గతమగు ♦ తరుణిమణిని
నేత్రపుటములఁ గ్రోలియు ♦ నెలతవార్త
లడిగి రఘునేత యాత్మలో ♦ నలరెనపుడు. 40

* మణినిఁజూచి రాముడు శోకించుట *

గీ. విరళహస్తాంగుళీరంధ్ర • విగళదమల
కిరణధారానికాయంబు • కీర్ణకాంతి
మణిని వీక్షించి శోకించి • మరలదాని
మోమున ఘటించె సలిలసం • పుటముమాడ్కి. 41

* రాముని అవస్థను చెప్పుచున్నాడు *

గీ. చాన పంపిన యయ్యభి • జ్ఞానచిహ్న
మంగమం దిడకపోయిన • నవనిజాత
హస్త సంస్పర్శచేఁ బలె • నధికముగను
రాముతనువల్లి రోమహర్షణము నొందె. 42

* రామకోపమునుఁ జెప్పుచున్నాడు *

గీ. బాష్పసంక్లిన్నమయ్యెను • బంక్తికంఠ
వధసమాలోచనోద్భూత • బహుళకోప
వహ్ని దుష్ప్రేక్ష్య మయ్యెనుఁ • బ్రభుముఖంబు
చైత్ర చండాంశు బింబంబు • చందమునను. 43

* రాముని ధనుర్దర్శనము *

గీ. కుపిత లయకాల దండ భృ • ద్ఘోరవికట
భ్రూలతాస్పర్థి చిరసుప్త • భుజగవిధము
దృష్టసారంబునగు నిజ • దీర్ఘ ధనువు
నంద నిగుడించె దృష్టి నా • యవనిభర్త. 44

గీ. అంత నామూల బద్ధమై • యట నిగతము
నైన రామునిదృష్టిచే • ననవరతము
వీక్ష్యమాణంబు మసృణంబు • వెడఁదవిల్లు
వంపఁబడకయె సజ్యమై • వన్నెమీఱె. 45

* సుగ్రీవుఁడు సంతసిల్లుట *

గీ. రాఘవోపకృతి ప్రతి ♦ రచనమునకు
బద్ధదీక్షుంబ నాదృత ♦ సంక్తికంఠ
వీక్ష్యమై పేర్చు వానర ♦ విభుని మనము
కార్యభారంబు లఘువైన ♦ కరణివిరిసె. 46

* రాముని లంకాగమనేచ్ఛ *

గీ. భ్రూలతాభంగసూచిత ♦ స్ఫురదమర్ష
రసము రాక్షసజీవిత ♦ క్రోధనవిషము
పొడమె లంకాభిగమనేచ్ఛ ♦ భూమిపతికిఁ
జింతితోపనతార్థంబు ♦ చెలఁగుకరణి. 47

* రాముడు లక్ష్మణాదులఁ జూచుట *

గీ. కలయలక్ష్మణ ముఖమును ♦ గాంతివలెను
వాలి సోదరునురమును ♦ మాలవగిది
ననిలపుత్రునియందు స ♦ ద్యశముమాడ్కి
దాశరథి దృష్టి వారిపై ♦ దగులుకొనియె. 48

* రాముని ప్రయాణము *

గీ. వానరానీకవిమథిత ♦ వనపయుండు
మథితపాథోధి మేఖలా ♦ మండలుండు
క్షుభిత రత్నాకరంబున ♦ కభిముఖముగ
మథన సమయపు మందర ♦ ధరాధరంబు
కరణి నడచెను దశకంఠ ♦ ఖండనుండు. 49

* వానరసైన్య సంచారము *

గీ. చలితకోమలరుగ్రాజి ♦ విలసితంబు
దినకరుని కిరణజాలంబు ♦ తీరునఁ దరు.

చరబలంబు గృహీత ది • క్చక్రమగుచు
నడచె రాముని వెనుకను • పుడమి వడఁక. 50

* కపిసైన్య వృద్ధి *

గీ. శాత్రవారణిదీప్తంబు • సౌమ్య హీన
రోషపవనాహతోద్ధతో • రు స్వనంబు
దానవావాస వనదాహ • దావవహ్ని
రామమార్గానుగతము శా • ఖామృగాళి
పెరుఁగుచుండె మహోదధి • పేర్మి మించి. 51

* రాముని ప్రయాణము *

గీ. పటుల కేసర సటల ను • జ్జ్వలితమైన
ప్లవగ సేనా సమూహ సం • పరివృతుఁడయి
నడచె రాముఁడు రాక్షస • నగరివైపు
హరిదుపానీత లయదీప్ర • గిరి నికాయ
సంకులాంభోధి చాడ్పున • శంక లేక. 52

* రాముని దిఙ్మోహము *

గీ. తపన కరజాల సంశోభి • తములు ముక్త
వారివాహావరోధము • ల్వరుస దిశలు
జ్మాసుతాగత శోకాంధ • కాంత మగు
రాము మానససీమను • భ్రాంతిఁ గొలిపె. 58

* వింధ్యగిరిని సమీపించుట *

గీ. చాపతుల్యాకృతి వహించు • సంద్రముఁ గను
సంహిత శరాసనము పార్శ్వ • సంఘటితము

గుణమువలెనున్న వింధ్యాద్రి • కుధరవరముఁ
జూచె రాఘవుఁ డత్తఱి • జూడ్కులలర. 5

* వానరౌద్ధత్యము *

గీ. మసృణశిఖరాగ్రదేశంబు • మథిత కటక
వృక్షషండ ప్రకాశిత • విపుల తటము
కుజవరానీక సంభృత • కుహరగర్భ
మద్రి కపిపాతమున భగ్న • మయ్యె నంత. 55

* వానరసైన్యము సహ్యగిరికి వచ్చుట *

గీ. సలిలకణ సిక్త ధాతుద్రు • షన్నిషణ్ణ
రాజితాంబుద తతి నిర్ఝ • ర ప్రహసిత
కందరాముఖ నిర్యాత • గాఢ వకుళ
మద్యగంధంబు సహ్యాద్రి • కుద్యతులయి. 5

* గిరినదీ లంఘనము *

గీ. కపులు చూచుచు నడచిరి • కమ్ర సలిల
బింబిత వళక్ష వారిద • బృందములను
స్ఫటిక పాషాణ సంకుల • స్ఖలితగతిని
మీఁది కెగసినచందము • మీఱు నదుల. 5

* కపుల ఉద్ధత సంచారము *

గీ. తటయుగోత్క్షిప్తములును సం • దళిత భుజగ
ధామగళితాంబుపూర రి • క్తంబు లగుచు
నఖిల స్రోతస్వినీ ప్రవా • హంబు లపుడు
ప్లవగపాతంబుచే నుహా • పథము లయ్యె.

* కపులు మలయపర్వతముఁ బొందుట *

గీ. ఖండితోద్ధృత చందన • కాననంబు
ప్లవగసైన్యంబు జలధర • వారితోగ్ర
దానవహ్ని నవీభూత • తరుగహనము
నిత్యశైత్యగుణప్రాప్త • నిద్రయు నగు
మలయ మత్తటి వీక్షించె • మార్గమందు. 59

* చందనవృక్షాలోకనము *

గీ. చందనానోకహవ్రాత • సక్తము లయి
ఖండితోద్వేల్లిత లతాళి • కల్పము లయి
లగ్న నిర్మోక ధవళిమా • లయములు నయి
తనరు వృథుభోగిభోగవే • ష్టన పథములఁ
గనిరి మలయాద్రిపైఁ బ్లవం • గమము లపుడు. 60

* గిరినదీ ప్రవేశము *

గీ. తీరవర్ధిత విటప వి • స్తార భార
వినత రోహిణతరుషండ • వేష్టితములు
రమ్యతృణ దీప్రపథము ల • రణ్య దంతి
దానసురభులు గిరినదు • ల్గానఁబడియె. 61

* సముద్ర ప్రాప్తి *

గీ. శుక్తిసంపుట దర్శిత • శోభమాన
తోయ నిక్షిప్త ముక్తాని • కాయ రుచిర
బహుళవర్ణవిరాజిత • వకుళవాటి
దాన సౌగంధ్య సురభి ర • జోనవైల
వేలఁ గాంచిరి ప్లవగు ల • వ్వేళ నచట. 62

* సముద్ర వర్ణన. *

గీ. వికచ తాళసంఛతరునీల • విచలదూర్మి
కర పరామృష్ట సంఫుల్ల • సురభిశైల
కంధి దంతావళేంద్రు ను • త్కట మదాంబు
ధారవలె నొప్పు వేలను • వారు గనిరి. 63

గీ. విద్రుమవ్రాత దంతక్షత ద్రుతోష్ఠ
రమ్య డిండీర రచితాంగ • రాగ మృదిత
విపిన కబరీ లతాంత సం • పృక్త జలధి
భోగ పరిచిహ్నములఁ దాల్చు • పోల్కి నమరు. 64

గీ. అల్లిబిల్లిగ నల్లిన • యలరుఁదీవ
యిండ్లలోఁ జెరుఁగుచుండెడు • నింపుమీఱు
కిన్నరుల గాన రవమును • గీలితాను
రాగమున శుక్తి సంపుట • రమ్య నేత్ర
యుగము ముకుళించి వినుచున్న • యువిదఁబోలెఁ
దనరు వేలను గాంచెన • వ్వనచరాళి! 65

ప్రథమాశ్వాసము_సమాప్తము.



# ఆంధ్ర సేతుబంధ కావ్యము.

## ద్వితీయాశ్వాసము.

### * సముద్ర వర్ణనము. *

గీ. మత్స్య కచ్ఛప నక్రాద్రి • మారక జల
జంతు విస్తార దుర్లంఘ్యు • సలిలపూర
మమృత రససార గురు కంబు • నంబురాశిఁ
గాంచె నిక్ష్వాకు కులజుఁ డు•త్కంఠ మీఱ. 1

గీ. అంబరానికిఁ బ్రతిబింబ • మనఁగ దిశల
నిలయ మన వార్ధి రశనకు • నిర్గమ మన
విశ్వమున కైన మణిమయ • భిత్తి యనఁగఁ
బ్రళయ సమయాన మిగిలిన • జలమనంగ. 2

గీ. అంతరిక్ష విచుంబి మ • హా తరంగ
కర నిరాహత దిగ్వ్యాప్య • ఖండజలము
నిత్యమదమత్త దిగ్గజ • నిభ శశాంక
కిరణజాల పరిక్షోభ • కీర్ణ జలము. 3

గీ. స్త్యాన రక్తాంకితమ్ములు మంథాన కుధర
నిహతి సంజాత వ్రణముల • నేటికి నది
తాల్చియున్నట్లు విద్రుమ • లతము లైన
పృథు తరంగ సమూహంబుఁ • బెంచుదాని. 4

గీ. విసదదంభోధరవ్రాత ♦ వితత మఖిల
రోదసీరంధ్ర భరితంబు, రూఢి లసిత
మానగాముఖ పర్యన్త ♦ మంబు నివహ
మాత్మగతమైన నిర్మల ♦ యశము వగిదిఁ
దాల్చి యాశ్చర్యనిలయమై ♦ తనరుదాని. 5

గీ. జ్యోత్స్నచేఁ జంద్రుకైవడి ♦ సుజనుగతిని
యశముచే సూర్యుచాడ్పున ♦ నధిక కాంతిఁ
బృథు తరంగిణిచే భూమి♦భృత్తు భంగిఁ
జిర వినిర్గతమైన శ్రీ ♦ తరుణిచేత
నపరిహీణ దశావత్తి ♦ నలరుదాని. 6

గీ. కల్పవిగమాంబు సంధోహ ♦ ఘస్మరంబు
పవన గమనావవర్తన ♦ బాధ్యమాన
మంగలగ్న శిలీముఖ ♦ భంగిఁ దనరు
నౌర్వశిఖిచేత సంతప్త ♦ మైనదాని. 7

గీ. కంపితాశేష వనరాజి ♦ కర యుగళిని
మలయ మాహేంద్రగిరియుగ ♦ మధ్యభాగ
ముఖర పృథులోర్మి సంశ్లిష్ట ♦ ముక్తమహిని
వడఁకునట్టులఁ జేసెడు ♦ చెడుగుదాని. 8

గీ. తనదు మర్యాదఁ ♦ దప్పక ♦ స్థానముననె
నిల్చుదానినిఁ బ్రళయాన ♦ నిఖిల ధరణీ
వలయమందున నిముడక ♦ వర్ధమాన
వామనుని మాడ్కి మీదికిఁ ♦ బెఱుఁగుదాని.

గీ. ఎంతఁజూచినఁ గనులకు • వింతఁగొలుపు
నెంత విన్నను వీనుల • కింపు నింపు
సుకృత పరిణామమునుం బలె • సుస్థిరంపు
సుఖ పరంపర నీనెడు • సొబగుదాని. 10

గీ. చిర పరిత్యక్త లక్ష్మియై • క్షీణతఁ గని
కృత్తభూరుహమైన భూ • భృత్తు కరణిఁ
బ్రబల హిమపాత దూషిత • పద్మిని గతి
మద్యవిరహిత పాత్రంబు • మాడ్కిఁ జంద్ర
హీన నిశవలె రిక్తతఁ • బూనుదాని. 11

గీ. సర్వతోవ్యాప్త రమ్య తే•జంబు విమల
వారి మధ్యస్థితంబు పం • కేరుహాస్త
కిరణజాల స్ఫురద్దీప్తి • ధరము వివిధ
రత్నరాశిని ధరియించు • రమణదాని. 12

గీ. మథనకాల సముద్ధిత • మాన కాయ
కష్ట సంభిన్న వాసుకి • కంఠ కుహర
మిశ్రితోగ్రవిషంబన • నెగడుపట్టి
బాడబానల కీలలఁ • బ్రబలుదాని. 13

గీ. స్థైర్యమున నొప్పు జల సము•దాయ మలరఁ
బక్షయుత పర్వతావళి • భాతి తిములు
నిమ్నగావళిమాడ్కిని • నివ్వటిల్లు
నూర్మిజాలంబు గుణముల • యొప్పు గలుగు
రత్నరాశుల వెలుఁగు పూ•రంగుదాని. 14

గీ. వికట పాతాళకుక్షి గాం • భీర్యశాలి
నభమునందు నిరాలంబ • నము ధరాతి

రిక్తమయ విశ్వమున హరి • రీతిఁ దనదు
ఖాతమున సంచరింపఁగఁ • గడఁగుదాని. 15

గీ. దరికిఁ జనుదెంచి వీచుల • తాకుడువడీ
త్రోలఁగిపోవుచు వడఁకునఁ • దూలి మఱల
ననుశయముఁ జెందువారల • యనువుమీఱఁ
గలియు స్రోతస్వినులచేతఁ • బలియుదాని. 16

గీ. అఖిల సౌఖ్యంబుల నిదాన•మై స్వకుక్షి
నవతరించిన లక్ష్మిచే • నసురజాతి
కతిప్రియంబైన వారుణి • యనెడు శీధు
వరముచే లోకమత్తత • నెఱపుదాని. 17

గీ. తరళమయ్యును మర్యాద • దాఁటనిదయి
క్రతుభుగుద్ధృత రత్నని • కాయ మయ్యు
నధిక సారాస్పదంబయి • యమర నికర
విమథితంబయ్యు విక్షతిఁ • గననిదాని
క్షారమయ మయ్యు నమృత ర•సంబుదాని. 18

గీ. శక్రభయమున లోన సం•స్థాపితముల
పగిది పర్యాప్త రత్నగ•ర్భములు గగన
శాఖి పర్యస్త చంద్రమ•యూఖ జాల
సత్ప్రరోహంబు లనఁదగు • శైలములను
కడుపులో నిడి కాపాడఁ • గలుగుదాని. 19

గీ. సారిది దయితా సమాగమ • సుఖ నిమిత్త
మైన నవయౌవనంబున • సూనశరుని
వృత్తికై వడి శశివచ్చు • వేళ హెచ్చు
తదపసరణంబునను తగ్గుఁ • దాల్చుదాని. 20

గీ. స్ఫుటిత శుక్తి ప్రతాన సం • పుట విముక్త
శంఖముఖ సంభృతానల్ప • చారు మౌక్తి
క వ్రజంబు సమీరణో • ద్ఘాటితాంబు
వాహ నికరంబునై సదా • వఱలుదాని. 21

గీ. మరకతౌఘ ప్రభా లేశ • హరితవర్ణ
జరత విద్రుమ కిసలయ • సంఘధరము
వజ్రిగజ దాన గంధ సం • బంధనున్న
వారిగజదత్త ముఖపటు • ప్రతిమ సలిల
వాహ సంఘాంచితంబునై • వఱలుదాని. 22

గీ. తీరవృద్ధ లతాగృహ • దీప్ర రాజ
సౌధమండలి భుజగేంద్ర • సదన మంబు
వాహ వితతికి జలదాయి • వసుధ నెప్డు
దాఁటకుండెడు మర్యాదఁ • దనరుదాని. 23

గీ. విధు మయూఖ ప్రణోదన • వేపమాన
జలము గరుదన్వితాహార్య • సార్థ మథిత
మతుల ధైర్య స్వరూపంబు • బౌర్వ వహ్ని
తాస్యమానంబు ముఖర వా • ర్ధర నిపీయ
మాన మస్థిరమై యొప్పు • దాని గనిరి. 24

గీ. నిజ విషానల సంతప్త • నిబిడ మౌక్తి
కౌఘ చూర్ణ విలిప్త కా • కోదరాళి
మత్స్యగతి మార్గ శైవాల • మలిన కాంతి
మణిశిలా సంఘముల నెంతొ • మలయుదాని. 25

గీ. చక్రపాణి ప్రియాప్రియ • పారపద్మ
నిమ్నగాజాత సంకుల • నీర పూర

మాపగా ముఖ నిర్గమ • నాగ మాది
నిరత వేలాప్రవాహంబు • నెఱపుదాని. 26

గీ. బహు సహస్రనదీముఖ • స్పర్శ విదిత
రసము లయకాల మేఘ గ•ర్జన సమాన
దుస్సహోగ్ర నినాద ము•ద్ధుర మహోర్మి
పవన సంచాలితంబయి • పరగుదాని. 27

గీ. శక్రనీలమణీద్యుతి • శార వారి
పూర సంప్లవమాన డిం•డీర పటల
మంబుజాతాక్ష శయన భు•జంగనాథ
భయద నిశ్వాసమారుతా•వర్త జలము. 28

గీ. సతత కల్లోల మాలికా • సంకులంబు
సాంద్ర విద్రుమ పల్లవ • చ్ఛవి నిషక్త
సర్వతోవ్యాప్త తాహిత్య • సంక్రమంబు
పక్షిగణ కూజితారావ • భాసితంబు. 2

గీ. అమల ముక్తామణీశ్రేణి • కాస్పదంబు
విబుధ సంఘ వితీర్ణ జీ•విత సుఖైక
కారణామృత జన్మ జ•గత్ప్రసిద్ధ
మంబువాహంబుదాయక • మైనదాని. 3

గీ. అతిచిరోత్పన్న శైవాల • హరిత శిలము
పవన భిన్న రయాభీల • రవ జలంబు
విష్ణుదేవుండు నిద్రకై • విశ్రమించు
దేశమని పెద్దలందఱుఁ • దెలుపుదాని.

గీ. దానవాపాత విఘటితోద్దామతోయ
వివర సంఘ సముద్ధత • భీష్మ నాగ

భువన సృష్టోష్మ నివహంబుఁ • బూనుదాని
మథనవశ భిన్న మందర • క్ష్మాధరేంద్ర
తట వృషత్ఖండ నికరంబుఁ • దాల్చుదాని. 32

గీ. ఇదియె యమృతరసోత్పత్తి • కిరవటంచు
నెన్నఁబడునది నభముతో • నీడుగలది
తిమిర కీర్ణ చతుర్దశ • మమిత రత్న
జాతమున కిదియె చూడుఁడు • జన్మభూమి. 33

గీ. మారుతోద్ధూత జల లవా • సార నిహత
తీర సంవృద్ధ నిస్వన • ద్భూరుహంబు
చంద్ర శైలాంశు నిష్యంద • సలిల వేణి
కార్ద్ర సైకత సమభిషిక్త • తాగ్రభూమి. 34

గీ. మందరాంబుద సంక్షోభ్య • మాన చంద్ర
సారసోన్ముక్త పుష్కరో • త్సంగ మునుల
మరకతావళి శైవాల • మధ్య దేశ
సుఖ నిషణ్ణాతి నిష్పంద • ఝుష రథాంగ
యుగళ సంశోభియై సదా • నెగడుదాని. 35

గీ. మహిత సరిదోఘ వార్ధిపూర • మధ్యదృష్ట
చలిత తిమితతి బకబాస్య • బిల వినిస్సృ
త వ్రభూత మషీరాశి • విస్రలేప
నీల పాతాళ గర్తంబు • నేలుదాని. 36

* సముద్రదర్శనానంతరము రాముని అధ్యవసాయము *

గీ. ప్లవగ సైన్య భరాక్రాంత • వసుధనుండి
యూర్ధ్వ సంచాలితంబయి • యుదక శూన్య

తలమునై యొప్పు వార్ధినిఁ • గలయఁజూచి
దృష్టసార మిదేపాటి • తెలిసె ననుచుఁ
బరిభవించెను రాముండు • గురుబలుండు. 37

* రాముఁడు లక్ష్మీదేవిని మరచుట *

గీ. వేరుకాలంబునను వేరు • విగ్రహమునఁ
దాను నిద్రించి విడిచిన • తల్పమైన
కవలిఁ గాంచియు జనకజో • త్కంఠ చేత
నాదిలక్ష్మిని మరచె నా • యవనిభర్త. 38

* లక్ష్మణుని ధైర్యమును జెప్పుచున్నాఁడు *

గీ. పరిఖ యని లాఘవంబునఁ • బరిభవించి
యధిక నర్మవచోగర్భ • హాస మొప్ప
వార్ధిఁ జూచియుఁ జూడని • భంగి సలరి
పల్కె సౌమిత్రి తరుచర • పతినిఁ జూచి. 39

* సుగ్రీవుఁడు సముద్రమును జూచుట *

గీ. అబ్ధిదర్శన జనిత హ • ర్షాతిరేక
పీన దీర్ఘీకృతోన్నత • ఘృద్ధ తనుఁడు
తరణిసంభవుఁడే నొక్క • దాఁటు చేత
వార్ధి పరపారమును జేరఁ • బటువు గనియె. 4

* సుగ్రీవుఁడు కపిసైన్యమును జూచుట *

గీ. వైనతేయునికై వడి • వార్ధి దాఁటు
రభసమునమున్న పద్మినీ • రమణ తనయుఁ
డచల సదృశంబు పార్శ్వ ద్వ • యాతతంబు

పక్షియుగళంబు చాడ్పునఁ ♦ బలుగుచుండు
కపి బలంబును గాంచెను ♦ కడఁకతోడ. 41

* కపుల సంక్షోభము *

గీ. కంధిదర్శన సంత్రాస ♦ కంపమాన
కాయమైన ప్లవంగ ని ♦ కాయ మెల్ల
విస్మయావిష్టమై చిత్ర ♦ విలిఖితంబు
కరణి నిస్పందలోచన ♦ ఘటితమయ్యె. 42

* వానరులు హనుమంతునివైపు చూచుట *

గీ. ఉదధి వీక్షించి వానర ♦ యూథ నేత
నివహ మత్యద్భుతోదయ ♦ నిశ్చలత్వ
మూని గౌరవబుద్ధితో ♦ నొక్కమాఱు
పడియె సామీరిపై నని ♦ వారితముగ. 43

* వానరుల మోహమును జెప్పుచున్నాఁడు *

గీ. దుస్తరంబని యెంచి యా ♦ తోయనిధిని
రాకపోకలు సల్పెడు ♦ రామదూతఁ
గని ప్లవంగులు మోహాంధ ♦ కార నిచిత
మనములనె గాంచి రుత్సాహ ♦ మనవరతము. 44

* కపులు జడీభావము నొందుట *

గీ. అంత వారాశిఁ గాంచిన ♦ యాక్షణంబ
కపులకన్నులు విగళిత ♦ కాంతులయ్యె
మనములందుఁ బ్రతానంబు ♦ మాటువడియెఁ

బ్రికృతి చాపల్య మంతయుఁ ♦ బాసి వారు
చిత్రదీపంబు కైవడి ♦ స్థిరతఁ గనిరి. 45

❋ వానరుల ఆకార గోపనము ❋

గీ. జలధి దర్శన జాత వి♦షాద హతము
గళిత గమనానురాగంబు ♦ గత విలోక
నాభిలాషంబునైన ని♦జాత్మ నపుడు
పాదుకొల్పిరి ధైర్యంబుఁ ♦ బ్లవగ పతులు. 46

ద్వితీయాశ్వాసము — ముగిసెను.



# ఆంధ్ర సేతుబంధ కావ్యము.



## తృతీయాశ్వాసము.



* సుగ్రీవుఁడు కపులను సముద్రలంఘనమునకుఁ బ్రేరణసేయుట *

గీ. అబ్ధి నెటుదాఁట శక్యమా • యనుచుఁ జింతఁ
గనులు మూసి శిలాతల • కల్పబాహు
దండములయందుఁ గూర్చుండి • త్రస్తులగుచుఁ
గుందు కపులను గన్గొని • కుపితుఁడైన. 1

గీ. సవితృసూనుఁడు నుడివె సు • స్వచ్ఛదశన
కాంతిపుంజంబు దెసలను • గ్రమ్ముకొనఁగ
నిర్మలార్థంబు నిజధైర్య • నిశ్చితంబు
శ్రోతృమానస సుఖదమౌ • సువచనంబు. 2

* సుగ్రీవుఁడు కపులను స్తుతించుట *

గీ. కోలరూపధరుండు ము • కుందునకును
భూమిభారము వహియింప • భుజయుగంబె
కడలిఁ ద్రిప్పంగ సురల ర • క్కసుల గుంపె
ప్రళయ మొనరింప జలధులె • పటు సహాయ
మాచరించిన పగిది స • య్యసురనాథు
హతునిఁ జేయఁగ మీరె స • హాయ మగుడు. 3

వానరులమైన మావలన నేమగునని చెప్పఁబోకుఁడు. మీకును శత్రుజయమువలన నవశ్యము కీర్తి సంపాదనీయము.

గీ. తనకుఁదానె లభించెడు ♦ ఘనయశమును
యాచకుండైన సుజనుని ♦ యాచ్ఞ వగిది
భగ్న మొనరింపకుఁడు మహా ♦ ప్లవగులార
వల దహంకృతి కార్య వి॰భంజకంబు. 4

మాకంటె నన్యుల కీసముద్రమును దాఁటుట అసాధ్యము. రాముఁడొక్కఁడేమిచేయఁగలవాఁడని తలంపకుఁడు. రాముఁడొ క్కఁడే యీ పనిఁజేయఁగలవాఁడని నమ్మఁడు

సీ. రాక్షసావళిఁ ద్రుంపంగ ♦ రఘువిభుండు
వారిరాశిని లంఘింపఁ ♦ బ్రతిన వట్టె
కార్యభర మతని యెదనుండి ♦ గళితమయ్యె
తోడుపడి మీరు యశముతోఁ ♦ గూడుకొనుఁడు. 5

శత్రువధకు రాముఁడు పూనుకొన్న యెడల నట్లు చేయునిమ్ము. మమ్ముల నేలఁ బ్రేరణచేయవలెను అని చెప్పఁబోకుఁడు.

సీ. తలప నీకార్యభరము మీ ♦ తలనెయుండు
నాజ్ఞమాత్రంబె యొసఁగువాఁ ♦ డధిపుఁడెపుడు
కాంతిమాత్రము ధరియించు ♦ గ్రహవిభుండు
తమ్మికొలఁకులు వికసించుఁ దమకుఁ దామె. 6

"మేము సముద్రమునే దాఁటలేము కదా, రాక్షసుల నెట్లు చంపఁగలము" అని నలుకవలదు.

గీ. జలధి దాఁటుటకే కాదు ♦ బలము మీకు
తీర సంస్థిత కేసర ♦ భూరుహాళి
కుసుమ పరిమళ వాసిత ♦ కుంభిని యుగు
నబ్ధినైనను ఫలరస ♦ మట్లు హస్త
పుటముచేఁ గ్రోలఁగల మీకుఁ ♦ బురుడెవండు. 7

గీ. దీర్ఘకాలేప్సితంబును ♦ దీటురాని
ఖలులతో స్పర్ధయనెడు శృంఖలను ద్రెంప
సతత సంత్యక్త దుర్యశో♦జాల నిగళ
బంధ మెడఁబాపి ముఖమెత్తి ♦ ప్రజలఁజూడ
నిదియె సమయంబు మీ కిప్పు ♦ డెంచిచూడ. 8

మేము ప్రేష్యులము ప్రభువు నాజ్ఞ నపేక్షించువారమని పలుకుదురేమో అట్లనఁబోకుఁడు.

గీ. ఎవ్వరని యుక్తులై కార్య ♦ మింపుమీరఁ
జేయుదురొ యట్టి సజ్జనుల్ ♦ క్షితిని విరళు
లప్రదర్శిత కుసుమంబు ♦ లౌచు ఫలము
నొసఁగు భూజంబు లరుదుగా ♦ నుండుఁగాదె. 9

గీ. ధరణిజా దీర్ఘ విరహ సం♦తాప తప్త
రామ హృదయం బమర్ష వా♦రాశియందు
బాష్పమంథరమగు దృష్టి♦ బాణమందు
స్విన్నమైనట్టి యాతని ♦ చేయి ధనువు
నందుఁ దగులకమున్నె మీ♦రరుగుఁ డనికి. 10

గీ. పంక్తికంధర తేజఃప్రభావ నృపతి
పరిగృహీతంబు విలులిత ♦ వార్ధి రశన
మంతరిక్షావరోధంబు ♦ సప్త కకుభ
భామినీ తతి మీకీర్తి ♦ పర్వఁగాక. 11

ప్రతివాఁడు తనప్రాణములను రక్షించుకొనవలయును. యుద్ధము ప్రాణసంశయమును గలిగించునని పలికెద రేమో అట్లనవలదు.

గీ. ప్రాణములమీఁద నెవ్వఁడు ♦ పటుతరాశఁ
బూని సాహసకర్మకుఁ ♦ బోవ నొల్లఁ

డట్టి పురుషుండు పరులకు ♦ నల్పమైన
నుపకృతి నొనర్పఁజాలఁ డీయుర్విలోన. 12

ఎంత స్వల్పమైన కార్యమునకైనను తొందరపడవలదు. బాగుగ నాలోచించి చేయవలయునని పలికెద రేమో అందుకు చెప్పుచున్నాను వినుఁడు.

గీ. ఎఱుఁగ రే మీర లీపని ♦ యెంత ఘనమొ
తొలుత నీపత్కారంబని ♦ తోఁచుచున్నఁ
దుదకు విఘ్నహేతంబయి ♦ యెదఁ గలంచు
మర్దితంబైన విష కుసుమంబు మాడ్కి. 13

ఈపని దుర్లభమని తలంపకుఁడు. యత్నించిన సాధ్యమగును.

గీ. సురపథంబున దినకరుం ♦ డరయ నేకి
చక్రరథమును నడిపింప ♦ శక్తుఁడైన
కరణి దక్షులు పురుష దుర్గమ పథంబు
నందుఁ దమశక్తి యత్నంబు ♦ లావరింతు. 14

సముద్రము దాఁటినను ఖడ్గాది యుద్ధసాధనములు లేని మే మేమిచేయఁగలమని అందు రేమో అది కాదు నామాట వినుఁడు.

గీ. కృత సమీకాది కార్యముల్ ♦ కీర్తిదములు
తాళసదృశ భవద్బాహుదండములను
జూచికొని రాజసత్వ విశూన్యులగుదు
రంత్రిముఖ రాజసత్వంబు ♦ పాతమొంద. 15

మేము సముద్రమును దాఁటలేము అందువలన మాకు నీచత సంభవించునేమో యని పలుకవలదు.

గీ. దృష్టి సంత్రాసితాఖిల ♦ దితి తనూజుఁ
డధిక సంక్షోభితాంభోధి ♦ యనిలసుతుఁడు

తీరమందున్న మనలన • వీరులనుచుఁ
బరిహసించుచునున్నాఁడు • ప్లవగులార. 16

గీ. అవ్యయచ్ఛిన్న సంవ్యాప్తి • యంబుజాప్త
కన దురుచ్ఛాయవలె తీర • గాఢతేజ
మాపఁ గోరు ప్రవాహంబు • ననుకరించి
విషమములయందు దొట్రిలి • వృద్ధినొందు. 17

సముద్రమును దాఁట లేమను మీ గొప్పతనము హనుమంతు నిచేఁ దిరస్కరింపఁబడినది.

గీ. మాన్యవంశ క్రమాయాత • మాన రూఢ
మనవనతపూర్వమై వెల్గు • నాత్మయశముఁ
బరులు దూషింప మది గల్గుఁ • వగఁ దలంప
నైన శక్యమె యనుభవమ్మునై యుంచు. 18

కష్టపడియైనను కీర్తిని సంపాదించుట శ్లాఘనీయము.కష్టమని విడువకూడదు.

గీ. వర్ధమాన మహోత్సాహ • భాసితంబుఁ
గళిత రణసుత్సరావాప్త • మలఘు సుభటఁ
శబ్ద మితరులనుండి సంసాధ్యమగును
గాన కపులార కీర్తినిఁ • బూనవలయు. 19

గీ. యుద్ధ నిశ్చిత మానసు • లుత్సవముల
వ్యసనములయందు సమచిత్తు • లవశనీత
విపదశలందు సైతము • వికృతి లేక
వీరులగువారు తమ పనుల్ • దీర్పఁగలరు. 20

ఇప్పుడు మేము కష్టపడినను ఫలనిర్ణయ ముండదని చెప్పఁ బోకుఁడు.

గీ. ప్రాణసంశయ మొదవిన • నట్టులందుఁ
బాము విషమునుగ్రక్కిన • భంగి నెవఁడు
జూపు క్రోధంబు నట్టిడు,నూవె యశముఁ
గార్యతృష్ణాళువై గ్రోలు • ఘనుఁడు జగతి. 21

కష్టము లేనిది కీర్తి లభించదు. మాకు కీర్తితోఁ బని లేదు. నిరపాయముగా నుందుముగదా అన్నందుకుఁ జెప్పుచున్నాఁడు.

గీ. దందశూకంబు లుత్థాత • దంష్ట్రలైన
చాలకాలము జీవించు • క్షూత్రతలమున
హరులు పంజరబద్ధంబు • లైన నైనఁ
ఘను లఖండిత పౌరుషుల్ • ఖలుల చేతఁ
బరిభవము నొంది క్షణమైనఁ • బ్రతుక లేరు. 22

గీ. చేయనలసిన కృత్యంబుఁ • జేయ లేక
మీరు మీయిండ్ల కరుగంగ • మీదు చింత
సమ్ముఖాలోక మాత్రాన • సంక్రమించు
ముకురములయందువలె మీ వధూముఖములందు. 23

గీ. వార్ధి గంభీరములు చిర • ప్రసృతము గు
నదుల విపరీత పథముల • నడపవచ్చుఁ
గాని ప్రభునాజ్ఞఁ బచరింపఁ • గడఁగు సుజనుఁ
బట్టుదలనుండి మరలింప • వశముగాదు. 24

సముద్ర మిదివఱకెవ్వరైన దాఁటినారా? కపులమైన మేము దాఁటుటకంటే చెప్పుచున్నాఁడు.

గీ. సూర్యుఁ డెద్దాని లంఘించు • సులభముగను
విలయకాలాగ్ని చే నెద్ది • వేఁగిపోవు

నట్టి పరిభూతి నొందిన • యంబురాశి
ప్లవగులగు మీరు దాఁటంగ • నవశమెట్లు. 25

అబ్ధిలంఘన మతిదుష్కరముగావున మాచేతఁ గాదనఁబోకుఁడు.

గీ. జాతికంతకుఁ గలిగించు • సద్యశమును
బడయఁగోరెదు మీరు మీ యెడఁద నెంచుఁ
డబ్ధి యపకీర్తి యను నీ ద్వ•యంబులోన
దాఁటుటకుఁ గష్ట మెద్ది వ•నాటులార. 26

అపకీర్తినైన భరింపవచ్చునుగాని సముద్రమును దాఁటజాల
మన్నందుకుఁ జెప్పుచున్నాఁడు.

గీ. చంద్రశారదమేఘంబు • శైల సదృశ
సారులగు మిమ్ము నోడించి • జనకరాజ
పుత్రికాలాభ సంతాప • ప్లుష్టహృదయు
రాము వజ్రాగ్నిఁ గొట్టక • యేమగాక. 27

సముద్రమును దాఁటుటవలన నిష్టసిద్ధియు నదిచేయకపోవు
టచే ననిష్టమును గనపర్చుచున్నాఁడు.

గీ. జగతుఁడైనను వినయంబు • పరిఢవిల్ల
సేవఁ జేసిన వశగుఁడౌ • స్నిగ్ధబంధు
సదృశుఁడౌ నన నిర్వ్యాజ • హృదయబంధు
వుత్తమశ్లోకుఁ డాశ్రి•తోపకారుఁ
డీ రఘూద్వహుఁ జెప్పంగ • నేల మనకు. 28

గీ. సమరయత్నంబు మీరలు • సలుపకున్నఁ
గొలఁదికాలముక్రిందట • మొలిచియున్న
తీఁగవలె రాజ్యలక్ష్మియు • వేగ ఫలము
నొసఁగఁజాలక ముకుళన • మొందియుండు. 29

గీ. మీ సహాయము లేకున్న ♦ నేటికైన
దాశరథి కిట్టి బాధక ♦ దశ మహింతో
కాల ముండదు కమలాక్షఁ • గలుగునిద్ర
వేకువనె వీడిపోవును ♦ మీకుఁ దెలుసు. 30

రాముఁ డిట్టి సమర్థుఁడైనచో నిర్వీర్యునివలె
గానవచ్చుటేమి?

గీ. సకలజీవ ప్రపంచ వి ♦ సార్యమాణ
సత్ప్రతాప సముద్దీప్త ♦ సకల దిశుఁడు
నగు సరోజాత బాంధవు • నంపువలెను
సజ్జనునియందు మలినత • స్థాయికాదు. 31

ఉపకారికిఁ బ్రత్యుపకారము చేయవలెను.

గీ. సత్పురుషమార్గనిష్ఠుఁడు ♦ సవితృవంశ
సంభవుఁడు జానకీజాని • సల్పినట్టి
యుపకృతికి మన మొనర్చు న•ద్యోగ మెన్న
నెనయునో లేదొ విముఖత ♦ నెంచ నేల. 3

రావణవధ మిక్కిల దుష్కరమంటే చెప్పుచున్నాఁడు.

గీ. ప్రాంశుతమమైన భూరుహ • ప్రవర మొకటి
శిఖర పతితోగ్ర నిర్ఘాత • శీర్ణమైన
మాడ్కి రఘురామ శరభిన్న • మస్తకుఁడయి
సమయు దశకంఠుఁ డిక లేదు ♦ సంశయంబు.

రాక్షసు లతిబలవంతులు వారు మనుష్యులను నశింపఁజేయు
దురు. రావణు నెట్లు జయింపఁగల మనఁగా,

గీ. భ్రామ్యమాణానలాలాత • బహుళ నిర్య
దవిరళాంగార నివహ స•చ్ఛవి వనాట

బలము వీక్షించుటకునైన • పటిమలేని
యసురులనెంత మీకిఁక • నాజిలోన. 34

రాక్షసులమాటకేమిగాని రావణుఁడు మహాబలశాలి. వాని నెట్లుజయింపగలము అని పలుకగాఁ జెప్పుచున్నాఁడు.

గీ. అన్యమాతంగదాన గం • ధానువిద్ధ
సునిశితాంకుశ విక్షత • ఘన శిరములు
నైన గజములవలె వీరు • లడ్డులేని
వీర్యమును జూపుదురు వైరి • బృందమందు. 35

మాకంటె నన్యులెందఱు లేరు. వారు సహాయము చేయకూడదా అంటే చెప్పుచున్నాఁడు

గీ. విషమదశలందు నైతము • వికృతిలేక
కార్యభారంబు వహియింపఁ • గలుగువాఁడె
ధూర్వహుఁడు సూర్యును పరాగ • దోషమందు
దినము రాజిల్లఁ జేయునే • వనజవైరి. 36

గీ. ముక్తసలిలంబులైన జీ•మూతములును
దత్తనూతన ఫలములౌ • ధరణిజములు
జన్య ధాత్రీప్రయుక్త శ•స్త్రములునైన
వీరభుజములు లఘువులై • వెలితిఁగొన్నఁ
గార్యకర్తృత్వమునఁ జెందు • గౌరవంబు. 37

మాకు యుద్ధసామగ్రియే లేదంటే చెప్పుచున్నాఁడు.

గీ. వైరిదర్పంబు నడఁచు మీ • బాహుబలము
కొట్ట సులభము శత్రులఁ • గొండలు గొని
గగనపథముండె రాకపో•కల నొనర్ప
నట్టి సాధనవంతుల • లైన మీకు
బవరమున జంకనేలయో • ప్లవగులార!. 38

రామ, ప్రాణాలను విడిచిపెట్టి మేమే కొండలు పట్టుకొని సము
ద్రమును దాఁటి వెళ్లి లంకను ముట్టడింతుమూ అంటే నివారించు
చున్నాఁడు.

గీ. సత్పురుషు లాత్మధైర్యంబు సాఁకికొనుచు
నిర్వహించెద రురు కార్య • నివహ మెప్పుడు
తపన రశ్ములు తమతావు • దప్పకుండ
దేజరిల్లంగఁ జేయవే • త్రిభువనంబు. 39

ఈపని కొందఱు సమ్మతించిరి. మఱికొందఱు సమ్మతింప
లేదు. ఇది సర్వసమ్మతము కాదు గావున మేము చేయుమనఁగాఁ జెప్పు
చున్నాఁడు.

గీ. యాసలంఘిత సైన్యాగ్రులైన ఘనులు
ధైర్యసంపన్నరూఢాత్మ • కార్యభరము
నిజబలంబును దొలి గెల్చి • సజవ శస్త్ర
పాతములఁ బర బలంబును • పరిభవింత్రు. 40

మాకు దృష్టసామగ్రియున్న నదృష్ట సామగ్రి లేదు గావున
యుద్ధమునకుఁ బోనేరము అంటే చెప్పుచున్నాఁడు.

గీ. వైరివిధ్వంసనార్థమై • ప్రస్థితుఁడగు
వీరపురుషుని శుభములు • వెంట నంటు
విజయలక్ష్మి వరించును • విమల యశము
వృద్ధినొందును బెరుగును • యుద్ధకాంక్ష. 41

గీ. దృష్టసుభటాళి కృష్టని • స్త్రింశమార్గ
పాతు లతిభూమిగంబులు • వైరబంధ
ములు విలూన పతత్త్రిముల్ • భూమిధరము
లట్లు రెండవచోటికి • నరుగలేవు. 42

గీ. మీ విషాదభరంబుచే • మీ సుధైర్య
మెంతకాలంబు భగ్నమౌ • నంతదనుక
రఘువిభుండును శోకించు • రమణి సీత
చెక్కిటను చేయిఁ జేరిచి • చింత నొందు
బ్రతికియుండును పౌలస్త్య • పరిబృఢుండు. 43

మేము ప్రకృతి కార్యోన్ముఖులమయినను విషణ్ణులమని మీరు గ్రహించినయెడల నన్యుల సహాయమును గోరుకొనుఁడుఅంటే. చెప్పుచున్నాఁడు.

గీ. తనమనస్సున కన్యులమనసు వేరు
యే నెఱుంగను మీ మన • మెట్టులుండొ
అక్షసంగ్రామ రూఢ వ్రణాంచితాంగు
హనుమఁ గని నా మనంబున • వనట వాసె. 44

మాకు గలిగిన అగౌరవముచే మా కేమినష్టమని పలుకుదురేమో అదికాదు చెప్పెద వినుఁడు.

గీ. అహితులను గెల్చి తల్లక్ష్మి • ననుభవించి
నిజకులానికిఁ దెచ్చి ని • ర్నిద్ర కీర్తి
ధర్మరతుఁడైన మనుజుఁడీ • ధాత్రిలోన
నల్పకాలము బ్రతికిన • నదియె మేలు
మానహీనతఁ బెక్కేండ్లు • మనుటకంటె. 45

గీ. యుద్ధసన్నాహనదుఁడనౌచు • యుద్ధకార్య
ధూర్వహుఁడనైన నా కెదఁ • దోఁచినట్టు
లాడ నరభోక్షి యజ్ఞచేఁ • జూడఁబడిన
పూర్ణవిజ్ఞానులకు మదిఁ • బుట్టునెట్లు
మోహమనియెను సౌరి య • వ్యాహతముగ. 46

గీ. సంక్రాంత కంతారి హృదయంబు • భావ జాత
విశిఖ సంతప్యమానమై • వెతలనొంద
శీత కిరణాంశు రుగ్ణ కం•జాత లతను
బోలి భూపుత్రి రాక్షస • భూమిలోన
నెట్లు జీవించునని శోక • మెపను వలదు. 47

గీ. రాత్రి దీపకుఁ డంబుదాక్రాంతుఁడు నగు
చంద్రుఁ డైవడి హిమదగ్ధ • సరసిజంబు
పగిది వాడిన కుసుమంబు• భంగి రాము
మానసము చింతచేఁ గడు • మ్లాని నొంద
సీత శోకించునని చింతఁ • జేయవలదు. 4

మనము యుద్ధమందు విరక్తులమై యింటికిఁ బోయినయెడ
వీరానురక్తులైన మనభార్యలుకూడ మనలవీక్షించి విరక్తినొందుదురు

గీ. విరహ విరచిత దౌర్బల్య • విధురములును
సంపరిత్యక్త కాయ పరిం•సాధనములు
నధిక నిశ్వాస ధూత లం• బాలకౌఘ
మృదిత గండస్థలాభోగ • మృదులములును.

గీ. పృథు నితంబస్థలి భ్రష్ట • విపుల రశన
లతను సంతాన సంతాపి• తాంగ లతలు
మన వధూటులఁ జూడంగ • మనము లెరియు
లజ్జ యుదయించు మన కిది • లఘుత కాదె. 5

గీ. వానరాధీశు డిబ్భంగి • బహువిధముల
జలధి లంఘనకర్మ కు• త్సాహ మొలయఁ
బ్లవఁగులకుఁ జెప్ప వారలు • పంక మగ్న
గజఘటనుబోలి నిష్కంప • గాత్రులగుచు.

సీ. విషమచింతాభరాక్రాంత విహ్వలులయి
యేమియును జేయనేరక యెల్లిదముగ
నుండ రిపువిక్రమాసహిష్ణుండు శౌరి
యుచ్చకంఠస్వరంబొప్ప నుచితరీతిఁ
బలికెఁ గ్రమ్మఱ వనచర పతులతోడ. 52

ఇఁక పదిపద్యములచే వానరోత్తేజకమైన సుగ్రీవ ప్రతిజ్ఞా వచనమును జెప్పుచున్నాఁడు.

గీ. శత్రువుని పరిజనంబులు చంచలాత్మ
లైనచో వాని కెబ్భంగి నబ్బు జయము
దశముఖుం డెన్న సతత మదాంధచిత్తు
డశని తుల్యంబు మద్బాహు వడచు దాని. 53

కపులారా! మీ సహాయము లేకుండ నా పరాక్రమముచేతనే సముద్రము దాఁటఁబడును.

గీ. ప్రబల మద్బాహుఘాత విభక్త వార్ధి
వారిభాగద్వయంబెంత వరకుఁ గలిసి
కుంప నుండునో యంతలో నుద్ధతముగ
దాఁటగలదు పయోధి వనాట సమితి. 54

గీ. అహిత ధైర్య విలుంఠనాభ్యధిక మలయ
కుధర శిఖరాగ్ర సంస్థిత ఘోర వీర
కపివరానీక మంత నొక్కపరి గురుత
భార విషమాంసమైన మద్బాహుదండ
మునను శతయోజనంబులు మోయఁగలను. 55

మనపని మనము స్వయముగాఁ జేసికొనవలెను.

గీ. చకితులౌచుఁ బరస్పర సమ్ముఖముగ
మిళితులై వీరలుండిన మేరలేని

ప్రాణగొడ్డంబు వాటిల్లఁ • బరఁడెవఁడు
తోడుపడు మీకుఁ గార్యంబు • వేడిమీఁదఁ
జేయకుండిన శీఘ్రానఁ • జెడును సూవె.

సుగ్రీవుఁడు తన పౌరుషమును జెప్పుకొనుచున్నాఁడు.

గీ. తలఁప నంభోధి కెదురుగాఁ దఱలు నాకు
గగన మదియెంత లంఘింపఁ • గనుఁడు మీరు
రక్త మాంస వసా పంక • రాశియైన
పంక్తి ముఖుఁ జంపి సౌఖ్యంబుఁ • బడయువాఁడ.

సుగ్రీవుఁడు తన శరీరముయొక్క లాఘవమును జెప్పి గ
మును జెప్పుచున్నాఁడు.

గీ. వలదు సంశీతి నే జెప్ప • వచనమందు
రుష్ట మత్పాదఘాతాన • రుగ్ణవినత
దందశూకాధిపతిమూర్ధ • ధరణి వంగు
నే దిశకు వార్ధియంతయు • నా దిశాస్థ
మగుచుఁ బ్రవహించు గనుఁడు నా • యధికబలము.

శరీర బలమును చెప్పి బాహుబలమును జెప్పుచున్నాఁడు.

గీ. స్తంభ యుగకల్ప మద్భుజ • స్తంభ యుగళ
సాదితానీత మంభోధి • సలిలమధ్య
ధృతమునగు వింధ్యకపులకు • వితత సేతు
వుగను గల్పింతు నపర పా • రగులు గాఁగ.

ఫూత్కార ప్రకర్షమును జెప్పుచున్నాఁడు.

గీ. ప్రళయమారుత జృంభణ • భ్రాంతి భీత
ధావమానోరు భుజగంబు • తరళ నీర
భూత నివహంబు సంభిన్న • భూధరంబు

గాఁగ ముఖవాతఫూత్కృతిఁ • గడలినెల్ల
స్థలపథంబుగఁ జేసెదఁ • జలముమీఱ. 60

గీ. పృథుభుజంబుల మలయ సు • వేల గిరులఁ
బెఱికి ఖండించి మధ్యకు • వింతసేతు
వొకటి నిర్మింతు గనుఁడు నా • యుద్యమంబు
దానిమూలాన జలధిని • దాఁటగలరు! 61

గీ. భగ్న రాక్షస విటప ని • క్ష్వాకువంశ్య
శేఖర కళత్రి కిసలయ • శేషము నగు
లంక యనియెడు తీఁగను • లాగికొనుచు
బాహుబలమునఁ దెచ్చెద • బ్లవగులార. 62

గీ. భగ్న రాక్షస భూరుహ • వ్రజము నిహత
సంక్లిష్ట కంధర మృగరాజ • వాస సుఖద
మైన లంకాటవిని మత్త • హస్తి బోలె
రామపాదాబ్జయుగ ధ్యాను • రాగ గరిమ
నాశన మొనర్తు గనుఁడిప్డు • నాదుబలము. 63

తృతీయాశ్వాసము - ముగిసినది.



# ఆంధ్ర సేతుబంధ కావ్యము.

## చతుర్థాశ్వాసము.

సుగ్రీవుని ప్రోత్సాహముచే వానరులు ధైర్యముఁ దెచ్చుకొని
నూతనావస్థను బొందుట.

గీ. ప్రథమ సుగ్రీవ బోధన • భాషణములఁ
చరుచరావళి నిశ్చేష్టతను వహించెఁ
బిదప తేజంబునొంది స • వ్రీడమయ్యెఁ
జంద్రదర్శన సుప్తమా • సరసిజాళి
పద్మహితుఁ గాంచి వికసించు • పగిది దోఁప. 1

* వానరుల ఏకమత్యము. *

గీ. అపుడు వానరహృదయమో • హాంధకార
మడఁగె నొక్కుమ్మడిని వారి • కబ్ధి దాఁట
గలిగె నుత్సాహసంపద • కమలహితుని
తరుణ రక్తాతపం బద్రి • శిరములందు
నొక్కమారుగఁ బడుకీతి • నుదయమందు. 2

* వానరుల ఉత్సాహస్థితి. *

గీ. అగ్రహస్తావలంబన • మాహవమున
స్వాస్థ్యసూచకవదన ప్ర • సాదకరము
నైన హస్తంబు విస్తృత • మయ్యె మదిని
వానరుల కప్డు దాత్మస్వ • భావమట్లు. 3

* వానరుల ఉత్సాహ చేష్టలు *

గీ. దూర విక్షిప్త ధాతుజ • ధూళివృతము
ఘాత నిర్ఝర వారిపూర • ధౌత తనువు
విషధరానీకభోగ సం• వేష్టితంబు
భూధరంబొండు బుషభుండు • భుజయుగాన
బెఱికి నామాంసమునఁగొట్టి • పింజిఁజేసె. 4

* నీలుఁడు చేసిన పని *

గీ. తరళ పులకాంకురోద్భేద • తామ్రకాంతి
అంతరాహిత హర్షోద•యంబు చంద్ర
బింబ సంభిన్న ఘన సన్ని•భంబు తనదు
వక్షమును నీలుఁడుత్కట • ప్రీతిఘు మొప్ప
పరిమృశించెను బలుమారు • ప్లవగు లలర. 5

* కుముదుని చేష్ట *

గీ. దళిత దంతచ్ఛదద్వయ • దళము విశద
రదన కేసర విసరంబు • రమ్యగంధ
పూరితయుఁగల్గు కుముదుండు • హర్ష చంద్ర
కాంతి పొదలంగ నవ్వెను • గపుల మ్రోల. 6

* మైందుని చేష్ట *

గీ. విఘుటమాంసధరాబంధ • విశ్లథంబు
బాహుయుగ్మ సమున్మూల • నాహతంబు
విషమనిపతద్భుజంగమో•ద్వేల్లితంబు
జలధితీరస్థ చందన • శాఖి నొకటి
నిజ బలంబున మైందుండు • నేలఁగూల్చె. 7

* ద్వివిదుని చేష్ట *

గీ. దీన్యమాన దురాలోక • తేజ మెసఁగ
ధూమసంకుల శిఖిశిఖా•గ్రము నిభము
ద్వివిద కపిదృష్టిసునిగూఢ • విపుల హర్ష
దృప్తమయ్యును విషధర • దృష్టిఁబోలె
దారుణత్వము వహియించెఁ దృష్టి లదర.

* శరభుని చేష్ట *

గీ. శరభుఁ డపుడు దరీముఖో•చ్ఛలిత భయద
ప్రతినినాద స్ఫుటద్గోత్ర • వితతిఘైన
రావమొనరించె రోషసం•రక్తనయనుఁ
డగుచు నిజ దేహవర్ధన • మాచరించె.

* నిషధుని చేష్ట *

గీ. సద్యఃప్రబుద్ధ పంకేజ • సదృశశోభ
గలుగు నిషధునిముఖమందు • గాఢకోప
మప్పు డుదయించె దినమధ్య•మందుఁ జండ
భానుబింబంబు వగిదిఁ గ•న్పట్టె నతఁడు.

* సుషేణుని చేష్ట *

గీ. దరకరోత్పాత రుధిరాఘు • తామ్రకాంతి
వికట దంతచ్ఛదద్వయ • విస్ఫురితాంత
రాళమై మధ్యసంక్రాంత • రవి పరిధినిఁ
బోలినట్టి సుషేణుని • ముఖము భూరి
రోషగర్భాట్టహాసాతి • రుచిరమయ్యె.

* అంగదుని చేష్ట *

గీ. న్వాంతసంభృత హర్ష • విస్ఫారితంబు
తత్క్షణార్థోదిత బ్రధ్న•ధాను విస్ఫృతి

వజ్రధరపౌత్రుభీషణా • వక్త్రమపుడు
దిన సమారంభ సదృశమై • తేజరిల్లె. 12

* హనుమంతుని అవస్థ. *

గీ. గాడ్పుకొమరుండు నిర్వ్యాథ • కార్యభరుఁడు
వదరుబోతులు వానరు • ల్వదరుపల్కు
లాలకించి మనంబున • నంత గర్వ
మొప్పదని యెంచి యూరక • యుండె నపుడు
స్వామికార్యంబు నెఱవేర్చు • సజ్జనునకు
మహితభూషణమగా గాదె • మౌన మరయ. 13

* సుగ్రీవుని చేష్ట *

గీ. వనచరానీక దర్ప ద • ర్పణ విలున్త
కోనరక్తాస్యనయను డ • పాపబుద్ధి
తరళితోష్ఠపుట స్పష్ట • దర్శితోరు
దంష్ట్ర దీపింప నవ్వెను • తరణిసుతుఁడు. 14

* లక్ష్మణుని అవస్థ *

గీ. పేదన సౌమిత్రి తపబాహు • వీర్య మగ్ర
జన్ము నతిలోక భుజశౌర్య • సారము మదిఁ
దలఁచి చింతిల్లఁ డధికంబుఁ • బలుకఁబోఁడు
వార్ధి పశకంధరులు తృణ • ప్రాయ మనును. 15

* రాముని చేష్ట *

గీ. దీప్యమానరఘూద్వహు • దృష్టి పీయ్రి
మాభమగు వానరాధీశు • నాస్యమందుఁ
దగిలెఁ బద్మమునుండి న • ద్మాంతరమున
కరుగు పుష్పంధయువ్రాత • మనుకరించి. 16

* జాంబవద్వర్ణనము *

గీ. సన్నిహిత ధవళ వార్వాహ • శకల సహిత
నైకదివ్యౌషధి ప్రభానంబుఁ గలుగు
పర్వతమువోడ్కిఁ బొలుపొందు• వాఁడు దీర్ఘ
విస్రసాభార వినమిత • వినత వక్ర
భ్రూలతారుద్ధదృష్టి వి•స్ఫూర్జితుండు. 17

గీ. పాణితలవారితాశేష • వానరుండు
దినకరాత్మజ ముఖదత్త • తీక్ష్ణదృష్టి
జ్వాలసంప్లుష్టభూరుహ•పటలము ఘన
విస్ఫులింగ పిశంగ భూ•భృద్వరంబు
వనదవంబన భాసిల్లు • భల్లుకపతి. 1

గీ. ఉన్నతైకప్రదేశ నై•శాల్యయుతము
స్ఖలితవళి భంగదర్శిత • కృతకహారము
వక్షమును జూపి నిర్జిత • వారివాహ
గర్జనధ్వాన గాంభీర్య కంధరవము
వెలయ విశదార్థభణితిని • బలికె నపుడు. 1

* జాంబవంతుఁడు తన బహుదర్శిత్వము గనపఱచుట. *

గీ. పారిజాతంబు లేని పా•కారి పదము
కౌస్తుభశ్రీ విహీన చ•క్రిధరు నురముఁ
ద్రచ్చుటకుమున్ను శశి లేని • చిచ్చుకంటి
వేల్పుశిరము నెఱుంగుదు • వినుఁడు మీరు. 2

* నరసింహావతారమునుగూడ నెఱుంగుదు ననుట. *

గీ. నిశితకరరుహ నిస్త్రింశ • విశసితోగ్ర
సరస దనుజేంద్రహృదయంబు • హరిగృహీత

నిజకరాంభోజమును భ్రాంతి • నిష్ఫలిల్ల
వనరుహాలయ గ్రమ్మఱఁ • దన కరాన
లాగుటను నే నెఱుంగుదు • బాగుగాను. 21

* సృష్ట్యనక్రమమునుగూడ నే నెఱుంగుదుననుట. *

గీ. దభపోత్రి శితాగ్ర స్వ • దంష్ట్రచేత
కనకనేత్రుని పర్వత • కఠినమైన
యురమువ్రచ్చి యకృత్ప్లీహ • మూడఁదీసి
చంపినవిధంబుఁ గంటి నే • సంతసమున. 22

వృద్ధునిమాట పరిణామమందు హితకరము కావున
దానిని వినవలె ననుట.

గీ. యౌవనమదంబు వినయంబు • నడఁచుఁ గాను
మనగఁద్రొక్కును లజ్జ ధైర్యంబుఁ జెరుచుఁ
జింత వార్ధక మన్నింటి • నడచివేయు
జరయె యాసన్నబంధువు • మరణమునకు. 23

వృద్ధుల నపహసింపఁగూడ దనుట.

గీ. అనుభవజ్ఞేయములు సంగ • తార్థయుతము
లధిక విజ్ఞాననిలయంబు • లఘువినాశ
కములు వృద్ధులమాటలు • గళితవిషమ
వర్ణకలితంబులైన యౌవనమదాఢ్య
తరుణజనుల కవజ్ఞాస్ప • దంబులైన
నవమతింపక వినవలె • నాదరమున. 24

వానరుల యుద్ధోత్సాహమును వృద్ధినొందించుటకు
సుగ్రీవోత్కర్షమును జెప్పుట.

గీ. బవరమందున భవదీయ • బాహుదండ
మాశ్రయించిన వానరు • లమరలోక

మైనఁ గెల్వంగ శక్తులా • ననిలవేగ
ధూతభూపాంసు నికరంబు • తోయజాప్తు
నాక్రమింపంగఁజాలుట • యద్భుతంబె.

ఏరీతిగా మీరు కార్యముఁజేయుట కుపక్రమించుచున్నారో
ఆరీతిగాఁజేసినఁ గార్యము సిద్ధించదనుట.

గీ. సారగురువులు సంద్రము • ల్సమయమునను
స్వస్వమర్యాద దాఁటి యు•త్పథముఁ జెందఁ
జక్కఁబర్చిన నదియెట్లు • చక్కఁబడవో
అప్పగిది మీరలాడు వ్యా•హ్లాదములును
కార్యఘటనానుకూలము • లాకొవు వినుఁడు.

ప్రబలశత్రువగు రావణునియందు పరస్పర నిరపేక్షమగు
సామర్థ్య మప్రయోజకము. సంహతి అభేద్యముగావున
నేను చెప్పినట్లందఱు కలిసి పనిచేయుఁడు.

గీ. ఇంద్రియోద్భవత్ జ్ఞాన • బుద్ధికంటె
చాలితాకంస్యమాగను • సంస్కృతంబు
నైన మద్ జ్ఞాననే చాల • యధికమనుచు
విశ్వసింపుఁడు కపులార • వెరవరులయి.

గీ. ఎద్దసుఖసాధ్య మిల సమ• నేతులకును
నదియె విడియున్న వారల • కిదిది సూప
దిఃకరుఁ డొకండె ప్రతపించుఁ • దిగ్ఘనసంబుఁ
బలువు రగ్కలుఁగూడిన • భస్మమగును.

ఉత్సాహ మైనను దేశకాలానుగుణమైనచో ఫలము గలిగించును.

గీ. అమ్మ సింగిణి సన్ధాన మందుఁ గూర్ప
వ్యర్థమగురీతి సన్ధాన•మందుఁ జేయు

గర్వి యుత్సాహసంపద • కార్యమునకు
సాధకముగాదు శత్రుభీ • షణముగాదు.

ఇటపైని సుగ్రీవునిగురించి జాంబవంతుడు తనయభిప్రాయ
ము వెల్లడించుచున్నాఁడు.

గీ. దినకరాత్మజ నామాట • వినుము వీర
వేగనడి రాజవృత్తంబు • విడువఁబోకు
దక్షిణాయనమం దతి • త్వరితుఁడైన
యినునితేజంబు మార్దవ • మెనయుఁగాదె. 30

గీ. ప్రియుఁడు దాఁ దన్నుపేరున • దన్నుఁ బిలువ
జింతతో ముఖమువంచెడు • చెలువసగది
నపథనమరక్రియాత్మనైక్య • మధిగమించి
పల్కెనీదగు జయలక్ష్మి • పరులఁజేరు. 31

ఔద్ధత్యమిపుడు పనికిరాదు.

గీ. పోరుసల్పంగ నుత్కంఠఁ • బూనరాదు
కైరవ వనంబుల వికాస • కారణంబు
సకల దిగ్వ్యాపిచంద్రుని • పరసకాంతి
జలరుహంబుల నిప్పుగాదె • జనముగాదె. 32

రావణానుచరులు బలవంతులుగావున యుద్ధమునకు స్వాయ
ముగా నుపక్రమింపఁబడుచున్నదని సుగ్రీవుఁడన్నట్లు శంకించుకొని
చెప్పుచున్నాఁడు.

గీ. శాత్రవానుచరాళిపై • స్వయముగానె
యెత్తి వెళ్ళుట మేలొకో • యెదఁదలంపఁ

బరిజనులచేత శత్రునిఁ • బరిభవింప
మేలొకో నిరభిమానిని • మీదఁబడుట
కీర్తి నశియింపఁజేయునుఁ • గీడుమూడు

ఉత్కర్షద్వారా అపకర్షమును జూపుచు సుగ్రీవుని మరలించుచున్నాఁడు.

గీ. ధీరదివసేశ్వరాత్మజ • మారుతిముఖ
వానరాధీశ వాయు సం • భవునికంటె
నధికతరకీర్తిఁ బడయంగ • నగు నెనీకు
నెన్నివిధముల నైన నే • నెంచిచూడ.

కార్యమెట్లు సిద్ధించునో అట్లు ప్రయత్నించవలెను.

గీ. తొలినువచ్చు మహీరుహ • మిలనుఁగూల
ఫలముఁజూపని లతయన్య • పాదపమునఁ
గూర్చినవిధాన నృపునాజ్ఞఁ • గొరతసేయు
వానిఁదొలగించి దక్షునిఁ • బూనఁజేయు.

గీ. వీరసుగ్రీవ జగదేక • వీరుఁడైన
రఘుపతికిఁ బ్రియముగానెంచి • రాక్షసేంద్రు
బిలుకుమార్చఁదలంచెదు • విప్రియమిడి
ప్రతినఁబూనదె యాతఁడు • వానిఁజంప.

జాంబవంతుని యుపన్యాసము నుపసంహరించుచున్నాడు.

గీ. అట్లు నియమిత సుగ్రీవుఁ • డౌచు ఋక్ష
నాధుడాస్ఫాలిత స్వర్ణ • నగ శిఖరుఁడు
జలరుహాశ్వుని కెదురుగా • సాగునట్టి

ప్రళయకాల సముద్భూత • బహుళధూమ
పటలమన రాము నెదుటకుఁ • బారెనపుడు. 37

రామునితో జాంబవంతుఁడు మాటలాడుట.

గీ. సంముఖాగత ధవళకే • సరసటంబు
పగిదినొప్పెడు దంతరు • క్పటలిచేతఁ
బిహితదశ దిఙ్ముఖంబును • వినయానమ్ర
మైన ముఖమెత్తి రాముని • కనియెనతఁడు. 38

గీ. తొల్లి వారాహతనువున • తుంగభంగ
భయదసంవర్త జలనిధి • వారిపూర
మగ్నవసుమతి నెత్తిన • మహితచరిత
తావకోదరగహ్వర • సావకాశ
విలసితాశేష జగదండ • బృన్దమధ్య
పతితవారాశిదాటనే • పాటినీకు. 39

గీ. నిభృతలయకాలసౌరి స • న్నిభుఁడవైన
నీవుసంగ్రామభూమిలో • నిలిచిధనువు
నెత్తఁబనిలేదు రిపులేరి • యిలనునీకుఁ
కట్టిపెట్టుము రాఘవ • కదనవార్త. 40

గీ. ప్రళయ భరమబ్ధి యెద్దాన • నళుకులేక
నిర్వహించునో బడబాగ్ని • నిశ్చలముగ
నెపఁగలుగునో యాధైర్య • సద్గుణంబు
నీపయూసగితికాదె యా • నీరనిధికి
దానిలంఘింప నీకెంత • తడవునట్టు. 41

రాముఁడు పలుకుచున్నాఁడు.

గీ. చిరవియోగకృశంబు వి • స్మృతవిదేహ
పుత్త్రికాస్తన సంస్పర్శ • భూరిసుఖము
ఘనతమాలవి నీలంబు • తనయురంబు
వామకరమున నిమురుచు • వార్ధియశేసు.

గీ, తనయశంబున తద్ధృతిఁ దనదుధృతినిఁ
దనగురుత్వభరంబున • దద్గురుత్వ
మాత్మ మర్యాదచేవాని • యచలతయును
బ్రకట కంఠరవంబున • వానిరవము
నడవి రాముండు సౌరి కి • ట్లనిరెమెనపుడు.

రాముని వచనము.

గీ. తరణిసంభవ దుస్తర • శరధితరణ
ముగ్ధులౌ వానరులఁగాంచి • మోదమెడలె
నాకు నీకార్యభరమెల్ల • నాథుఁడగుట
నీతలనె నిల్పియున్నది • నిక్కమిద్ది.

మ.ల జాంబవంతుఁడు చెప్పుచున్నాఁడు.

గీ. వీరవర్యుండు త్రిభువన • వీర సేవ్య
చరితు డవిలంఘనీయుఁడు • జాంబవంతు
డప్పుడొకమాట వెలిబుచ్చె • నబ్ధిదీప్ర
రత్నమునుబోలె వినుచుండ • రామవిభుఁడు.

ఈక్రింది అయిదుపద్యములు జాంబవంతుని మాటలే.

గీ. ఘనులు మీబోటివార లీ • కార్యమునకు
నుసిరత్వముఁ బూనంగ • జూడరేని

కులమహీధర ముక్తహా • కువలయంబు
వగిదినశియించుఁగాదె యీ • వనితలంప. 46

గీ. జానకీక్షేమవార్తాప్తి • సారమైన
కార్యమిదియల్ప శేషంబు • గానొనర్చె
ననిలపుత్రుండె యిత్తరి • వనచరాళి
నెవ్వఁడురనిచ్చు నాజిలో • నేపుమీర
వాఁడె కీర్తివధూ స్వయం • వరవిభుండు, 47

గీ. తలప దుస్తరమైన ను • దారలీల
ననిలపుత్రి సుఖోత్తీర్ణ • మఖిల దేవ
రాక్షసానేకవార సం • ప్రార్థితంబు
నైన యీవార్ధిమన మెల్ల • నాదరమునఁ
కలిసి ప్రార్థించెదమురండు • కడకతోడ. 48

గీ. నేను వేడిన నీవార్ధి • నేఁడు తనదు
పారగమన వ్యళీకంబు • వదలఁబోదు
కాన విధుతోపరోధమై • కపిబలంబు
స్థలముగాఁ జేసి తోయధి • దాటగలదు. 49

గీ. ఏవిషయమందు నారోష • మెసగుచుండు
నచట నన్యుని క్రోధమెట్టు • లగునుఁజూప
నెచట భుజగంబు తనవిష • దృష్టినెఱపు
నన్యవిషమచ్చటేరీతి • నాక్రమించు. 50

విభీషణాగమనము.

గీ. నూతనా రుణకాన్తి సం • ప్రోతకృష్ణ
వారిదాతామ్రము కుటప్రి • భానువిద్ధ

సరభసోత్పన్న రాక్షస • చ్ఛాయదివినిఁ
జూచిఁదొడఁగిరి కపులెల్ల • జూడ్కులలర. 51

గీ. గమనవేగా నిలస్వన • దమలవస్త్ర
శకలదీర్ఘీ కృతాంబర • జలధరులయి
రవికరాంతర ఘూర్ణిత • ప్రకటవిద్యు
దోఘులైవచ్చు దనుజుల • నుద్దవిడిని. 52

వారినిఁజూచి వానరుల సంభ్రమము.

గీ. అంత జేజేల తెరువున • నవతరించు
ప్రళయకాలమహోత్పాత • భయదులైన
రక్కసులఁజూచి తెగటార్ప • వెక్కసముగఁ
బరిగృహీతమహీధర • తరువులగుచుఁ
గపిబలంబులు చలియించెఁ • గడలిఁబోలి. 53

విభీషణాదులు క్రిందికి దిగుట.

గీ. విప్రకీర్ణ పయోవాహ • వితతివిషమ
సంస్థితాశేష వనచర • సభయదృష్ట
మంబరము భిన్నమై యప్పు • డవనిమీదఁ
బడినరీతినిఁగన్పట్టె • భయదమగుచు. 54

హనుమంతుని వ్యాపారము

గీ. పిదపమారుతపుత్త్రుండు • ప్రీతితోడఁ
బూర్వపరిచితుసద్గుణుఁ • బుణ్యపురుషు
జ్ఞాతచారిత్రు నవ్విభీ • షణునిరాము
సన్నిధికిఁ దోడితెచ్చె భూ • జాతవార్త
పగిదినానంద హేతువై • పరిఢవిల్ల, 55

విభీషణుఁడు రాముని పాదములపైఁ బడుట.

గీ. నిజపదాంబుజయుగ్మ ని • ర్నిద్రభక్తిఁ
బ్రణతిఁ జేసిన రావణా • వరజుశిరముఁ
గౌసలేయుఁడు కరము చే • గౌరవమున
నెత్తెనద్దియు రాక్షస • బృందమందుఁ
గాంచె నత్యున్నతిని దేవ • గణమువొగడ. 56

సుగ్రీవుఁడు విభీషణునిఁ గౌగిలించుకొనుట.

గీ. సరవి విని వేదితాధ్వవ • సాయు వాయు
సూను విజ్ఞాతవిశ్వాస్య • సుభగచరితు
నావిభీషణుఁ గపినాథుఁ • డతిముదమున
స్ఫారవక్షస్స్థలీఘృష్ట • హారలతను
గాఁగఁగౌఁగిటఁ జేర్చెను • కవులుచూడ. 57

గీ. అంత రఘుపతి ప్రకృతి శు • ద్ధాత్మ హృదయ
ధవళిమాస్యంద మనదగు • దంతకాన్తి
ఝురిని దశదిక్కులను నొక్క • సారెనింపి
పలికె నీరీతి మధురవా • క్ఫణితి మెఱయ. 58

రాముని వాక్యము.

గీ. చిరనివాసాప్త సౌఖ్య సు • స్థిరతనొంది
విపినమున దావహుత భుగ్వి • భీత యగుచు
సంచె వేరొక్కచోటున • కరుగు కరిణి
కరణి దానవలక్ష్మి రా • క్షస కులంబు
విడిచి చనలేదు వేరుగ • వినుఁడు మీరు. 59

విభీషణ సమాశ్వాసనము.

గీ. శ్లాఘ్యచరిత విభీషణ • సత్స్వభావ
జ్ఞానవైరాగ్య సంపన్న • సాధుసేవ్య
నిర్మలంబని నీబుద్ధి • నే నెఱుంగుదు
విషధరాస్పృష్ట పీయూష • విధముగలది.

రాముడు విభీషణుని స్తుతించుట.

గీ. రావణానుజ ధార్మికా•గ్రేసర నీదు
రమ్యగుణశీలసంపద • రజనిచరుల
కులమశేషము శోభిల్లె • కువలయాప్త
కళలచే నంక మృగశాబ•కమును బోలె.

విభీషణుని కృత్యకౌశలము.

గీ. తలప నిజకార్య కుశలులు • విలసదాత్మ
గుణ సమాలంబనులు మాన్య•కులవిభూషు
లుత్తమ యశంబుఁగాంచిన • యుక్తమలు
రాజలక్ష్మీప్రసాద • పాత్రంబుసూవె

రావణానిష్టమున్నుఁ దెలియఁజేయుచున్నాఁడు.

గీ. సర్వనిలయంబునకు విషా•షధి విధాన
స్వర్గబందీపరిగ్రహా•స్వాద దృప్తుఁ
డైన నిశిచరనాథుఁ డ•య్యవనిజాత
లంకలోనికిఁ దెచ్చెను • గొంకు లేక
చేటు మూడెదె యింక ని•శాటులకును.

గీ. సురల సంక్షోభమంతయు • సుగ్రీవుఁపోవె
నాకిబందీజనాక్రంద • నము లడంగె

దశముఖగృహీత రఘునాథ • ధర్మపత్ని
సకలభువనార్తి వారణకౌ • పథముగాదె. 64

### విభీషణ పట్టాభిషేకము.

గీ. అంతదశకంఠ సోదరు • నేత్రులందు
హర్షజలమును వీనుల • నగచరాళి
జయనినాదంబు మనమున • సన్నుతేశ
చరణపద్మానురాగంబు • శిరమునందు
రాజ్యపట్టాభిషేకంబు • రాముకృపను
రమణనొప్పారె వానర • సమితి మెచ్చ. 65

ఆంధ్ర సేతుబంధ కావ్యములో - చతుర్థాశ్వాసము ముగిసెను,



శ్రీ రామార్పణము.



# ఆంధ్ర సేతుబంధ కావ్యము.

## పంచమాశ్వాసము.



### రాముని విరహము

గీ. శీత కిరణోదయాతి వి · జృంభమాణ
కామ జలరాశి విరహ వి · క్లాంతచిత్తు
డజుని పౌత్రుండు సిరలపై · గ్ఘ్యంబుఁదెలిసి
వంతపాలయ్యె నప్పుడు · వనితఁదలఁచి.

### రాముని ప్రాయోపవేశము

గీ. ఉదిప కమలారి బింబంబు · చదలునియమ
సంశ్రితేక్ష్వాకు నాథంబు · జలధిపులిన
ముభయమునుగూడి చంద్రికో · ద్యోతితాబ్ధి
సలిలమును బెంచె నానిశా · సమయమందు.

### రాముని యుత్కంఠ

గీ. విరహ దశలోన సులభముల్ · వరుషనియమ
దగ్ధచిత్తే కవిశేష · దర్పములగు
ఖేద విశేషములు రాము · మోహ మెసల
జేసి ధైర్యంబుఁ గలఁచెను · చిత్తమందు

### రాముని చింతావస్థ

సీ. పారగమనాను కూలమై · నారిరాశి
ప్రియముబపరించు నావాకు, · వెన్నెలయును

జారునా; రాత్రి కొనకకుఁ, జేరునా, సు
సాధ్విజానకి బ్రదుకునా, సమసిపోక. 4

రాముని ఉన్మాదావస్థ

గీ. వారి జాతా హితాంశువుల్ దూఱునెపుడు
కుసుమ చాపాశుగాహతిఁ గుందుచుండు
రాత్రి ధైర్యంబు నిందించు, రమణిఁ జేసు
పడుగు మారుతిఁ బలుమారు హర్ష మేది
కార్శ్య ఖండిత గాత్రుఁడై, ఖరవిదారి. 5

మరల నాయవస్థనే వర్ణించుచున్నాఁడు

గీ. ఇదియె జానకివసియించు నిక్కయనుచు
దక్కనపురేని దెస, పీని ధరణిజాత
తెగడుచంచు శశాంకుఁడు, మగువయిందు
గూరుచుండు నటంచును క్షోణితలము
నభిమతంబయ్యె రాముని కధికముగను. 6

గీ. రాత్రి యామంబులతని నైపైర్యంబులతోడ
నస్థిరాష్టోపదేశంబు లాత్మతోడ
దోర్ద్వయుత్సాహ సంపద తోడనతని
బాహుయుగళంబు నేత్రబాష్పములతోడ
జారెనాతని యుల్లాస సమితియపుడు. 7

గీ. ఊరడిల్లును మనములో ధీరయనుచు
నతను శరపీడ నోర్వలే దనుచుమూర్ఛ
మునుఁగు రాముండు ప్రియసఖీ వనయటంచు
బ్రదుకఁజూచును కృశయని భయమునొందు. 8

గీ. అరుణదీధితిజాల స • మాహతుండు
గ్లపితకాంతి పరిస్ఫుట • లక్ష్యమాణ
మృగకళంకుడు చందన • నగవిరూఢ
వ్రతతి పల్లవనిచయ సం • వ్యాప్తరశ్మి
శశిసుదర్శనుఁడయ్యె నై • క్ష్వాకునకును. 9

ప్రభాతమందు సముద్రక్షోభ

గీ. చలిత కల్లోలమాలికా • చయనిపతిత
హారిణలక్ష్మసి ప్రతిబింబ • మలఘురాత్రి
యంత మొందంగ మతిచెడి • యళుకుచేత
వణఁకుసంభోధి హృదయంబు • వగిదివణఁకె. 10

ప్రాతఃకాలవాయువు

గీ, మలయ భూధర సృకుగు హా • బిలసముత్థ
ప్రతిరవోత్పాది భైరవ • ధ్వనిపయోధి
తోయమని లాహతంబయి పాయకుండ
రాఘవుని తూర్యమనమ్రోసె • రమణమీర. 11

ప్రభాతకాల వర్ణనము

గీ. హంసకులశబ్దము ఖరంబు • వ్యక్తసకల
దిగ్విభాగంబు నసస్మృత • తిమిరజలము
దివసముఖముద్దు పులిసంబు • తీరుగల్గి
ప్రకటమై గొప్పెఁగపులకుఁ • బ్రమద మెసఁగ. 12

రాముని రోషము

గీ. వార్ధి ముల్లంఘ్యమనిచాల • వగపుతోఁక
రాత్రినంతయుగడపిన • రామచంద్రు

నాస్యపద్మంబుఁ బృథుకోప • మావరించె
సైంహికేయుఁడు శశిఁగప్పు • చాడ్పుదోప. 13

రోష ప్రాదుర్భావము

గీ. వాలిమర్దను రుచిర త • మాలనీల
మమలఘర్మోదబిందు స • మావృతంబు
ఫాలపట్టికనుదయించె • భయదభ్రుకుటి
వింధ్య భూధరకటకాన • విషలతవలె. 15

రాముని ధనుర్దర్శనము

కం. జనిత భ్రుకుటీ భంగము
ధనురభిమత వలితదృష్టి • దారుణరోషా
తనుతనుకంప విశీర్య
ద్ఘనజటమై రామముఖము • కడుభయ మొసఁగెన్. 15

రాముని దుర్నిరీక్ష్యత్వము

గీ. వారిరాశి ప్రదర్శిత • ప్రణయభంగ
భగ్నయత్నుండు స్తోకవి • వర్ధమాన
కోపుడైయున్న నతిసౌమ్య • రూపమునను
ప్రళయ రవిదుర్నిరీక్ష్యత వెలసెనతఁడు 16

ధనుర్గ్రహణము

సీ. సాహసంబుల నిర్మింప • సాధనంబు
విమతజనదృశ్య శ్రీసమా • గమ గృహంబు
బహుళరోష గజాలాన • బంధనంబు
బాహుదర్ప ప్రకాశన • పటువుధనువు
జేకొనియె రాముఁ డరిలోక • భీకరముగ. 17

## ధనువునందు నారి తగిలించుట

గీ. వసుధ ధనువుంచి రాముండు • వంచి వేగ
నారిఁగూర్పంగఁ దలఁప ద • ద్ఘోరభార
ముర్వి సైరింపఁ జాలక • యుద్ధవిడిగ
నవనతిభజింపఁ బరివృత్త • మైప యోధి
జలము ముంచెను లయభీతి • జనులు బెగడ.

గీ. ఘూమని చయావిలంబును • దుస్సహంబు
ధనువు నెక్కిడ రాముండు • దశదిశలును
ప్రతిరవా పూరితములయ్యెఁ • బవనుసదవి
కలుషఘూమ శిఖాచయా • క్రాంతమయ్యె. 19

## ధనుర్గ్రహణము

గీ. ఉండఁబోవదు జగతిపై • నుదధియికను
వ్రక్కలైపోవు వసుధ ప్ర • పంచమెల్ల
నాశనము జెందునని రఘు • నాథుడెంతో
దారుణంబగు ప్రతినతో • ధనువుఁబూనె. 20

గీ. చిర వియోగ భరగ్లాని • చేఁ గృశంబు
సతత నిస్సర దశ్రు సం • తతి నిషిక్త
మృదుల నారాచగుణ కిణ • మేదురంబు
ధృతమహేష్వా సమాతని • వితతవామ
భుజము ఘాడసూపెనన్యంబుఁ • బోలియపుడు 21

## ధనురాస్ఫాలనము

గీ. వామ దోర్దండ విరచితా • స్ఫాలనోత్థ
ప్రతిరవాపూర్ణ దశదిశా • స్ఫారతగల

విష్టపత్రయ మత్తఱి • వెఱపుకొంది
ప్రళయఘనగర్జితంబని • తలచెమదిని. 22

### శరగ్రహణము.

గీ. పిదప రాముండనావృతి • విముఖతాప్ర
సారితాగ్ర కరాపాతి • సకలలోక
విలయఘుప్రోదితానేక • జలజబంధు
సదృశమంభోధి శోషణ • సహము శరముఁ
జేకొనియె శాత్రవాళికి • భీకరముగ. 23

### రాముఁడు లక్ష్యమగు సముద్రముంజూచుట.

గీ. అంత భీకరశరము శ • రాసనమున
గూర్చి యనుకంపచేఁ దన • కోసమునఁచి
బాణులబిగియింపు సడలించి • పుచ్చి యూర్పు
జలనిధిని జూచె రాముండు • సదయుఁడగుచు 24

### ధనురాకర్షణము

గీ. వలిత భుజమధ్యమధ్యంబు • ప్రబలపీడి
తజ్యాముతిదీర్ఘ సుస్థిర • తథ్యదృష్టి
ప్రాప్త లక్ష్యాభిముఖ్య మై • న్యాసశరము
ధనువులాగంగ మొదలిడె • ధరణిభర్త 25

### శరాకర్షణము

గీ. బాణముఖ దుర్నిరీక్ష్యోగ్ర • ప్రతిఫలితము
సమిత చాపాగ్రవిస్ఫుర • దమితకాంతి

జ్యారవాతి గభీరంబు • సవితృకిరణ
సమితి యాకృష్యమాణమా • చాడ్పుదోచె 2

గీ. బాణముఖ సంజ్వలచ్చిత్ర • భానుశిఖము
స్ఫుటగుణధ్వని ముఖర మం • భోనిధాన
శోషణోద్బోధ జృంభిత • వేషమనఁగ
నొప్పు రాముని ధనువు న • య్యుదధి నపుడు
తర్జనమొనర్చు నాకృతిఁ దనరియుండె. 2

## శరవిస్ఫూర్జితము

గీ. బాణముఖ నిర్గతోల్కా ని • వహముత్క్షుభిత
జలవినాశిత సారంబు • జలజబంధు
వంశనాయకు నారాచ • వరము వింట
సంహితముగాగ జలరాశి • సలిలమంతు
బడెనటంచును దోచెను • ప్లవగులకును. 2

గీ. చంచలీభూత విద్యుత్ప్ర • శంగరుచులు
శరముఖోద్గీర్ణ హుతవహ • జ్వాలతతులు
దిగ్వధూముఖ వారిద • దృక్ప్రయములు
స్ఫుటనమొందె శరాగ్ని సం • క్షోభమునను. 2

గీ. బాహురభస సమాకృష్ట • పటుశరాస
పృష్ఠభాగోత్థితాకుల • పృథులధూమ
రాజి విశిఖాస్య నిర్గత • ప్రబలవహ్ని
కీలనిచయావృత బ్రధ్న • కిరణపుంజ
మైన శరముఁ బ్రయోగించె • సననిభర్త. 3

శర పతనము.

గీ. ఉదధి సలిలాగ్ర మగ్నంబు • హుతవహాతి
మాత్ర తామ్ర ముఖంబగు • ధాత్రివరుని
బాణ మాకాశ పథమునఁ • బ్రజ్వలించి
ప్రథమ నిపతిత జలరుహ • బంధువైన
దినముపోలికఁ దెళ్ళైను•వనధిలోన. 31

బాణము ముల్లోకములందును వ్యాపించుట.

గీ. కౌసలేయుని కార్ముక • గళితశరము
గగనపథమున శంపా ని• ఘాతమయ్యె
వార్ధిజలమందు కల్పాంత • వహ్నియయ్యె
సర్వలోకాన భూకంప • జనకమయ్యె. 32

ఒక బాణమునుండి యనేక బాణములు బయలు వెడలుట.

గీ. ప్రథమ సంప్రేరితామోఘ • బాణపృష్ఠ
సమనుయాయి విధూమాగ్ని • సదృశకాంతి
శరసమూహంబు చరమాగ్ని • సన్నివిష్ట
భాస్కరాంశు ప్రతానంబు • పగిది నుదధి
బడియె నత్తరి లోకంబు • భయము నొంద. 33

సముద్రుఁడు బాణపుదెబ్బను తినుట.

గీ. అంత దశరథసుతబాణ • హతపయోధి
బాడబాగ్ని శిఖాపట • బంధురంబు
నగగుహాసుఖ సంసుప్త • మృగపతివలె
నుచ్చలితమయ్యె రవముతో • నూర్ధ్వముగను. 34

సముద్రములో కొంతభాగము మీదకెగురుట.

గీ. సమ్ముఖాగత బహుళ వృ • షత్కనికర
పాటితము దూరనిఃసృత • ప్రతినివృత్త
ముదు కుఠార సముచ్ఛేద • నోత్థ శకల
సదృశమైనట్టి వార్ధిలోఁ • జక్రవదము
ద్వైధమొందిన విధము గ • న్పట్టెనపుడు. 3

మీదికెగరకయున్న జలముయొక్క యవస్థ.

గీ. రామశరమధ్య భిన్న వా • రాశిపూర్వ
భాగజలమెల్ల నుత్తర • భాగమందు
స్ఫుటిత దూరాపసృత భూరి • తృటిత మలయ
తటముచాడ్పునఁ బడియెను • తత్క్షణాన. 3

సముద్రక్షోభము.

గీ. విషమ సంభిన్న తరతద్రి • విపులపక్ష
తతులు, నిర్భిన్న గిరిధాతు • తామ్రరుచులు
క్షుభిత మకరాదిజలజంతు • కోటులైన
జలధి భాగంబులెల్లను • చలనమొందె. 3

శంఖములు వగిలిపోవుట.

గీ. తామ్రసూర్యాంశు హతదర • దళితధవళ
కమల ముకుళాభ మిషు తతి • కలితముఖము
వివృత పాండురకుక్షులై • విమలమైన
శంఖకుల మబ్ధితీరాన • సంఘటిల్లె. 3

పాములపడగలు తెగుట.

గీ. శరనిపాత విఖండిత • చటుల మకర
దంష్ట్రికాతతి ధవళముల్ • దళితఝషము

లురు మణివ్రాత భర విష • మోర్ధ్వనమిత
లూనవిషధర సందోహ • లోకితములు
కంథిగత వారిపూరముల్ • గానవయ్యె. 39

సముద్రమంతయు నుడికిపోవుట.

గీ. స్ఫుటిత విద్రుమకానన • స్తోమమధిక
తాప నిర్యన్మహారత్న • తరళ కాంతి
దీప్రడిండీర పిండ స • దృక్షమౌక్తి
కవ్రజంబైన సలిలంబు • కదలఁజొచ్చె. 40

నుడిగుండముల స్థితి.

గీ. సలిల సంప్లావితోన్మక్త • ములను స్వల్ప
కాలపిహిత ప్రదర్శిత • కూలములను
నిస్స్వనోత్థిత రావము • ల్నిర్మలాతి
క్షుబ్ధములు నౌచు గన్పట్టె • సుళ్లు జలధి. 41

సముద్ర పరివర్తనము.

గీ. రామశరఘాత మోర్వక • శ్రమను జెంది
తనకు శయనీయమైన • పాతాళమందు
పడక చే పీడితంబగు • పార్శ్వమొకటి
మార్చి రెండవప్రక్కకు • మరలెనేమొ
యన్న చందాన వార్ధిపై • నున్న జలము
అడుగునకుఁబోయె నడుగున • నంటియున్న
వారియుప్పొంగి మీదకు • వచ్చెనపుడు. 42

సముద్రమునకును సువేలాద్రికిని సంఘట్టము.

గీ. అప్పు డుత్తరతటమున • నొప్పు రాము
దారుణేషు ప్రహారాన • వారినిలయ

దక్షిణాశా జలంబెల్ల • తత్క్షణమున
వేల లంఘించిపోయి సు • వేలకుధర
శిఖర సంఘట్టనంబున • క్షీప్రగతిని
గడలి మీదకు గగన భా • గంబుఁగప్పె. 43

సముద్రమూలమునందు క్షోభ.

గీ. ఆదిపోత్రియు నెన్నడు • సంటనివియు
మందరము నైతమెప్పుడు • మట్టనివియు
నా రసాతల గంభీర • మైనవార్ధి
భయదతలములు సంక్షోభ • పాత్రమయ్యె. 44

రామబాణము పాతాళమునుగూడ గుచ్చుకొని
పోయినది.

గీ. నభముచాడ్పున నాలంబ • నంబులేని
విషమ బాణాహతివ్యక్త • వివర వితతి
ప్రళయకాలాగ్ని భీతుని • భంగి వార్ధి
పడెను పాతాళమునబడ్డ • పగిదిఁదోప. 45

చేపల యుపద్రవము జెప్పుచున్నాడు.

గీ. దృష్టవారాశిమధనముల్ • తీరభాగ
వలితమందర శిఖరముల్ • స్వాదితాతి
రుచ్య పీయూషరసములా • పీచ్యదర్శ
నంబులైనట్టి తిములెల్ల • నలినబంధు
వంశసంభవ నారాచ • పాతమునను
మూర్ఛితములయ్యె చేష్టావి • ముక్తినొంది. 46

పాములు నిట్టూర్పు లిచ్చుట.

గీ. ప్రబల విక్షిప్త జలమహా • వర్తములును
ప్లుష్ట విద్రుమవిచ్ఛాయ • భూతిగతులు
ఆ రసాతల వలమాన • వారిపూర
ములుమహాసర్ప నిశ్శ్వాస • మూర్ఛితములు
వార్ధిఁ గన్పట్టెరాముని • బాణనిహతి. 47

సర్పమిథున వైక్లబ్యమును జెప్పుచున్నాఁడు.

గీ. ప్రీతినిగళిత మిథునపాత • విరచితోప
గూహనోద్ధ సుఖంబు సం • గుప్త జీవ
మగుచు భుజగేంద్ర మిథున మ • య్యబ్ధిలోన
గానఁబడె రామశరపాత • ఘాతమునను. 48

బాణముల వ్యాప్తి.

గీ. శాతవిద్రుమ శాఖకు • శాణఘృష్ట
నిశిత ముఖములు వినిహత • నిశిచరాళు
లమలశుక్తి ప్రభాచ్ఛోత దతులసృథుల
మౌక్తిక వ్రాత సంప్రోత • మలినముక్త
రామశరములు జలధిలో • భ్రామకొనియె. 49

జలసంబంధమువలనఁబుట్టిన ధూమమువగడపుతీగలయందు
లగ్నమైనది. దానినుత్ప్రేక్షించుచున్నాఁడు.

గీ. ప్రసృత విష వేగమునుబోలి • బహుళ ధూమ
పటలమబ్ధికి నెత్తురు • పగిదినున్న
విద్రుమవనంబులనుజొచ్చి • వివిధగతుల
కజ్జలాభంబుగాఁ జేసెఁ • గడలియందు. 50

పర్వతముల దుఃస్థితి

గీ. బాణఖండిత విస్తృత • పక్షతతులు
క్షుభితవారాశి జలవరి • స్ఫుటితములును
సగముమట్టుకు నభమున • కెగసిగిరులు
జలధీమధ్యంబుననుబడె • జనులుబెగడ. 51

సర్పముల విపద్దశ

గీ. ఛిన్నవిక్షిప్త తనువులు • త్పన్న తీవ్ర
కోపములు కంఠ పరిలగ్న • కుత్పితాల్ప
జీవితంబులు విషదృష్టి • శిఖిశిఖౌఘ
దగ్ధరఘునాథ శరములు • దందశూక
తతులు ప్రాణంబులనువీడె • తత్క్షణాన. 52

బాణాగ్ని వృద్ధినొందుట.

గీ. ఖండితానేకభోగి భో • గ వ్రజములు
శరము ఖోత్ఖాత భూధర • సార్ధవివర
ములనుబూరించె రాఘవ • ముక్తబాణ
నిర్గతానల కీలలు • న్నిద్రగతిని. 53

కరి మకర దంతములు.

గీ. మనుజపతి బాణసంఛిన్న • వనధిసలిల
తరళ మాతంగ మకరాళి దంతపరిఘ
సమితి యూర్ధ్వంబుగాఁబోయి చదలుముట్టి
స్ఫుటితమై నేలఁగూలెను • చూడ్కులలర. 54

చేపల తొట్రుపాటు.

గీ. రామ బాణాగ్నికీలల • రభసమునను
జలధి కల్లోలమాలికా స్ఖలితమగుచు

ధూమసంరక్త నయనన్నై • స్థూలమీన
కులము విద్రుమ వనమును • గోరివిడిచె. 55

సర్పముల వైక్లబ్యము.

గీ. ఉరగములు వెలికిలంబడి యుంట చేత
తెల్లకడుపులు గన్పడ • తేజుతగ్గి
సగముకాలిన నాలుక • జంటతోడ
నీటిపైఁ దేలి పెద్దవై • నిడుదలైన
తఱుగలకు మధ్యజొచ్చెను • తలనుగావ. 56

కరి మకరముల దైన్యము.

గీ. బాణహుతవహకీల • సంపాతశుష్క
దాన ధారలు సలిల సం • చాననాతి
తీక్ష్ణకరరుహ సృణ్యగ్ర • దిత శిరములు
నగుచుఁజూపట్టె కరిమక • రాళులబ్ధి. 57

శంఖముల వైక్లబ్యము.

గీ. విషమ సంస్థిత మణి శిలా • వితతిలుఠి
తముల సంక్షీయ మాణాంబు • వినిహితంబు
కంథిపులిన ప్రవేశోత్సు • కంబులైన
శంఖ సంఘంబు చలియించె • సర్వదిశల. 58

పర్వతములు మీఁద కెగురుట.

గీ. జనక జామాతృ శరవహ్ని • జనితభయద
వితత సంక్షోభవశమున • క్షితిధరములు
ముక్తనీరాక రోత్సంగ • భూములగుచు
సంభ్రమంబున నభమున • సంచరించె

శిఖర భాగస్థితంబైన • శిఖినివహము
పక్ష విక్షేపవాయు సం • ధుక్షితంబు. 5

పాతాళ జలోత్థానము.

గీ. ఖండితోత్తాన విహ్వల • కమఠతతులు
భగ్న సురవైరి మస్తక • భయకరములు
మూలదేశ వినిర్గతా • మూల్యరత్న
ములును శబ్దాయమానముల్ భోగిలోక
జలము లొక్కుమ్మడిని పైకి • బలిసివచ్చె. 6

పెద్దతరంగము లెండిపోవుచున్నవి.

గీ. హుతవహజ్వాల సంస్పర్శ • నోద్ధతోరు
ఫేన పిండంబు లావార్ధి • పృథుతరంగ
పంక్తు లత్తరినిసకుల • పతిశరాభి
ఘాతమునఁ బైకినెగయుచు • కడువడి దివి
శుష్కదశనొందె చూపఱు • చోద్యమంద. 6

మఱల సర్పముల వైక్లబ్యమును జెప్పుచున్నాడు.

గీ. తుంగ కల్లోలమాలి కాం • దోళనమునఁ
బ్రాప్త వారాశి తీర భూ • భాగములయి
వాంత విషములు దర్శితో • ద్భ్రాంతగతులు
కాయ కర్షణ పరిముక్త • గమనరుచులు
పయ్యె జిహ్మగ సంతతు • లాక్షణమున. 6

నదుల దురవస్థ.

గీ. దారుణాక్రందరవములు • దనరనుదధి
పైనఁబడుసట్టి తద్వ్యధూ • వ్రాతమునఁగ

రమణ నొప్పారు నదుల త • రంగహస్త
సమితి రాను శరోత్కృత్తి • శంఖవలయ
మగుచుఁ జెల్లెను దిక్కుల • నద్భుతముగ. ౬౩

తిరిగి పర్వతము లెగురుటను జెప్పుచున్నాడు.

గీ. రఘుకులోద్భవ నారాచ • రాజివహ్ని
దగ్ధ మేఖలలంభోధి • తరద మేయ
నక్రసందష్ట పక్షముల్ • నష్టగమన
యత్నములునైన గిరులెల్ల నధికదుఃఖ
మొనర నభమున కెగఁబ్రాకె నొక్కమొగిని. 64

సముద్రసమర్దము

గీ. జ్వలిత జలచర సంఘమై • జ్వాలలెగయు
భ్రమద మలవిద్రుమంబౌచు • భ్రాంతిఁజెందె
రసద నేకాంబు భ్రమమౌచు • గ్రసితమయ్యె
ఛిద్యమానాద్రి బహుళమై • ఛిన్నమయ్యె
నబ్ధిసలిలంబు రామాస్త్ర • హతివశమున. 65

గీ. బహుళ గంభీర సలిల జా • వహ్నిగహన
వివర సంచార శీలంబు • విమలమలయ
మణిమయావనిసంచార • మానితంబు
విచల దూర్మి సమూహాతి • విషమితంబు
నగుచుఁజూపట్టె నత్తరి • నంబురాశి. 66

మలయవనోపద్రవము.

గీ. ధరణిజాసతి శరవహ్ని • తప్తమైన
లవణ వారాశి జవమున • దివికిఁబారి
మలయ సానువనావళి • మాడ్చెనెద్ది

దాని నే శీతలంబయి • తానుదిగుచు
శీతలంబుగఁ జేసెను • చిత్రమరయ.

జ్వాలాధిక్యమును జెప్పుచున్నాడు.

గీ. మకర మజ్జావసామిష • నికరవర్ధి
తాతిభీకర కీలౌఘు • మతివిశీర్ణ
పర్వతోత్తుంగ శృంగ సం • బాధమగుచుఁ
బర్వె బాణాగ్ని జలధిన • వ్యాహతముగ.

జలోద్ధతినిఁ జెప్పుచున్నాడు.

గీ. హవ్యవాహ సముత్థాపి • తాత్మజములు
బాణ విక్షేప పరివృత్త • పతితములును
వక్రగమనోక్ష వినమితా • వర్తములును
నగుచు తోయములు జారె • నవనిపైని.

సముద్రుని మహత్త్వమును జెప్పుచున్నాడు.

గీ. వారిరాశి శరాగ్ని సం • బంధమునను
గ్రక్కుచున్నది ధూమంబు • వెక్కసముగ
మందుచుండెను వ్యాపించి • మలయగిరిని
మూలభాగంబుఁ బ్రశిథిల • భూమిఁజేసె
నైన గాంభీర్య గుణమును • మానలేదు.

తాపముచే జలజంతువులు స్ఫుటన మొందగా గలిగిన ధ్వని.

గీ. దశరథాత్మజ బాణాగ్ని దగ్ధభుజగ
తిమిఝుష స్ఫోటనోదిత • తీవ్రరవము
వార్ధి జలమధ్యమందు సం • వర్తకాంబు

వాహావటల ధ్వనింబోలి • ప్రతినినాద
మేదురంబౌచు జగమెల్లఁ • బొదుకొనియె 71

నదీప్రవాహములను జెప్పుచున్నాడు.

గీ. ఆస్యపుంజిత శిఖినివ • హంబులౌచు
ధూమవిస్తార నిభదీప్తు • తోయధార
లగుచు సంవర్త కోల్కల • యంద మొంది
నదుల స్రోతస్సమూహము • ల్నభమునుండి
పుడమిఁగూలెను జనము లద్భుతమునొంద. 72

నీళ్లు తగ్గిపోవుట.

గీ. ఎల్లెడలతోయనివహంబు • లెండు చుండ
నచ్చటచ్చట పులినంబు • లగుపడంగ
నవసరిల్లుచు నడుగడ్డు • కంబురాశి
భయగతునిబోలె వెనుకకుఁ • బఱచెనపుడు. 73

అగ్నియొక్క ఉత్కర్షను జెప్పుచున్నాడు.

గీ. ఆసుగుక్షుశీలోపల • నఖిలజలము
లనలనివహోచ్ఛలద్వారి • యందు నభము
సలిలనివహావృతంబైన చదలునందు
దిక్సమూహంబు డిందెను • తేజముడిగి. 74

సుడిగుండములఁగూర్చి చెప్పుచున్నాడు.

గీ. రామబాణౌఘ శిఖిశిఖా • రాశి చేత
క్వాథ్యమానాంబు సందోహ వార్ధియందు
ఘూర్ణమాల విలంబిత • కాలబంధు
రథముపోలిక మండపహ • భ్రమణముగల
సుళ్లుపుట్టె ననేకముల్ • చూచుచుండ. 75

మణికాంతులతోఁ గూడిన యగ్నినిఁ జెప్పుచున్నాడు.

గీ. మరకతాశ్మల కాంతి సం । భరిత మగుచు
ననలమంభోధిలో నతి । వ్యాప్తమగుచు
ధూమ సంపర్కహీనమై । స్థూలమైన
శైవలము చుట్టుకొన్నట్టి । చాడ్పునొంచె. 76

సముద్ర క్షోభాతిశయము.

గీ. జానకీజాని శరవహ్ని । సాత్కృతమయి
జలధిజలదంబు కైవడి । సాగెనఱవ
స్ఫుటితమయ్యెను శైలంబు వగిదినప్పు
డెగసి నభమున కనిలంబు । లెగిరినట్లు. 77

జలాగ్ని సహోత్రముల తుల్యరూపమును జెప్పుచున్నాడు.

గీ. జలము స్థైర్యంబు నొందగ । ననలమప్డు
స్థైర్యమునుబొందె చలియింప । సంచలించె
వృద్ధినొందగఁ గాంచెను వృద్ధినాశ
మొందక్షీణించె రాము బా । ణాగ్రగతిని. 78

సముద్రములోని ద్వీపములఁగూర్చి చెప్పుచున్నాడు.

గి. దాశరథి బాణకేలి ప్రతాప । శుష్క
వారిధివిభక్త తటఖండ । భాగవితతి
గలిగి కాన్పించుదీవులు । తొలుతనుండు
విస్మృతిని తుంగతను నెప్డు । వీడలేదు. 79

సముద్ర దాహోపసంహారమును జెప్పుచున్నాడు.

గీ. మాన శూన్యాగ్ని నావర్త్య । మానజలము
వ్యక్త పాతాళభువనంబు । ఛాదితాహి

కమఠ కుంభీర తిమిఝషు • కంధిహస్తి
దగ్ధ విస్తృత శంఖౌఘ , ధామమగుచు. 80

గీ. వారివిస్తార పరిలుఠ • ద్బృహచ్ఛంఖ
రాజి పరిముక్త విహ్వలా•క్రంద రవము
స్ఫుటిత బడబాముఖానలా•క్రాంత దగ్ధ
సంచర త్కూర్మ విషధర • సంచయంబు. 81

గీ. క్షీయమాణాంబు సందృష్ట • కిరణజాల
వేద్యమాన మహారత్న • వితత భూమి
ధర సముత్తుంగ శిఖరంబు • దళిత శుక్తి
స్థూల కల్లోల కరహతా•త్యుదగ్ర సకల
దిగ్గజతాభగ్న పతితోరు • దీర్ఘ వారి
వాహ విటపంబు దగ్ధాంబు•వాజి సమితి. 82

గీ. భూరి దర్వీకరాభోగ • భోగ వేష్టి
తాంబువేదండ ధవళ దం•తాగ్ర మగుచు
సాగ్నిశర దగ్ధ కేసర • సంఘ జలధి
సింహ సంఘాత సంకుల • శీర్ణ మగుచు. 83

గీ. ఘాత పర్వతసంచయో•త్తుంగ శిఖర
పతిత మణ్యశ్మజాల సం•భగ్న విద్రు
మంబుదర దగ్ధ విషధరా•ఘంబు గరళ
పంక సమ్మగ్న విహ్వల • వారిగజము. 84

గీ. వర్తులావర్త గంభీర • గర్తపతిత
ఘూర్ణమాన వినిర్భిన్న • కుధరవితతి
వియదనోకహ సంలగ్న • వేపమాన
ధూమవల్లీ సమాశ్లిష్ట • తోయదంబు. 85

గీ. పక్ష పరిరక్షణోత్థిత • బాణనివహ
ఖండితాశా వికీర్ణాద్రి • ఖండచితము
స్ఫుటిత జలమధ్య నిర్గత • స్థూలరత్న
కాంతివిద్యోతితా నేక • ఝాన్మవివరము. 86

గీ. హవ్య వాహా శిఖాగ్రోపి • తాక్షీయుగ్మ
తావ గరిమ విసంస్థు లో • త్పతిత ఝషము
ఘ్రాణ పాతాత్మ సంత్రాణ • భావితాను
రాగ సమ్మిశ్రితాంగ మై • రహిఁ జెలంగె
జలధి జలపూర సంస్థిత • శంఖకులము. 87

ఆంధ్ర సేతుబంధ మహాకావ్యము నందలి
పంచమాశ్వాసము ముగిసెను

# ఆంధ్ర సేతుబంధ కావ్యము.

## షష్ఠాశ్వాసము.



### సముద్రుఁడు నీటినుండి పైకివెడలుట.

గీ. రామశరవహ్ని దరదగ్ధ • భూమిజాహి
సముదయంబు మహోఘూమ • సంచితంబు
నైన పాతాళ వనసీమ • నతిజవమున
విడిచి కరిభంగివచ్చెను జలధియపుడు. 1

గీ. మందరాచల సంఘర్ష • మసృణపార్శ్వ
మస్రిశ్రయ జృంభణా వారి • తాది కోల
దంష్ట్ర నుట్టంకితంబు ను • దారవక్ష
ముద్వహించుచు బొడకట్టె • నుదధియపుడు. 2

### సముద్రభుజవర్ణనము.

గీ. నూత్న చందనగంధాంబ • నూనదేహ
సదృశమతిదీర్ఘ మూర్తిస్ఫూ • సరళమధిక
వర్ణవిశిష్టము మలయాద్రి • వాహినీ ప్ర
వాహయుగమననొప్పెడు • బాహుయుగళ
ముద్వహించుచు నేతెంచె • నుదధియపుడు 3

### సముద్రుని హారము.

గీ. కౌస్తుభాభావమునుగప్పె • ఘనతగలది
తోయజారి సుధాదుల • తోడబుట్టు
మందరాచల మథన సం • మర్దమందు

నైతమ విముక్తమై యొప్పు • సారహార
మొకటి యఱుతను ధరియించి • యుదధివచ్చె.

సముద్రుని యెడమభుజమును జెప్పుచున్నాడు.

సీ. రక్త రంజిత రోమాంచ • రాజియుతము
దక్షిణోరు కరస్పర్శ • దమిత బాధ
మభ్రగంగానివేశిత • మతిరుచుకము
నైన వామభుజంబున • నబ్ధివచ్చె.

సముద్రుడు రాముని వద్దకు వచ్చుట.

గీ. తీవపీడిన భూజంబు • తెలుగుదోప
వనితచెంగట లేనట్టి • వాని, నైజ
కాంతిపుంజాను రంజిత • కమ్రములయ
మణి శిలౌఘుని, నాశ్రితా • మరమహీజు,
రాముగుణధాముఁగనె వారి • రాశియపుడు.

సముద్రుడు రామునకు నమస్కరించుట.

గీ. రామశరఘాత నిస్సృత రక్తకుసుమ
చమర సింధ్వాఖ్య వల్ల్యను • క్రమనిబద్ధ
మణిని కాయఫలుండు న • మానమూర్తి
జలధి పవనాహత కుజంబు • చెలువుదాల్చి
పడెను శ్రీరామచంద్రుని • పదములందు.

గంగయొక్క నమస్కారము.

గీ. ఎచటనుండి జనించెనో • యీ త్రిపథగ
త్వత్పదాబ్జయాచమ ను • దారభక్తి

నావశశుని రక్తాంబు జాభమైన
పాదపంకేరుహాంబుల, బడెను గంగ. 8

పాటలు.

గీ. అంత వారాశి వ ప హరియయ్యె
పనిసినెఱవేర్ప శకి మ ల్పంబునైన
నర్థపౌష్కల్య వంతంబు నధికి వినయ
కలితమయ్యెను ప్రవ్య ప్రి కాశకంబు
స్తోత్రమయ్యెను సూనృత సూక్తి కలిత
మైన వచనంబు లెక్క న య్యాగముతోడ. 9

నావచన స్వరూపమును జెప్పుచున్నాడు.

గీ. దుస్తరత్వాతిభారంబు ఘూత ధృతియు
నర్వశక్తి వి నీచేత స్థాపితంబు
నై వెలింగెడు స్థితిపి నే నసవరతము
నీకుఁ బ్రియమని రక్షింప నేఁడదేమొ
విప్రియం బయ్యె మన్నింపు విమలచరిత. 10

ఆ స్థితిని పూర్వము నేనే స్థాపించితిని; ఇప్పుడు నేనే హరించుచున్నాను, తప్పేమి అని శంకించి పల్కుచున్నాడు.

గీ. పుట్టుచుండెడి పుష్పాడి పొలుపుగలది
ధ్వనదళివ్రాత ముఖరంబు ఘన మరంద
బిందు తుందిలమా పుష్పవితతి తరుల
కిచ్చి హరియించుచుండెడే బుతువు జగతి. 11

మర్యాద నే నిచ్చినదే కాని యిపుడు నీవు దానిని మఱచితి
వేమో అని చెప్పబోకు; నేను మఱువ లేదు.

సీ. లోక సంక్షయకాలాగ్ని • లుప్తతనుఁడఁ
బిదప భవదంఘ్రి నిష్ఠ్యూత • త్రిదశసింధు
వారిపూరవ్రపూరుండ • భవదవార్య
పోత్రి భూమికతో నాఁడు • పుడమి నెత్తు
తరిని త్వత్పాదహతులచేఁ • దాల్మి చెడితి.
మఱువశక్యమె నీయాన • మాన్యచరిత.

ఇపుడు యుగమాహాత్మ్యముచే నాకుఁ బూర్వమువలె సామ
ర్థ్యములేదని తెలిసికొని మరియాదను విడువవని యాశంకించి పలుక
చున్నాఁడు.

గీ. తొల్లి మధువను రాక్షసు • దుృంచునపుడు
చరణ సంచారములచేత • జలధిజలని
మగ్న భూమండలోద్ధార • మహిత వేళ
తీక్ష్ణదంష్ట్రాగ్రహతులను • దేవ యిపుడు
ధరణిజా దీర్ఘ విశ్లేష • తప్తమతిని
దశవదనమారణోద్యోగ • వశత నీదు
బాణముల యంగ మెల్లని • ప్పుత్ర మయ్యె.

సముద్రుఁడు సామవాక్యమును బల్కుచున్నాఁడు.

గీ. రఘుకులాంభోధిచంద్ర ధీర వ్రశాంత
కుచ్ఛితంబగు ధృతిబూని • కోరి నీకు
విప్రియంబొండు జేసితి • వినుము మనవి
ప్రకృతి సౌమ్యంబు నీముఖ • పద్మకాంతి
జేవురింపంగఁజేసితి • చెనటి నౌచు.

సముద్రుఁడు ప్రణతివచనమును జెప్పుచున్నాఁడు.

గీ. రామ నీకిట్టి సురకార్య • రభస జనిత
ఖేద విశ్రాంతిదంబు సమ్మోదదాయి
సుఖశయిత దేశమైయుంట • నఖిలలోక
ప్లావనార్హాంబు పూర్ణయకాలంబుకొఱకు
దేవ వారాశి రక్షింపు • మీవ కృపను. 15

నీటి నెండింపఁజేసిన పాతాళమార్గముగుండా
పదన్యాసము కష్టము గలిగించును.

గీ. రామ తావక తీక్ష్ణ నారాచ దహన
శిఖల నిర్తరి నన్ను శోషింపఁజేసి
విడిచినను కాదు నీపని • వితథమగును
సలిలపూరిత మతిమాన • దళితతలము
వాటమెట్లగు నడువంగ • వానరులకు. 16

సేతునిర్మాణముంగూర్చి ప్రసంగించుచు సముద్రుఁడు
విరమించుచున్నాఁడు.

గీ. దర నికృత్తదశానన • దశమశీర్ష
స్ఖలిత మాకుందితంబును • కాలుపాద
మిపుడు గిరిరాజ ఘటితమా • విపుల సేతు
వలవడఁగ నిల్పు రావణానంద రామ. 17

సేతుబంధనాజ్ఞ నిప్పింపుఁడని పల్కుచున్నాఁడు.

గీ. దశముఖునియందు కుపితుఁడౌ • దాశరథికి
నేక నారాచహతిని నిశ్శ్రీకుఁడైన
వాలివలె వారిరాశియు • వశ్యుఁడయ్యె

గాన నిక సేతునిర్మాణ • కార్యమునకు
నాన నీవలె సౌరి సమర్థమందు.

గీ. శేషఫణమండలోదస్త • సింధురశన
భుజగ సంఘాతములయందు • బోలె నప్డు
రవిజుఁ డొసఁగిన దశరథ • రామునాజ్ఞ
కపులు శిరమున దాల్చిరి • ఘన వినీతి.

కపుల ప్రస్థానము.

గీ. ప్రథమహర్షవశంబునఁ • జైకి లేచి
స్ఫుటిత వక్ష్మోఘములవల్ల • ఫుల్లములయి
వేగ విస్పష్టసీమంత • పూగములయి
వెలయు నటలను గదలించి • చలితులైరి.

గీ. వానరానీక సంక్షుబ్ధ • వసుధ వడఁక
మలయ భూధర మస్తక • గళిత శిలలు
సింధువున జార నవి భావి సేతుకృతికి
సూత్రమననొప్పె నప్తారి • జూపఱకును.

భూపర్వతముల క్షోభమును జెప్పుచున్నాఁడు.

గీ. ప్లవగసైనిక సంక్షోభ • భరితమగుచుఁ
జలనమొందె మహేంద్రాద్రి • చలితమయ్యెఁ
జక్రవాళావధిక భూమి • చక్రమెల్ల
ననవరత దుర్దినార్ద్రిత • నలఘువౌచు
మలయవన పౌష్పరజమెల్ల • చలన శూన్య
మౌచు స్వస్థానముననుండె నాక్షణమున.

కపులు పైకెగురుట.

గీ. అపుడు సంచాలితాఖిలాహార్యచయము
నఖముఖాసక్తపంకంబు • నతతులాగ్ర
సదృశఘూటమాన కంపంబు • సర్వకీశ
సైన్య మొక్కుమ్మడిని వాయుసరణి కెగసె. 23

కపు లెగురుటవలన భూమి కుర్రింగిపోయినది.

గీ. వనచరస్తోమయుగపదుత్పతన వినత
భూతలాశ్రిత బహునదీముఖ వినిర్య
దంబునిధి భూధరంబుల • నంబుసిక్త
పాదములఁ జేసి శిథిలతఁ • బడయఁజేసి
సుఖ సమున్మూలనం బందు • సుఖ మొనర్చె. 24

కపు లాకాశము నాక్రమించుట.

గీ. స్ఫురదనూనబృహద్భాను•భూరికీల
పింగళ నిరంతరోత్పత • త్పృథు వనాట
బహుళబల నుద్యమాన మంబర తలంబు
దృశ్యమగుచోట్ల పొగవలె • దృష్టమయ్యె. 25

సముద్రమందు కపుల ప్రతిబింబము.

గీ. పటురయంబునఁ గ్రిందకుఁ•బారు నీడ
గలది ధరణీధరంబుల • బలిమి నెత్తు
కోర్కెగలదానివలె వడిఁ • గుండలీంద్రు
సదనమున కరుగునట్లున్న • సకల కీశ
సైన్యమొప్పెను జూడంగ • సంద్రమందు. 26

కపు లాకాశమందు వ్యాపించుట.

గీ. కానరానట్టి దిక్కుల • యానవాలు
ప్లవగసైన్యాళి సంరుద్ధ • భానుదీప్తి

దివసమందును సైతము • దివస విరతి
భంగిఁ గనుపట్టె గగన మ • న్నట్టినడుమ.

కపులు దిగుటను జెప్పుచున్నాఁడు.

గీ: తిర్యగంచిత నిజపృష్ఠ • దేశ నిసృత
రవికరులు వృక్షచరులెల్ల • రభస ముక్త
కలకలధ్వాన ముఖరిత • కందరోద
రాంతరములైన శైలంబు • లందు దిగిరి.

వానరులకు పర్వతప్రవేశము కార్యసిద్ధి సాద్గుణ్యము
కొఱకైనది.

గీ. దళితభూసంధిబంధన • విలులితంబు
భుజగ సంఘాత ధృతమగు • భూధరాళి
వేగ నిపతిత వానర • బృందమునకు
ఖండితముగాన నెత్త సు • ఖంబు నిచ్చె.

పర్వతోత్పాటనారంభమును జెప్పుచున్నాఁడు.

గీ. విపులవక్షస్స్థలీ పత • ద్భిదుర పృథుల
గండశైలార్ధములు క్రుద్ధ • చండ సింహ
హస్తపంజర నిగృహీత • హస్తియుద్ధ
బృంహితధ్వని ముఖరిత • భీషణములు
నైన పృథ్వీధరంబుల • నపుడు కపులు
పెల్లగింపఁగ సాగిరి • పెద్దతడవు.

శైలోత్పాటనమందు కపుల హృదయావష్టంభము

గీ. కటకభాగ నిఘృష్ట వ • క్షస్సుకేతాచు
నతి విశాల భుజాంతర • కృతకటకులు

శైలగురువులు కపులును, శైలములును
సమతగాంచిరి పర్వతోత్పాదనమున. 31

కపులశైలోత్పాటనప్రకారమును జెప్పుచున్నాఁడు.

గీ. కపిసముత్పాటితానీత, విపుల కుధర
వితతివిశేషణోన్నత, విషమ భూమి
భాగ ముద్ధూత వారిధి, వారిపూర
సంభృతంబయ్యెఁ జూడ నా, సమయమందు. 32

మహాపర్వతోత్పాటనము.

గీ. శోభదుస్సహ శతకోటి, సూదనములు
ప్రళయవాయు నిరోధనా, శ్లఘనములు
నగణితాదివరాహదం, ష్ట్రాభిహతులు
శేషయజలోత్తంభనాకంప్య, సంస్థితులును
గలిగి విలసిల్లు కొండలఁ, గపిబలంబు
పెల్లగించెను కేకల, పెల్లుతోడ. 33

పర్వతములెత్తుటలో కొన్ని శిథిలము లయ్యెను.

గీ. వారిధర వృష్టి సంత్యక్త, భూరిశోభ
లంతఁ జూపట్టు శరదాత, పాతిశుష్క
దశనుబొందిన గిరిసము, దాయ మడ్డు
వనచరావళి తమశక్తి, ఘనతఁజూపి
లాగ శీర్ణంబు లయ్యెను, లక్ష్యమేది. 34

శైలోత్పాటనమందు భూక్షోభము.

గీ. కపిసమూహము గిరులను, గదలఁజేయ
భూమి కంపించె వక్రతఁ బొరయ నవ్వి

వక్రభావమునొందెను • వసుమతియును
వంచఁబడుచుండ నదియును • వంచె వసుధ. 35

కపులు పర్వతముల నెత్తఁగా వానిని సర్పము లాకర్షించు చున్నవి.

గీ. శ్లథమహీమూలవేష్టన • క్షతతనువులు
మూలభగ్నమహాసర్ప•జాల కృష్ట
ములును గురుతావిశిష్టముల్ • భూధరములు
చాల్యమానంబులౌచు ర•సాతలాన
కరిగె కపియత్నములు వమ్ము•లయ్యె నపుడు. 36

మలయపర్వతమందలి వృక్షములు చెడుట.

గీ. తరుణపల్లవసంచయో•ద్దామరుచులు
వారిదోదర శీకర•వాహి శీత
వాయు సంవీజ్యమానముల్ • ప్లవగనివహ
కరసముత్ఖాత మలయాద్రి • తరువులెల్ల
విహ్వలత నొంది శుష్కించె • వివిధగతుల. 37

పర్వతోత్పాటనమందు తదాశ్రితమైనవాని వైకల్యముం జెప్పుచున్నాడు.

గీ. కంపమాన ధరాధరా•గ్రములయందు
నిల్చు మొగిళులరవముచే • నివ్వెరపడి
పోయె సుఖదశ నాకని • బుద్ధి నెంచి
యంబుజనివిష్టయా రాజ•హంస కుందె. 38

కపులవక్షములచే గిరినదుల నిరోధము.

గీ. కీశనివహోపగూఢ•సం•కృష్ట వివిధ
భూధరాభ్యంతర వహత్ప్ర•భూతనదులు

తరుచరోరగికవాటరుంధ్దంబు లౌచు
బహుముఖంబుల జారె దంత్వార్ణ్వములను. 39

సర్వాకృష్టపర్వతోద్ధరణము.

గీ. పాదభాగసముత్క్షేప • పరిశిథిలములు
నర్ధమార్గోరుభుజగ సంమావృతములు
బలిసదనవంకనిర్మగ్న • బహుళ నిమ్న
గాస్యములునైన గిరులెత్తి రాక్రమణంబు. 40

పర్వతములం బెల్లగించురీతినిఁ జెప్పుచున్నాఁడు.

గీ. త్రిప్పద్రిమ్మరు లత్తరిఁ • దిన్నలెత్తి
యడ్డుగాఁ ద్రిప్ప బయలయ్యె • నాకసంబు
నిలువుగానెత్తి వానిని • నిలువరింప
మరల నాచ్ఛాదితంబయ్యె సురలతెఱవు. 41

కపులు కొండలను భుజములమీఁద నెత్తుకొనుట.

గీ. పతితకిటకాతిభార సంభరణ తిర్య
గావళితవదను లత్తరి • నద్రిచరులు
నిజభుజారోపణోచిత • నిష్ప్రకంప
పరిగృహీతంబులగు శైలవర్గములను
పెల్లగించిరి తమశక్తి • వీర్యులలర. 42

మలయగిరిచందనశాఖాభంగము.

గీ. తరుచరావళిభుజకృష్ట • త్యక్తములయి
భుజగదృఢవేష్టనాబద్ధ • మూలములయి
ఛిద్యమానంబులైనను • క్షితితలమున
పతనమొందవు చందన • క్షితిరుహములు. 43

గిరిశిఖరభంగమును జెప్పుచున్నాఁడు.

గీ. జలధరవితాన గర్జాతి • చండతరము
విటపిచర బాహువిక్రమా • వేదకంబు
హరి విపాటితభూధరా • భ్యధికరవము
గగనమును ముట్టి వికతినిఁ • గాంచదయ్యె.

గిరి నదుల యవస్థను జెప్పుచున్నాఁడు.

గీ. ప్లవగవిక్షిప్త భూధర • వర్గ మవ్వి
జే దిశలవక్రతను జెందె • నా దిశలను
ధాతురాగ విశేషరక్తంబు లౌచు
జాఱె గిరినిర్ఝరంబులు • పటురయమున.

గిరిభ్రమణమును జెప్పుచున్నాఁడు

గీ. చక్రవద్భ్రామితములైన • శైలతతులు
పాఱుచుండెడి తమ సరి • ద్వారిపూర
ములను బుట్టిన సుళ్లలో • మునిఁగి మునిఁగి
బొంగరాల్ పోల్కి గిరగిర • భూరివేగ
మొప్పఁ దిరిగెను మందర • ముదధిఁబోలె.

మధుకర మిథునావస్థం జెప్పుచున్నాఁడు.

గీ. సరస మకరంద గురుకప • క్షంబు చలిత
వనలతౌఘ నిరస్తమౌ • భ్రమరమిథున
మున్న రసమంతయును గ్రోలి • యున్న కుసుమ
గుచ్ఛమును వీడ మనమందుఁ • గోరదెపుడు.

సరసిక మలశోభముం జెప్పుచున్నాఁడు.

గీ. చలిత సౌరభ్యమకరంద • చర్చితములు
అంతరాలీన షట్పదౌ • ఘాంచితములు

దివసకరరశ్మి సంస్పర్శ • దీపితములు
మధురస స్యంది వారిజ • మండితములు
నైన కాసారములు క్షోభ•నందె నపుడు. 48

సర్పవ్యాపారములం జెప్పుచున్నాఁడు.

గీ. వానరభుజావలంబితా•నూన శిఖర
దేశములు రోషసంవిగ్న • దీర్ఘపృష్ఠ
విషమ వలితోర్ధ్వఫణితతి • విధృతములును
గాఢ సందానితావని•గర్త వితతు
లైన గిరులెల్లఁ బడసాఁగె • నవనిమీఁద. 49

గిరుల నడ్డుగాఁ ద్రిప్పుట.

గీ. త్రిప్పఁబడు శైలములచేత • గొప్పనదులు
పొంగి యొండొంటితోఁ గూడి • పుడమిమీఁద
బాఱి సంక్షుబ్ధ కర్దమ • వాహులగుచు
నొక్క నదివలెఁ జూపట్టె • నొకక్షణమున. 50

భుజంగాకర్షణము.

గీ. విషమ సంచార దర్శిత • విశద కృష్ణ
వర్ణయుతములు పర్వత•పాదలగ్న
పృష్ఠభాగంబులై యొప్పు • పృథు భుజఁగ
సంతతుల లాగిరా తరు•చరగణంబు. 51

గిరులనురిడి వనదేవతాపలాయనము.

గీ. సరభసోత్పాటితావని•ధర విభీతి
త్యక్త వనదేవతాబృంద • తరువితతిని
గళితమయ్యెను కుసుమాళి • గాలిలేక
వాడె కిసలయ మస్పృష్ట•బంధనంబె. 52

పర్వతముల నెత్తుట.

గీ. ఏదిశను బర్వతావళు • లెత్తఁబడెనొ
యా దిశాభాగవసుమతి • యరక్షణమున
నంతమొందెను గగనమ • య్యవనిధర వి
తాన హీనత నొంది వి • స్తారమయ్యె.

పర్వతోత్తోలనము.

గీ. బాహుయుగళోద్ధృతంబైన • పర్వతమును
బట్టికొనిపోవు నొక్కొక • వానరుండు
అర్ధవివృతరసాతలం • బవనితలము
నర్ధభాగాస్తమితముగా • నాకసంబు.

గిరిమూలభూమి సముత్తోలనము.

గీ. భూధరనితంబసక్తముల్ • పుడమినున్న
ప్రకట స్రోతస్వినీతటీ • భాగ వితతి
భుజగఫణదారితంబులు • భూతలార్ధ
శకలములు మింటి కెగసె నా • శ్చర్యముగను.

గిరి సత్త్వక్షోభము.

గీ. కందరోషితహార్ణిశౌఘు • కలితమైన
ధరణిధరమెల్లఁ గంపించె • విరిసిపోయె
త్రాస సంక్షుబ్ధమనసు వే • దండ సమితి
వనచరప్రోత్థ కరయుగ • వక్రితములు
శైలశిఖరంబు లత్తరి • సమ విషమము
తాము వంగెను చూచువా • రాత్మఁ బొగడ.

గిరికుసుమరజో నిర్గమనము.

గీ. మలయభూధరమారుత • చలిత భూజ
కుసుమరజమెల్ల పిహితార్క • గోనికాయ

మగుచు సాంధ్యసన్నిభం బోలి • యాకసంబు
నిండె జనులకు మోదంబు • నివ్వటిల్ల. 57

శైలమూలకర్దమోత్థాసము.

గీ. వానరౌఘంబు కొండల • బాహుపటిమ
లాగ పాతాళమునుండి • లగ్నసలిల
కర్దమంబుల పెరిగిన • కరణి దోఁచె
నిలను వీడినవని యెవ్వ • రెఱుఁగరైరి. 58

పర్వతముల మోయుటలో కపుల యసంతుష్టి.

గీ. తరుచరాళి మహేంద్రభూ•ధరమునుండి
పెఱికి తెచ్చిన శిఖరముల్ • సురసఖమున
మలయశృంగంబులు మఱిన్ని • యిలతలాన
వింధ్యపర్వతమస్తము • వేగగతిని
సహ్యభూభృచ్ఛిరస్సుల • జవముతోడ
తీసితెచ్చిరి బలముతోఁ • దీవ్రగతిని. 59

గిరులకు వానరులకు నాకార సామ్యము.

గీ. మర్కటాంసంబు లవనిభృ•న్మస్తకముల
సామ్యమునుఁజాల్పె వారివ•క్షస్స్థలంబు
లద్రికటకాళిబోలె త•దగ్రహస్త
ములును కొండలగుహలనుఁ • బోలియుండె. 60

గజముల యవస్థ.

గీ. కర్ణతాళరవంబులు • కట్టువడియెఁ
జెందె నవనతిసుఖములు • సీకరంబు
లింకె కరముల తుండంబు • లెత్తిపెట్ట
పెంట్లపైఁ బ్రేమ హెచ్చెను • ప్రీతికలిగి

దంతియూథంబు పొందిన • దౌస్థ్యమపుడు
చెప్ప శక్యంబె ధరలోన • చేతనులకు. 61

పర్వతోపమర్దమును జెప్పుచున్నాఁడు.

గీ. వానరులు వక్రగతి నెత్తి • పారవైచు
భూధరంబుల తాఁకున • భూరుహములు
చూర్ణితములయ్యె భూమియుఁ • జూర్ణమయ్యె
బర్వతాస్ఫోటనరవంబు • పర్వె దివికి
జలధరంబులు విగళిత•జలము లయ్యె. 62

సర్పముల దర్పము.

గీ. కీశబాహుబలోత్క్షిప్త • గిరివితాన
మూలవలయిత భోగార్ధ•ములు తెగంగ
శైలభారనిశాతాంకు•శాయితంబు
లైన ఫణములు గల్గు న•హీనగణము
లెరుఁగవయ్యెను తద్దర్ప • మేమిజెప్ప. 63

కొండలను జెలుకుట.

గీ. కొంచెమగునడ్డ పాతాళ•కుక్షి యగుచు
కొండలెత్తఁగఁ గొంచెము • కొంకుతోడ
నోసరిల్లెను భుజగేంద్రుఁ • డులికిపడగ
శైలవర్గంబు కపులెత్తు • సమయమందు
నవనివలయంబె హ్రియమాణ•మైన రీతిఁ
గానవచ్చెను సేతువుఁ • గట్టువేళ. 64

మీన మహిష సంక్షోభము.

గీ. ధరణిధర సంభ్రమింబడు • పెరుగుచుండ
వాసభూత తరంగిణీ•వారములను

విడువవయ్యెను చేపలు • వింతకాని
జీవితాశను ద్యజియించె • చేష్టలుడిగి
కుముదబాంధవుం డుదయింప ఘోరతమము
నాశమొందినచందాన • క్షీణబలము
రాటుసహియింపలేక సంత్రాసమొంది
మహిషగణములు మడిసెను • మాటులేక. 65

ఎత్తంబడిన పర్వతములు జారిపోవుట.

గీ. ప్లవగభుజహృతి విశరారు • పర్వతములు
కొన్ని నగపాలు భిన్నమై • కూలె నేల
నర్ధసంఛిన్నకూటంబు • లయ్యెం గొన్ని
హీనశిఖరంబు లయ్యె మఱికొన్ని గిరులు. 66

కపులయొక్క కార్యపరత్వముం జెప్పుచున్నాఁడు.

గీ. ఏమహీధ్రము విశిఖర • మెద్ది శీర్ణ
మెద్ది ధ్రియమాణమయ్యెను • బ్రిద్దలగును
నవనినుండి సముత్ఖాత • మయ్యె నదియె
విడువబడియెను కపివర • వితతిచేత. 67

ఆఁడేనుగుల యవస్థం జెప్పుచున్నాఁడు.

గీ. అక్షియుగమున దిగజారు • నశ్రుబిందు
వితతి చెప్పల నడ్డుచు • వెతల కోర్చి
దంతియూథేశ విశ్లేష • తప్తమైన
వశలబృందంబు దఱినున్న • బాలతృణము
విషసమానముగాఁ జూచి • విడిచిపెట్టు. 68

శేషనాగుని యవస్థం జెప్పుచున్నాఁడు.

గీ. కుధరనిచయోద్ధరణజాత • కోప శేష
భుజగ ఫణమండలస్థమా • భూమివలయ
మెప్పుడెప్పుడు సంక్షోభ • మెనయుచుండు
నప్పుడప్పుడు శాఖామృ•గాలి గురుక
కాయభరమును మోయంగ • కల్యమయ్యె.

పెద్దపర్వతములను ఖండించుటఁ జెప్పుచున్నాఁడు.

గీ. చాలితములయ్యె స్వస్థాన • సంస్థితములు
భుజనిఘాత వినిష్పిష్ట • భూరి శిలలు
కటకశిఖరాగ్రసీమల • క్ష్మాధరములు
కపివరులచేత నప్పుడు • ఖండితములు.

కొండలయొక్క మహత్త్వముం జెప్పుచున్నాఁడు.

గీ. కొండలను పెల్లగించెడు • కోతిపిండు
చేత దివ మూర్ధ్వముగ నప్డు • నీతమైన
భంగిఁ దోఁచెను దెసలు న•పారమైన
చందమున నొప్పె భూమి వి•శాలమైన
పగిదిఁ గన్పట్టె చూడ్కులు•భ్రాంతి నొంద.

కొండలు పెల్లగించిన గోతుల లోతు.

గీ. తరుచరోత్ఖాత భూధర•స్థాన వివర
మార్గ నిర్గత శేషాహి మస్తకౌఘ
ఫణిమణివ్రాత కాంతులు • ప్రళయ సూర్య
ప్రభలవలెఁ దోఁచె నయ్యెడ • ప్లవగులకును.

వానర పరాక్రమము.

గీ. నీలలోహిత గిరి సము • త్తోలన ప్ర
దృష్టదశముఖ భుజసార • తేజ మప్పు
డొక కిరంబునఁ దత్తుల్య • ముర్విధరము
నొక్కొకఁడె పట్టి యెత్తుచు • నుక్కుమిగిలి
యపహసింపఁగఁ దొడఁగి ర • య్యద్రిచరులు. 73

ఉత్పాటిత పర్వతమూలస్థానము.

సీ. కపిబలోత్ఖాత గిరివరా • గాధ వివర
పతిత దివసేశ్వరాతప • ప్రమిళితోరు
సంతమసమైన బలిసద్మ • సరవి పాంసు
ధూమ ధూసర తిమిర సం • దూషితంబు
పగిదిఁ గనవచ్చె వానర • భటుల కపుడు. 74

కపుల స్వామిభక్తి ప్రకర్షము.

గీ. వితత శితికంఠు ధిష్ణ్య • ముర్వీధరంబు
నెత్తి యపకీర్తి పాలగు • నీ కపులకు
స్వామికార్యైక నిర్వాహ • బద్ధ దీక్ష
విశ్రుతంబయ్యె లోకాన • విబుధతతికి. 75

కపుల వేగము.

సీ. రభస సంజాతక్షీమారుత • రయ విఘూత
నిర్ఝరములైన భూధర • నిచయ మెల్ల
దుర్వహోత్సార్థ భారమై • త్రోచియున్న
లఘిమను భజించె భుజశిఖా • లగ్న మగుచు. 76

కపులు వచ్చుటకు మార్గము.

గీ. ప్లవఁగు లందఱు భూధర • పటల మెల్ల
నందముగ నంస దేశానఁ • బొందుపఱిచి

క్రిందికరుగుటకంటెను • శీఘ్రగతిని
నీరవంబుగ నెగసె స•మీరపథము.

కపు లాకాశముపైకి నెక్కుట.

గీ. చంచలులు మింట కెగసిన • సమయమందు
నుత్పతన కర్మలఘుతరు • లుత్సహిష్ణు
లద్రి సంచార నిపుణులై • యద్రిచరులె
తమకుఁ బక్షాళిగాఁగ నా • ధర వితాన
మొక్కపెట్టున వారెల్ల • నెక్కిరపుడు.

పర్వతఖాత పూరణము.

గీ. వానరౌఘ సమాక్రాంతి • వర్జితంబు
కర సముద్ధృత భూధర • సర దనేక
నిర్ఝరోదక పూరిత • నిమ్నదేశ
మయ్యె నా సంభ్రమంబున • నవనితలము.

మృగముల సంభ్రమము.

గీ. వానరోద్ధృత భూధర•వాస నిరత
సంభ్రమత్రస్త హారిణీ వి•శాల నేత్ర
కాంతిశారితమౌచు ద•త్కాలమందుఁ
జూడ నొప్పె వనౌఘంబు • చూడ్కిగమికి.

నదుల ప్రవాహము.

గీ. పెకలఁబడినట్టి కొండల • తెరువుబట్టి
పాఱు నదులెల్ల ఖండింపఁబడియె మధ్య
నెత్తబడినట్టి యద్రుల • యేఱులవియు
తిన్నగాఁబోయె కాననో•ద్దేశమునను
మోయబడువాని జక్కరల్ • పొడవులయ్యె.

కొండ లెత్తుట.

గీ. పోత్సుకోద్గ్రీవ వీక్షణాస్తోక గణము
త్రస్త కందర లీన పతత్త్రి వితతి
శిథిలితాంబుద నిర్గతాశేష జలము
శిఖర సంచరదబ్జినీసఖహయంబు
భూధరౌఘంబు చదలకు ముట్టె నపుడు. 82

పర్వతములు మోయు రీతి.

గీ. బాహుశిఖర నివేశిత ప్రకటగిరులు
దక్షిణకరావలంబితోదార (శైల)శిఖరు
లితర కరతల పరిగృహీత వితత కటకు
లగుచు మోసిరి కొండల నపుడు కపులు. 83

కపుల శక్తి వైచిత్ర్యము.

గీ. వట్టిచేతులతోఁ బోవునట్టి కపుల
కెడ మొసంగిన యాకస మిపుడు పర్వ
తాళి ధరియించిపోయెడు వనచరులకు
మార్గమీయంగ శక్తమా మదిఁ దలంప. 84

ఆకాశమందు కొండలకు పరస్పరము రాపిడి.

గీ. ఏకకాల సముత్క్షేపణైక మూల
మిళన సంజాత సంఘర్ష చలద వార్య
వారిపూర తరంగిణీ బహుళ నైన
గిరుల మోసిరి వనచరుల్ కీర్తి మెఱయ. 85

కపులు క్రిందుగా చూచుకొనుట.

గీ. శైలవర్గభరాక్రాంత శైలచరులు
వార్ధిసదృశంబు లుత్ఖాత పర్వతేంద్ర

వివరములఁ గొంతవడిఁ జూచి • వేడ్కతోడ
దాఁటిపోయిరి మనముల • ధైర్య మొప్ప.

అంతరిక్షమందు నదీప్రవాహములు.

గీ. త్రుటి సుసంహిత జలధర•తటములగుచు
వర్ధమాన మహాఝర్ఝర•బహుళము లయి
రయ సముత్క్షిప్తధర విని•ర్గతము తాము
పెద్దనదుల ప్రవాహముల్ • మింటఁ దోఁచె.

వనగజ చేష్టను జెప్పుచున్నాఁడు.

గీ. తన్మథనోచ్ఛ్రాయములు సభగ•స్థల విలగ్న
శైల సంసక్త రదనముల్ • సామజములు
క్రిందఁబడలేదు కపులచే • గిరివరములు
చాలితములైన తటినైన • చాలవింత.

దిక్కులు కప్పివేయఁబడినవి.

గీ. వేగ కంపిత వారిద•బృంద ధృతము
లవనిధరఖాత దృష్ట మ•ధ్యంబులైన
దెసలముఖములు సురభిళ•కుసుమరాజి
మూర్కొనుటచేతనో యన ముద్రితములు.

కపుల నాయాసముగాఁ బనిఁజేయుట.

గీ. ఏకకరమధ్యనిహితంబు•లేక వార
శాతనఖముఖ నిర్భిన్న • సర్వతతులు
గతివశ విశీర్ణ శిఖరాగ్ర • గండశిలలు
నైన గిరులను బడకుండ • నన్యహస్త
తలముచేఁ జక్కఁజేసిరి • తరుచరాళి.

కపుల వేగోత్కర్షముం జెప్పుచున్నాఁడు.

గీ. గగనతలమునఁ గడు వడిఁ గదిసి పాఱు
ప్లవఁగుఁ డొక్కఁడు కొనిపోవు పర్వతంబు
నుండి జాఱు మహా సరిదుద్భవములు
చిన్న యేఱులతెఱవున నున్న కొండ
లన్నిఁటికిఁ గొంతవడి నిర్ఝరాళు లయ్యె. 91

తిరుగ దానినే చెప్పుచున్నాఁడు.

గీ. వేగ నిర్ధూత భూరుహబృంద యుతము
లతి విశాలతటీదరదంబుదములు
జరఠరవికాంతి నిహత కందర నిషణ్ణ
వారణేంద్రయుతంబులౌ పర్వతముల
నాశుగతిఁ గొంచుఁ బోయిరి కీశులెల్ల. 92

మలయపర్వత దర్శనము.

గీ. వేగధావిత కపివర వితతి నిహత
శైలశిఖరావృతంబయి ఛాయ నొందుగు
మలయసానుమదుత్సంగ వలయ మపుడు
వఱుగు వెట్టెడురీతి గన్పట్టె నపుడు. 93

కపుల కార్యోత్సాహముం జెప్పుచున్నాఁడు.

గీ. దూరముననుండి కొండ లెవ్వారిచేత
జూడఁబడినవో తొలి నవ్విప్రౌఢలైన
కపులచేఁ జూడఁబడలేదు కరబలాన
నెత్త నిశ్చితమై యుండె నెవ్వి వాని
తాఁకలే దెవ్వి యుత్ఖాతదశ భజించె
వాని నుదధికిఁ గొనిపోవఁ బూనలేదు. 94

కపుల గతిమార్గముం జెప్పుచున్నాఁడు.

గీ. భగ్న భూరుహాఖండౌఘ, భారభరిత
ముద్ధృత విశీర్ణ వినిపతితోరు కుధర
శిఖర విషమిత ముదధి సం సేవితంబు
నవర సేతువువలె దోఁచె నపుడు కపులు
చన్న మార్గంబు జనముల కన్నులకును. 9

ఆశ్వాసము విచ్ఛిన్నముఁ జేయుచు కపుల సముద్రప్రాప్తిం
జెప్పుచున్నాఁడు.

గీ. కరగృహీతోరుశైలంబు క్రాంత సింధు
వేల ముద్భట వానర వీర సైన్య
మమితహృదయానుషక్త రాగాధికంబు
దరిసె రఘుకులనాథ పాదంబు ద్రుతము. 9

ఆంధ్ర సేతుబంధ మహాకావ్యము నందు
షష్ఠాశ్వాసము ముగిసెను.



# ఆంధ్ర సేతుబంధ కావ్యము.

## సప్తమాశ్వాసము.

### సేతు నిర్మాణారంభము.

గీ. ప్రకట వానరభుజబల • నికషమగుచు
దశముఖోద్ధత విక్రమ • ప్రశమనాగ్ర
ధావమానోరుసైన్యంబు • దశరథాత్మ
జాత శాశ్వతమూర్త యశస్సనంగ
నొప్పు సేతువు నిర్మింప • నొక్కమొగిని
మొదలుపెట్టిరి వానరుల్ • ముదముతోడ. 1

### సముద్రమందు కొండలు పడవేయుట.

గీ. దంభకోల చతుర్భుజో•ద్వహన దళిత
భూమిశకలంబు లననొప్పు • భూధరములు
మోసికొనివచ్చి వానరుల్ ముదముతోడ
వార్ధినుంచంగఁ దొడఁగిరి • పాటవమున. 2

### సముద్రముయొక్క యవస్థ.

గి. గిరుల వార్ధిని బడఁద్రోయఁ • గీశకోటి
కడలి కాస్పింపదయ్యెను • కంపమొందె
దూరముననుండి శైలముల్ • ద్రోయఁబడఁగ
భూధరంబులు నీళ్లలో • మునిఁగిపోమె
నతి వివృద్ధిని గాంచె నఁఖ్యంబురాశి. 3

సముద్రక్షోభముం జెప్పుచున్నాఁడు.

గీ. మారితోత్త్రాస జలచర • మండలంబు
క్లిష్ట సంత్రస్త కానన • కీర్ణమృగము
ప్రథమపాతాప్లుతాఖిల • పారభూమి
యయ్యె నవ్వేళ నంబురా • శ్యఖిలజలము.

కపుల యారంభాతిశయము.

గీ. వార్ధిసలిలాస్తమిత • భూరి పర్వతంబు
పునరదృష్ట సుయోజితా•వనిధరంబు
దివి మహోదధిమధ్యప్ర•దేశ మపుడు
ఘటితపర్వతమైనట్లు • గానబడియె.

గీ. భయము పుట్టించి రణ్ణటి • ప్రతిభటులకు
పర్వతావళి నెత్తిరి • పరమధృతిని
పరమపురుషులచర్యలే • పరుల కెపుడు
జేయు నాచార్యకంబు నీ • క్షితితలమున.

గీ. శిఖర సందోహ పరిరుద్ధ • చిత్రభాను
రథపథం బగు సకలాద్రి•రాశి వార్ధి
నగచరుల్ వైవ నాక్షణ•మందె తిములు
బ్రింగె దృణమును మ్రింగిన•భంగి నపుడు.

సముద్రమందు కొండలు మునిఁగిపోవుట.

గీ. దీనిచేఁ గట్టఁబడె వార్ధి • మానితముగ
ననుచు నేగిరి తెలియంగ•నగునో యదియె
దృశ్యమైయుండెఁ దక్కిన • దీర్ఘ శైల
మెచటనుండెనో యేమయ్యె • నెట్టులుండె
నేరికినిగాదు తెలియంగ • వారినిధిని.

సముద్రములోని రత్నములు కదలుట.

గీ. తుంగభూధర శిఖరౌఘ ◆ ధూతమగుచు
నే జలంబు నభోవీథి ◆ కెగసె రత్న
సమితితో నద్ది ధరఁబడు ◆ సమయమునను
నిసత దుడుమండల నిభంబయి ◆ నివ్వటిల్లె. 9

కొండలు సముద్రములో పడిపోయినరీతిఁ జెప్పుచున్నాఁడు.

గీ. విటపిచర బాహు శౌండీర్య ◆ వేగనున్న
మహోచ్చలమాన పృథు నిర్ఝ ◆ రాంబుపూర
వేష్టితము లైన శైలము ◆ ల్వింటనుండి
పడుచు జలనిధిఁ జేరక ◆ నడుమ వడిగఁ
దిరిగె గిరగిర సుళ్లలో ◆ గిరు లనంగ. 10

కపుల కార్యోద్యోగము.

గీ. సమున్ముఖీకృతభూధర ◆ సమితి వెనుక
శైలనిర్గత వానర ◆ శతము ముందు
వార్ధిఁ బడియెను వారల ◆ పాటవంబుఁ
జెప్పఁదరమానె యెంతటి ◆ శ్రేష్ఠులకును. 11

సముద్రమునందు కొండలం బ్రవేశపెట్టుట.

గీ. దీర్ఘపరిమాణములు వాయు ◆ తీవ్రగతులు
విపుల పాతాళ కుక్షి గం ◆ భీరములును
కుహర వానర విక్షిప్త ◆ కుధరకోటి
గతిపథంబులు గనుపట్టె ◆ కడలియందు. 12

సముద్రమందు కొండలు దొమ్మిగా పడుచున్నవి.

గీ. అపుడు విక్షిప్త ముక్తంబు ◆ లవనిధరము
లొక్కొకటి వరుసగా నీట ◆ నొక్కసారి

బడుటచే వజ్రనిహతిని • బ్రద్దలైన
పగిది భిన్నంబు లయ్యెను • పటు రయమున. 13

అతి శీఘ్రముగా కొండలు సముద్రములో బడుచున్నవి.

గీ. స్వీయభూరుహ సందియ • విగళిత వ్ర
సూనరాజి వరాగ వి•చ్ఛురిత పార్శ్వ
తలములతో భూధరంబులు • తొలుత వెనుక
కంగ రాస్య విసర్గతా•మండ శైల
నిర్ఝరోదకపూరంబు • నీటఁబడెను. 14

నీటిలోఁబడిన కొండలను కపులు చూచుచున్నారు.

గీ. విమలసాగరోధి సలిలవ్ర• వేశదృశ్య
మాన విషమువ్రచారముల్ • ధరాధరములు
మగ్నమై కాసరావయ్యె • మది వెలుఁగున
వానరౌఘము చూడంగ • బద్ధదృష్టి. 15

మూలరత్నక్షోభముం జెప్పుచున్నాఁడు.

సీ. ఫేన కుసుమాంతరోద్గత • పీన విమల
కేసర నికాయ సన్నిభ • కీర్ణకాంతు
లుపధిపోప్లూయమానంబు • లురువులైన
రత్నములు వార్ధిమూలాన • రహిఁ జనించు
క్షోభమును వెల్లడించె న•స్తోకగతిని. 16

తిరిగి సముద్రక్షోభముం జెప్పుచున్నాఁడు.

గీ. జలధి యత్తటి పర్వతో•చ్ఛలిత మగుచు
వేలవలె భూమినిగూడ • గంపితము జేసె
సమయమును బోలె భేదించి • శైలవితతి

నాకసముఁ బట్ట నుంకించె • నాశుగతిని
విడిచెఁ బాతాళమునుబోలె • విధి నియతిని. 17

తిరిగి పర్వతపతనముం జెప్పుచున్నాఁడు.

గీ. పూర్ణఖండిత సందగ్ధ • భూరుహములు
పాదవేల్లన్మహామేఘ • పటలములును
నిర్ఝరోదక సంక్లిన్న • నిజపదములు
నైన గిరులెల్ల కడలిలో • నస్తమించె. 18

మీఁద కెగిరిన సముద్రజల మంధకారముం బుట్టించెను.

గీ. క్రమములేకుండ వార్ధిలో • రయముతోడ
బడెడు కొండలచే నుబ్బి • పైకిఁ బ్రాకు
జలముచేఁ గల్గు చీఁకటి • చాటువడిన
శైలవితతిని డెలిపెను • జలధిజాత
బహుళ సంక్షోభ నిస్స్వన • వ్రాతిరవంబు. 19

కపులయొక్క యవధానము.

గీ. పర్వతోత్క్షేపణోద్ధూత • వారిపూర
ధౌత కేసరసటులు పాతాళ కుహర
నిర్గతోష్మ పరిద్రుత • నిఖిలశైల
ధాతుకర్దమితాస్యులు • వీత భార
భుజశిరస్కులు వానర • భూరిబలులు
తిరిగివచ్చిరి నీరధి • తీరమునకు. 20

తిరిగి పర్వతపతనముం జెప్పుచున్నాఁడు.

గీ. విగళితానేక నిర్ఝర • వితత భార
లఘువు లసిలాహతిచేత • విఘటమాన
పాదపవ్రాత సంకీర్ణ • వారివాహ

పథములో భూధరంబుల • బలిమికలిమి
కపులు విసరిరి ముదముతోఁ • గడలియందు. 21

కొండలు మునిఁగిపోవు మార్గముం జెప్పుచున్నాఁడు.

గీ. చలితమై మరలుచుండెడు • సలిలపుంజ
మందుఁ దేలుచునున్న • సుమాళి గలిగి
కరటి మేదుర మదగంధ • కలితములయి
జలధిజలమందు మునిఁగిన • శైలపథము
లంబురాశిని జూపట్టె • నధికములయి. 22

వనమహిషముల యవస్థం జెప్పుచున్నాఁడు.

గీ. సలిల సంమగ్న శైలమ•స్తక నిపాత
దళితగాత్రంబు లుత్కట•తామ్రనయన
యుగ్మములు రోషజుష్టంబు • లొక్కసుడిని
మునిఁగె మహిషంబు లార్చి యం•బుధిజలమున. 23

మహిషమరణముం జెప్పుచున్నాఁడు.

గీ. శైలములు వార్ధిమునుఁగ సం•జాతమైన
ప్రబల కల్లోలసంక్షుల• బడి మృగాళి
ప్రాణసంశయ మొందుచు • బంధువులను
గూడి వెండియు భిన్నమై • కొనకు జీవి
తంబుఁ గోల్పోయె దారుణ•దశను జెంది. 24

సింహములంగూర్చి చెప్పుచున్నాఁడు.

గీ. క్రకచసన్నిభదంష్ట్రాగ్ర•ఖండ్యమాన
కరిమకరకుంభవిగళిత • సరసమౌక్తి
కాళిసంపూర్యమాణాస్య•మౌచు సింహ
సముదయం బబ్ధి డిందె గ•ర్జలు సెలంగ. 25

వనగజములంగూర్చి చెప్పుచున్నాడు.

గీ. సరభ సోద్వర్తితాంభోధి • సామజములు
పతితగిరి సంభ్రమోద్భూత • పటురుషంబు
లుపరి నిపతిత నక్రాళి • లపసకృత్త
పృష్ఠ భాగానిమషంబులై • పేర్చెజలధి. 26

సముద్ర తరంగములం జెప్పుచున్నాడు.

గీ. వనధిజలమందు శైలంబు • మునిగిపోవ
తద్దరీముఖవర్త్మను • తజ్జలంబు
భూరివిద్రుమ వనకంప • పూర్వకముగ
లోపలకుఁజొచ్చి యచ్చట • నేపుమీరు
భూరుహంబులఁజుట్టెడు • ర్వారగతిని. 27

పాతాళోద్ఘాటనముం జెప్పుచున్నాఁడు,

గీ. బలిమి నుత్పాట్యమానముల్ • పాతితములు
నగు మహీధర చయముల • నవనివార్ధి
భాగములక్రింద విలసిల్లు • నాగలోక
మెల్లఁ గనుపట్టె నత్తరి • నెల్లరకును. 28

కొండలు సముద్రమునంబడుట నింకొకరీతిగాఁ జెప్పుచున్నాడు.

గీ. నిబిడ నిస్సరదతి సంఖ్య • నిర్ఝరాళి
వేష్టితంబులు వేల్లిత • విషధరములు
కపిబలోద్రేక విక్షేప • గతిరయములు
వల్లరీబృంద వేల్లిత • పార్శ్వభూము
లవనిధరములు వారాశి • నపుడు గ్రుంకె. 29

కపులు శీఘ్రముగాఁ బనిచేయుట.

గీ. ఒకని తరువాత నింకొక • డుద్ధతుఁడయి
నిజభుజాటోప విక్షేప • నిదళితోరు
ఘ్నాధ్రరుండౌచు గగనమా • ర్గ విసక్త
తోయవేణీ సమాప్లుతో • ద్ధాత సటుఁడు
నగుచుఁ జేరెను రయమున • నబ్ధివేల.

జలముమీద కెగురుటం జెప్పుచున్నాడు.

గీ. ఘ్నాధరాఘాత పటురయో • చ్చలిత సలిల
పూర రేచితసంభృత • వారియగుచు
నాకసముఁబోలె గన్పట్టె • నవుడు నాగ
లోకసుంబర సామ్యంబు • వీఁక దాల్చె
మాటిమాటికి బలిసద్మ • మదిదలంప.

కొండలు విడిపోవుట.

గీ. ఉద్వహనజాత సంక్షోభ • ముచ్చనొంద
నవనిభాగ విశ్లిష్ట • దంబు రుగ్ణ
పంకరుహ పంకము లవార్య • భయవిచేష్ట
హస్తిశుండావలంబిత • మస్తకములు
నైన భూధర నిచయంబు • లబ్ధిఁబడెను.

సముద్రముయొక్క మథనముం జెప్పుచున్నాడు.

గీ. గిరివరాఘాత భిన్నమై • పరుషరవముఁ
జేసె వారిధి లంఘించె • శీఘ్రగతిని
వేల నిమ్నోన్నతాపని • విషమపతిత

మయ్యె నీరీతి మథితమై • యలరెఁగాని
యొక్క చుక్కైన నమృతంబు • నొసఁగదయ్యె. 33

కపులు దురంతమైన పనిం జేయుచున్నారు.

గీ. బాధితోత్క్షిప్త నిఖిల మ • హీధరంబు
సంశయిత వార్ధి నిర్ముక్త • చండరవము
ససురనాథపురీగమ • నార్హమైన
దారుణారంభ మత్తఱిఁ దారసిల్లె. 34

సువర్ణ పర్వతానయనము.

గీ. పటురయోత్క్రాంత ధావితాం • బరచరిష్ణు
స్ఫురిత కాంచనరుచి జాల • శోభితంబు
కుసుమగంధి రజస్సమా • కులితమైన
మర్కటానీతకుధరాళి • మగ్నమయ్యె.
జలధి కల్లోల మాలికా • జాలమందు. 35

అనేకపనులొక్కమారు చేయుట.

గీ. కనియెవృద్ధిని గపికుల • కలకలంబు
చలిత బడబానలంబయ్యె • సలిలరాశి
బాహ్యానిస్సృత నిర్ఝరో • ద్వాంతవారి
ధారలతివేగ వాయు వ్రా • ధావితోరు
భూరుహంబులు శైలముల్ • వారిఁబడియె. 36

గిరి నదులయందున్న చేపలను జెప్పుచున్నాఁడు.

గీ. దూర విక్షిప్త వారాశి • తీరగములు
మృదితలోహిత రోహణ • మిళితరస వి

రూషితంబులు గిరి నదీ లోహితములు
నిరస్తవార్ధి జలంబులు నెసనుదాసెవె. 37

మహాగిరి పతనముం జెప్పుచున్నాఁడు.

గీ. దందశూకాళి మణిగణ • తామ్రరుచులు
విఘట్టమాన నితంబముల్ , వికట భూజ
షండ హారితంబు లాయత • సాంద్రతిమిర
దరులుగల్గిన గిరులెల్ల • శరధిఁబడియె. 38

భూమిని మోయుచున్న శేషునిక్షోభముం జెప్పుచున్నాఁడు.

గీ. క్ష్మాధరాఘాత వికీర్ణ • సలిలభార
లఘుత జెందంగ వారాశి • విఘటమాన
శీర్ష భారతఁ బ్రక్కకు • శీఘ్రగతిని
దిరిగి కాకోదరాధిపుం • డరిదియైన
విశ్రమము నొందిమదిలోన • వెఱఁగుఁజెందె. 39

జగతిలో ననేకవస్తువులు విహ్వలతం బొందెను.

గీ. ధరణీధరములు వజ్రపా • తమును దలఁచె
సంస్మరించెను వసుధయు • సభయవృత్తి
నాదిపోత్రి ఖురాహతి • నంబురాశి
తనదు మథనంబు నూహించి • తల్లడిల్లె. 40

అన్యాపరాధముచే సముద్రునకుఁ గల్గినవిపత్తును జెప్పుచున్నాఁడు

గీ. మలయ చందనభూరుహా • మాన్యనదన
మండలముఁదాల్చి ప్రాక్తన మథన దుఃఖ
మును దలంచుచు భూధర • మూర్ధ్వఘాత

నిహతమై యబ్ధిదశముఖ • విహితమైన
దోషముసనొందె నానద • దూనమగుచు. 41

గిరినదీశీకరములను జెప్పుచున్నాఁడు.

గీ. అప్పుడావర్తజలముల • నస్తమించు
ఝుమ్మాధరవ్రాత మన్యోన్య•ఘాతములను
జాతమైనట్టి శీకర•జాల మభ్ర
పథముఁ బ్రాపించి ఖరకర•భానుపుంజ
రంజితం బౌచు రాజిల్లె • రమ్యముగను. 42

మఱల సముద్రక్షోభముం జెప్పుచున్నాఁడు.

గీ. శైలమస్తక విక్షేప • జనిత విషమ
వీచిమాలావికీర్ణంబు • విస్తృతంబు
చలిత గైరికధాతు ర•సాక్తమైన
సింధుభర్తృజలంబు ఘో•షింపఁదొడఁగె. 43

గిరిద్రుమములంగూర్చి చెప్పుచున్నాఁడు.

గీ. గిరుల నెడఁబాసి పడునవి • శరధిలోన
నుద్ధతాగాధజలమూల • యుక్త పత్ర
విటపములు వ్రేగులేకుంట • వృక్షవితతు
లంటుకొనె నంబరంబున • నతిరయమున. 44

కపుల యావేశముం జెప్పుచున్నాఁడు.

గీ. భీషితాంబర సంచర • ద్విబుధవార
నారు లగుచును వానరుల్ • భూరిశిఖరి
రాశి విక్షేపముల నంబు•రాశి నెల్ల
కలుషముగఁజేసి విడిచిరి • గర్వమడర. 45

మహేంద్రగిరిఖండము సముద్రములోఁ బడుట.

గీ. అనిలసంభృత వికట గుహాముఖంబు
ననిలసుతపాదవిక్రాంతి హతిశిలంబు
నిర్ఝరాంబు సముద్గత నిర్జరేశ
చాపగర్భంబునౌ తురాసాణ్మహాద్రి
ఖండములు వచ్చిపడె నప్డు కడలియందు. 4

సముద్రమందు కొండలు పగిలిపోవుట.

గీ. శైలసంఘట్టనోద్ధూత సలిలభరిత
వారిధర పూగ నిస్స్వన భరితమయ్యె
గగనమంతయు కందళ కలితమైన
వల్లరీపుంజ నిర్మిత వాసగృహము
చేత రాజిల్లు పర్వతశిఖర మెద్ది
కడలి వడి నూఱుముక్కలు గాకయుండె. 47

చమరీమృగముల యవస్థం జెప్పుచున్నాఁడు.

గీ. ధర నిపాతస ఘాతితోత్త్రాస మకర
దశనఖండితగాత్ర విస్తార రుధిర
మిళిత ఫేనౌఘమగుచు నా చలిత చమరి
గణము లంబుధిజలములో గాంచనయ్యె. 4

సిద్ధమిథునములు కొండలను విడిచిపోవుట.

గీ, సిద్ధజనములు భయమంది శీఘ్రముగను
సురతఖేదోద్గత స్వేదభరితములగు
పుష్పిత కుడుంగముల వీడిపోయి రపుడు
గిరినదీజాలముఖములు వరుస నెండె
జలధిజలమెల్లఁ బఱచె దిక్కృతముఁ బట్టి. 4

సుడిలోఁబడ్డ కొండయేనుగుంగూర్చి చెప్పుచున్నాఁడు.

గీ. వియదతిక్షిప్త నిజదీర్ఘ • పీవరోరు
శుండ మిభరాజవారిత • చండసింహ
మతిభయత్రస్తవిహ్వల • హస్తిపోత
రక్షణోద్యతమై పేర్చు • రమ్య దంతి
యూథ మావర్తజలమున • నుగమువీఁడె. 50

నదుల దౌస్థ్స్యమును జెప్పుచున్నాఁడు.

గీ. సమ్ముఖక్షిప్తభూధర • సంఘజాత
పవనవేగ పరిస్ఖల • త్పటుతరంగ
వేల్లితములైన నదులను • వెతలఁజూచి
రాఘవుఁడు తనమనంబున • రమణి విరహ
దుఃఖమును దూరముగఁజేసి • తుష్టినొందె. 51

సముద్రమూలనుందున్న రామశర పక్షోద్గమముం
జెప్పుచున్నాఁడు.

గీ. బాణవహ్నిప్రదగ్ధ ప్ర • వాళవనము
లగ్నికీలాళి కజ్జలి • తాబ్జకులము
లహివరాధీశలోక సం • విహితగతులు
నైన జలసంచయము లప్పు • డడ్డులేక
యెగసె మీదకు సురలెల్ల • బెగడిచూడ. 52

పాతాళదర్శనముం జెప్పుచున్నాఁడు.

గీ. భీతిసంవిష్టజలచర • బృందమగుచు
పక్షయుక్తమహీధర • ప్రకటమగుచు
కుపిత ఘోరాహివిషరసా • కులితమగుచు
నొప్పె పాతాళ మత్తఱి • నొప్పదక్కి. 53

తిరిగి యేనుఁగుల విపత్తిం జెప్పుచున్నాఁడు

గీ. క్షుభితపాథోధి కల్లోల • ఘోరదర్శ
నోత్థ భీతాంతరంగంబు • లురు పయోధి
దంతి సంబద్ధలక్ష్యముల్ • దారి నడ్డు
కుధరచయముల దప్పించుకొనుచుఁబోయి
కరిమకరదశన విక్షతి • గాసినొందు
కరిఘటలు గూలె నబ్ధిలో • గరుణారుతుల. 54

పైకెగిరినజలముయొక్క యతిశయము.

గీ. ప్రబలవేగాంబుపూరావ•వాహితములయి
యేపగిది పర్వతావళు • లేపుదక్క
యబ్ధిసలిలావఁ గూలెనో • యా విధాన
గపులు తమశక్తి రువ్వినఁ • గదలలేదు. 55

తరంగము లెగురుట.

గీ. భూధరాఘాత మూర్ఛిత • భూరి మత్స్య
నికరములు రుగ్ణభూరుహ•నిచితములును
సన్నిహిత శైలమస్తక • స్ఖలితగతులు
నైన సాగరసలిలమ•హాతరంగ
పంక్తులూర్ధ్వంబుగాఁబోయి • పడియె విరిసి. 56

సురమిథునములు కొండలను విడిచిపోవుచున్నవి.

గీ. అర్ధ సంమగ్న విశిథిల•హస్తియూథ
దర్శనత్రస్త విహ్వల•దానవారి
మిథున మత్తటి గిరిజీవ•విధముదోప
గగనపథమున కేఁగెను • కడు విభీతి. 57

కపులప్రౌఢిమను జెప్పుచున్నాఁడు.

గీ. కపులభుజముల శైలముల్ • క్ష్మాధరాళి
క్ష్మారుహంబులు వానిచే • వారిధరము
లయ్యె ధృతములు గాని య•య్యద్రిచరులు
సేతువును గట్టుచున్నారొ • చూతమనుచు
దివముగొల్చుచునున్నారొ • తెలియ నరిది. 58

మఱల సముద్రక్షోభముం జెప్పుచున్నాఁడు.

గీ. సటురయాకృష్టతనువులు • వక్రవిధృత
పతిత మణ్యాశ్మపుంజముల్ • క్షితిధరములు
జలధిఁ బడుచుండ న్మృదిత భు•జంగనాథ
భగ్నఫణామండలోదర • భ్రష్టమయ్యె
ధరణిగిరిఘాతమున రసా•తలము వడఁకి. 59

గీ. దానవాధిప హ్రియమాణ • దశరథేంద్ర
సూనుజాయావిలోచన • చ్యుతకవోష్ణ
బాష్పసలిలౌఘ మబ్ధిలోఁ • బడుటవలన
నింకసాఁగెను పరదుఃఖ • మెవరు చూచి
యాశ్వసింపరొ వారికి • నభ్యుదయము
లెట్టు లొడఁగూరు దలఁపంగ • నీ జగమున. 60

హంసలయొక్క క్షోభముం జెప్పుచున్నాఁడు.

గీ. వారినిధికుక్షిమధ్యస్థ • వరమణిప్ర
వేకజాలము గిరిఘాత • భిన్నమయ్యె
మేదురారణ్యసముదయ • మేఖలములు
నైన హంసలపిండుచే • నంతరిక్ష
మావృతం బయ్యెఁ గనువారి • కందముగను. 61

తిరిగి సముద్రక్షోభముం జెప్పుచున్నాఁడు.

గీ. భోగిలోకంబు గర్జించె • భూమివడఁకె
మేఘనివహంబురాలెను • మేదిని పయి
కీశవర్గంబు చదలున • కీర్ణమయ్యె
క్షితిధరవ్రాత మవ్వలఁ • జిమ్మబడెను
పర్వతాహతి ఘూర్ణిల్లె • వనధిజలము.

క. వార్ధి నిపతిత భూరుహ•వార విటప
సురభికుసుమాళీ వినిర్గళ•త్సుమవితాన
మయ్యె నుదధికి నుజ్జ్వల•మా ప్రసాధ
నంబు నిర్యత్నగతి సిద్ధ•నయమువీర.

కొండలమీఁదనున్న తోఁటలనుగూర్చి చెప్పుచున్నాఁడు.

సీ. సాప్సరస్సంఘ వినిమగ్న • శైలరాడ్ద్వీ
తాగత నిత్య మధుగంధ • తరుణతాతి
రాజితంబులు వనగజ•వ్రాత రుగ్ణ
శాఖలగు భూరుహంబుల • జారుకుసుమ
శ్రేణిదండంబు పినుపీధి • రీణమయ్యె.

సముద్రముయొక్క లోతు.

గీ. భూధరంబులఁ బ్లవగులు • మోయుచున్న
మొదలుతుదిలేని విపులత • చిదలకున్న
సంఖ్యలేనట్టి గిరులను • సలిలరాశి
త్రోసిపుచ్చిన క్రిందకు • ద్రుతిగతముల
నవని కొండల నొసఁగంగ • నక్షయముగ
నింపలేదయ్యె పాతాళ• నిలయ మపుడు.

సముద్రక్షోభము నుపసంహరించుచున్నాఁడు.

గీ. స్రోతశ్శీర్ణాద్రి జంబాల • సుభిత మహిష
పంక్తితరుమిశ్ర విద్రుమ • వనము భూమి
చర మహాసత్త్వ సమ్మిశ్ర • జలచరంబు
నైన తోయధిఁ గలఁచి ర • య్యద్రిచరులు. 66

గీ. వన్యవేదండపదాన సం • వర్త వాయు
వశ సమారబ్ధ కోపజృం • భాయమాణ
సలిల కేసరినిచయంబు • సమ్ముఖాగ
తాద్రిదర్శన భయవిహ్వ • లాహిపుంజ
విరచితావర్త మా కంధి విటపి • చరులు
కలచి రవ్వేళ తమయిచ్చ • గడలుకొనగ. 67

గీ. ధరణీధరభార నిష్పిష్ట • తరుణ పల్ల
వముల గూడిన లతలచే బరివృతంబు
విషరపోగ్ర నవాతప • స్ఫీతి దగ్ధ
భూరిభూరుహనిర్గళ • త్పుష్పవితతి. 68

గీ. వర్తులావర్తసలిల సం • భ్రమణశీల
శైలశిఖరాగ్ర నిష్యంద, సాంద్ర నిర్ఝ
రోత్థ శీకరనిచయ స • ముద్ధ తిమిర
పిహిత గగనంబు నిపతిత • వివిధవిస్త్ర
తౌషధీగంధ వినిపాతి • తోగ్ర భుజగ
నివహ సంకులమై యొప్పె • నీరరాశి. 69

గీ. ప్రకట గంభీరజలగతా • వర్త చలిత
శైలకటకవ్రజచ్యుత • సర్పణముగు
నాగలోక వినిర్గత • భోగికులము

మస్తకంబుల దాల్చిన మణులకాంతి
పుంజ విస్ఫురితింబయి పోలు పెసంగె.

గీ. అవ్యవచ్ఛిన్న విశేషణాంతరాళ
ముక్తసంహిత భూధర పూగ ఘటిత
మై నభంబును ముట్టుచు నబ్ధిలోన
బోవఁ బోవంగ సేతువు పొలుపు వీడి
కానరాదయ్యె జనముల కన్నులకును.

కపులయొక్క పరిశ్రమను జెప్పుచున్నాఁడు.

గీ. సేతుబంధ వినిర్మితిచేత ప్లవగు
లలజడిని జెంది విశ్రాంతి నధిగమించి
రామపాదానురాగంబు రహిఁ జెలంగ
దానవావాస నాశ నిదానమైన
సేతుపథమున లంకకుఁ జేర జనిరి.

ఆంధ్ర సేతుబంధ మహాకావ్యమునందు
స ప్త మా శ్వా స ము
ముగిసెను.

---

# ఆంధ్ర సేతుబంధ కావ్యము.

## అష్టమాశ్వాసము.

కపుల వ్యాపారము ముగిసెను.

గీ. స్వీయశిఖరాగ్ర నిస్సరద్విమల నిర్ఝ
రాంబుశీకర సంక్షాళితాంబరచర
వ్యోమయానధ్వజాంబరభూషణైన
తుంగ మస్తక సంభగ్న తోయదంబు
లైన గిరులప్పు డంభోధి యడుగుఁ జేరె. 1

గీ. అబ్ధిపాతిత శిష్టంబు లైన గిరులు
క్షణపరిజ్ఞాత గౌరవకలితములయి
నిష్ప్రయోజన మివియని నిశ్చయించి
నిలిపివైచిరి ప్లవగులు జలధి వేల. 2

సముద్రము నిశ్చలముగా నుండుటఁ జెప్పుచున్నాఁడు.

గీ. భూధర క్షేపసంక్షోభ ముక్తమగుచు
మందసంచారమృదుకమై వాటివాటి
కాగత నివృత్తసంచార మమరియుండి
నిశ్చలంబయ్యె వారాశి నీరవితతి. 3

సముద్రము పూర్వస్థితి నొందుట.

గీ. భ్రష్టఘటమాన విస్తృతావర్తమగుచు
సత్యగాధజలావర్త గత్యుదగ్ర

భ్రమణ సంభిన్న భూధర • భాగమగుచు
భూమిధరసంభ్రమోద్ధూత • భూరి విధుతి
యగుచు విధుతిప్రవృత్తాంబు • నౌచు జలధి
తొంటిదశనొందె క్షోభకు • దూరమగుచు.

సముద్రము నిశ్చలముగా నుండుట.

గీ. గాఢ సంలుప్త కల్లోల • కలకలంబు
పూర్వదేశంబు విడువక • పుట్టి సుడులు
ఇంత సంక్షోభ మొందిన • నెప్పటివలె
గానవచ్చెను జలధి ని • ష్కంపజలత.

సముద్రముశాంతింపగా రమ్యముగా గానవచ్చెను.

గీ. సర్వతాగ్రసముద్భూత • బహుళవృక్ష
కుసుమ సంసక్త మౌక్తిక • కోటియుతము
మరకతోపమ తత్పత్ర • హరితతోయ
గర్తనికరంబు విద్రుమ • కలిత పల్ల
వంబు శంఖాళి సమ్మిశ్ర • వారిజంబు
నైన వారాశి శాంతాంబు • వయ్యె నపుడు.

గైరికాదిధాతువుల రంగుమారెను.

గీ. వార్థిజలపూరపృష్ఠ సం • వాహ్యమాన
కుసుమసందోహమై క్షీణ • వసువిసరము
దాల్చు రవిబోలె నీషదా • తామ్రమగుచు
ధాతుపంకం బదృశ్యతఁ • దాల్చె నపుడు.

నీటియేనుఁగుల చేష్టను జెప్పుచున్నాఁడు.

గీ. ఆతపాఘాతి విగ్లాని • వీతశక్తు
లైన జలహస్తులాత్మీయ • హస్తవివర

నిస్సర ద్వారిశీకర • నికర తిమ్య
దాస్యమండల మొప్పార • నతిరయమున
ఘ్రాత వనగజమదగంధ • గాఢరుషను
యుద్ధసన్నద్ధబుద్ధితో • నుదధి జలము
విడిచి యేతెంచె నొడ్డుకు • వెఱపులేక. 8

సముద్రప్రవేశమందు నదుల ముఖమాలిన్యముం
జెప్పుచున్నాఁడు.

గీ. ఖండితక్ష్మారుహావళి • కలుషితములు
పృథురస భిన్న పాంసుర • ఫేనతతులు
తీరభూమి విలుంఠనో • త్కీర్ణజలము
లైన నద్యాననంబు ల • హీనవృత్తి
జెందె ధూసరవర్ణంబు • శీఘ్రముగను. 9

పర్వతపుముక్కలిటునటు చలించుచుండుట.

గీ. మర్దితేభకులంబులు • మలయశైల
భాగములు కొన్ని పాఱి • పర్వతమున
నింద్రభూధరశకలంబు • లేపణంగి
మలయతటముల మాటున • మెలఁగుచుండె
క్షుభిత వారాశిసలిల సం • చోదనమున. 10

సముద్రజలము దిబ్బలను పెట్టివేసినది.

గీ. పృష్ఠపరివర్తమానాంబు • పృథుతరంగ
కాశితంబులు వాసుకి • కంచుకావ
భాసములు శంఖ నిష్ఠ్యూత • భాసమాన
నిబిడ సంలగ్న మౌక్తిక • నికరభూష
లైన పులినంబు లగుపడె నా • క్షణమున. 11

లోపలకుఁబోయిన సముద్రజలము మరల నొడ్డునకు
వచ్చుట.

గీ. గిరివరాఘాత దూర విక్షిప్త జలధి
జలము లాకాశపథమున • సక్తములయి
జనులు చూడంగ వెఱఁగున • జాలసేపు
నుఱల నటనుండి క్రిందకు • డరిగివచ్చి
క్షోభ నొందించె వారాశి • ఘోరముగను. 12

నలునితో సుగ్రీవుఁడు పలుకుట.

గి. మణిశిలాసన వరమధ్య • మాన్యవృత్తి
సుఖ నిషణ్ణతఁ బెంపొంది • సూర్యపుత్రు
డధికముదమున నలునియా • స్యంబునందు
నిలిపి తనదృష్టి నీరీతిఁ • బలికె నపుడు. 13

సుగ్రీవోక్తిం జెప్పుచున్నాఁడు.

గీ. వానరానీకమంతయు • వాడిమిఁ జెడె
కువలయంబెల్లఁ బరిహృత • కుధరమయ్యె
జూడ సేతువు పూర్ణమై • చూడబడదు
జానకీశుఁడు క్రమ్మఱ • చాపవరము
వంచకుండంగఁ జూడుఁడో • వానరములు. 14

తప్పకుండ సేతువుం గట్టితీరవలెను.

గీ. సేతుబంధంబుకంటెను • చిన్నదైన
పారిజాతంబు లక్ష్మియు • బరమపురుషు
భూషణంబైన కౌస్తుభ • భూరిమణియు
నల శశాంకుఁడు మదిరయు • నమృతమనెడు
వస్తువులనెల్ల యాచిత • వర్జితముగ

నొసఁగఁడే మున్ను వారాశి • యొప్పిదలను
ఇత్తునని ప్రతినబూనిన • నిట్టి సేతు
బంధ మీయక పోవునే • పామరుఁ డయి. 15

సముద్రమునకు పూర్వముజరిగిన పరాభవముం
జెప్పుచున్నాఁడు.

గీ. జలధితనువైన పాతాళ • నిలయమందు
దూరపాతావిషహ్యతి • క్రూరములయి
క్వాథ్యమాన జలాహతి • పరుషశబ్ద
హుతవహములైన రామాస్త్ర • వితతు లబ్ధి
నిప్పటికిఁ బొగలఁ జిమ్ముచు • నెగయుచుండె. 16

నలునిగూర్చి సుగ్రీవునియాజ్ఞ.

గీ. వానరాగ్రణీ నలధీర • వర్యచరిత
వేరుగానుండు మలయ సు • వేలగిరులు
కలసి యొక్కటియైయుండు • కరణి దోఁప
సేతుబంధంబు నిర్మింపు • సింధుభర్త
విభజనముఁ బొంది రెండుగా • వెలయుఁగాత. 17

నలుని ప్రత్యుత్తరము.

గీ. ప్లవగసైన్యాగ్రగణ్యుఁడు • ప్లవగనృపతి
యధికవిజ్ఞానశాలితా • ధ్యవసితమతి
శౌరివక్త్రాంబుజాత ని • షక్తదృష్టి
నలుఁడు వచియించె నీగతి • నర్మ మెసఁగ. 18

గీ. రఘువరుసమ్రోల వానర • రాజు నెదుట
నలుఁడు విస్రబ్ధముగ నిట్లు • పలికె నవుడు
పద్మినీనాథవరపుత్రి • పటువివేక

నీకు నా సేతుబంధ వి॰నిర్మితిగల
శక్తిసంభావనము వమ్ము • సలువఁదగునె. 19

వానరబలమంతయు శ్రీమఁ జెందెనన్నందుకు
జవాబిచ్చుచున్నాఁడు.

గీ. ఉపసితమయ్యెను భూధర॰సార్థమెల్ల
దళితమయ్యెను బలిసద్మ॰జలధి కలఁగె
విడిచితిమి జీవితాశల • వినులచరిత
నీ నియోగంబు నిష్పత్తి • నిష్ఠ నొందె. 20

సుగ్రీవుఁడు చెప్పినమాట కుత్తరమిచ్చుచున్నాఁడు

గీ. చిన్తగించెద విపుడు నా • చిత్రకర్మ
భూతలంబందువలె గొప్ప • భూధరముల
గట్టఁబడు సేతుబంధంబు • కడలియందు
రామభూపాలుచిత్తంబు • రంజిలంగ. 21

నలుఁడు తనసామర్థ్యమును జెప్పుచున్నాఁడు.

గీ. వినుము వేయేల పలుకంగ • నినతనూజ
శీవ్రయోజిత నీరంధ్ర • గిరి వితాన
పూర్ణవారాశిపథమునఁ • బొలుపుమీర
గడచిపోవును బలమట్లు • కాకయున్న
వక్త్రఫూత్కారములఁ గొంత • వార్ధిజలము
తొలఁగఁజేయంగఁ గన్పట్టు • నిలనుబట్టె
చనును సైన్యంబు మదినేల • సంశయంబు. 22

సేతువు అవశ్యముగాఁ గట్టఁబడును.

గీ. ప్రతిగజంబును మదమత్త॰వారణంబు
హస్తినక హస్తతోదప్ర॰హారములను

సరకుసేయక డీకొని • చని ముఖస్థ
పటము నిరసించువాఁడిక్క మ•హాబాహురుద్ధ
మలయు మంబుధి నిరసించి • మారుమలగు
నల సువేలాద్రితో నంటి • యలరుగాక
చూడుఁడిత్త ఱీ వానరుల్ • చోద్యమంది. 23

దీనినే మరియొకరీతిగాఁ జెప్పుచున్నాఁడు.

గీ. లేక చూడుము నాశక్తి • నో కపీంద్ర
ప్లవగసైనికసంచార • పటుతమీర
తగినరీతి మహీధ్ర సం•తతులఁ బెట్టి
వారివాహాధ్వదేవతా•వ్రజము మెచ్చ
గట్టగల నొక్క సేతువు • నొట్టువేతు. 24

మఱియొకసరణముం జెప్పుచున్నాఁడు.

గీ. సాగరాభ్యంతరాకృష్ట • సర్వనాగ
సద్మమునఁ నుండి పర్వత•సంచయంబు
నీటిపై సుస్థిరంబుగ • నిలిపి వాని
వరుసఁగా నుంచి కట్టెద • వార్ధి నిపుడు. 25

అహంకారవచనముచే విరమించుచున్నాఁడు.

గీ. అద్రిచరులార నాయాన • ననుసరించి
చెప్పినట్టుల జలధిలోఁ • జేర్చి గిరుల
చుద్ధటోపాయదోష సం•దూషితంబు
సేతుబంధంబు సుఖముగాఁ • జేయఁగలరు. 26

ఇట్టి కపుల యుత్సాహముం జెప్పుచున్నాఁడు.

గీ. అట్లుపలికిన నలుని వా•గాశయంబుఁ
దెలిసి కపివీరులెల్లరు • దీర్ఘబాహు

లగుచుఁ బోనాడి యప్పటి • యధికశ్రమను
ముక్త కలకల నిస్స్వన • ముఖరులగుచు
పర్వతంబులఁ జేఁబూని • పదిదిశలకు
బయలుదేరి రనర్గళ • ప్రసరమునను. 27

సేత్వారంభమందు నలుని మంగళముం జెప్పుచున్నాఁడు.

గీ. పిదప నలశిల్పి నిశ్చల విమలజలధి
సలిలములయందు నియమసం • స్కార మొప్ప
గ్రుంకులిడి మొదల తండ్రికి • గౌరి మ్రొక్కి
వెనుక రామాంఘ్రి యుగళికి • వినయ వృత్తి
నెఱఁగి సుగ్రీవునకు జేసె • చరణనతులు. 28

గీ. అపుడు కార్తస్వరద్యుతి • నందమూఁచు
కుసుమ పల్లవ కోరక వి • సర ఘటిత
కోమలాశోకతరుగాఢ • గుహాలనొప్పు
క్ష్మాధరంబొందు మంగళ • కలశమనగ
నలుడు సాగర జలమందు • నాటె మొదట. 29

మొదట వేసిన పర్వతములయవస్థం జెప్పుచున్నాఁడు.

గీ. వారిరాశితటస్థమౌ • పర్వతంబు
నెద్ది నలుఁడబ్ధి వైచెనో, యద్దియపుడు
లంక చెడుగును జూపని • శ్శంకమైన
ముఖముగానయ్యె వానర • ముఖ్యులలర. 30

తిరిగి సముద్ర క్షోభముం జెప్పుచున్నాడు

గీ. భూధరోత్థిత పృథురజః • పుంజములిన
దిగ్వధూ బృందముఖము లే • తెఱఁగున నవి
క్షాలితములయ్యె నబ్ధిల • శైలఘాత

ధూతసలిలంబు వారిధి • ద్రుతగతమున
గగనతలమునఁ దిరిగెను కన్నుబ్రమయ. 31

నలుని సేతునిర్మాణకౌశలముం జెప్పుచున్నాఁడు.

గీ. క్షుభిత సాగరవిక్షిప్త • కుధరతతులు
జలకృతార్ద్రిత గాధ సం• సక్తములయి
యవిదితాంతర సంహిత • వివరములయి
కదల వొండొంటితోఁ జేరి • కదలఁ జేయ. 32

నదీముఖ నిరోధముం జెప్పుచున్నాఁడు.

గీ. ప్రతిపథప్రస్థితాశేష • వారిపయము
లబ్ధివేలాతటస్థాపి • తావనిధర
ప్రతతిరుద్ధంబులగు సరి • త్ప్రవరములకు
నభిగమంబులె నిర్గమప్రథను దాల్చె. 33

పర్వతముల పతనస్వభావముం జెప్పుచున్నాఁడు.

గీ. ముఖ్యకపివార మపు డధో • ముఖముగాను
నలునిపథమందు విడిచిన • యలఘుగిరులు
తుంగశిఖరోజ్జ్వలంబు లు • త్తుంగభంగ
వేగమున నబ్ధిలోఁ బడి • వితత చక్ర
గతిని దిరిగెను మందర • క్షితిధర మన. 34

నీటి యేనుఁగులకు వనసింహములకు యుద్ధముం
జెప్పుచున్నాఁడు.

గీ. జలధిమాతంగ చక్రముల్ • శౌర్యపటిమ
నొట్టిఁబంచాస్యముల తుండ • ఘోరనిహతి
వనము సందుండు హరులున • వార్యశౌర్య

ధైర్య ధుర్యతఁజూపుచు • దారుణాత్మ
శాతకర రుహానిస్త్రింశ • పాతములను
జీల్చి కరికుంభయుగములఁ • జేవ దనర. 35

నీటియేనుగులకు నడవియేనుగులకు యుద్ధముం జెప్పుచున్నాడు.

గీ. వైరిమాతంగ కటదాన • వాసితంబు
గజనికృష్ట కరవ్రణ • ఘటితములయి
లవణ జలసేచనక్షత • వివరములయి
తిరుగు వన్యగజంబులఁ • దీక్ష్ణదృష్టి
జూచి జలసామజంబులు • సురసురమని. 36

జలమందున్న కొండలు తేలుట.

గీ. దరఘటితసేతునిర్మాణ • విరచనగల
ప్లవగులందరు కరతల•బద్ధనఖ
పుటముతో భూధరంబుల పొలుపుతోడ
నెత్తి నీరధినైచిరి • తత్తరమున. 37

సేతువునందు నలునివసిని జెప్పుచున్నాఁడు.

గీ. రయవికంపనచలకేస•రచ్ఛటుండు
త్రికవివర్తిత తనుహారి • దీర్ఘబాహు
యుగ సమాకృష్ట విక్షిప్త • నగవరుండు
నలుఁడు గట్టదొడంగెను • జలధిపథము. 38

పర్వతవిస్తారముం జెప్పుచున్నాఁడు.

కి. సంఖ్యలేనట్టి ప్లవగుల • సంఖ్యముగను
బెఱికి తెచ్చినగిరులను • శరధిలోన
విసరఁబుట్టినవివరంబు • వెలితి లేక
గన్న భూధర మొక్కటే • క్షమతఁగాంచె. 93

నలుని రచనాచాతుర్యముం జెప్పుచున్నాఁడు.

గీ. ఘాదితాంబుధి మూలదే • శంబులైన
నే గిరీంద్రంబులను కపు • ల్వేగ దెచ్చి
నిలిపిరో వానికన్నిఁటి • కెదుట నిలిచి
కట్టసాఁగెను నలశిల్పి • కడుజవమున. 40

నలుని త్వరను జెప్పుచున్నాఁడు.

గీ. ప్లవగులందిచ్చు పర్వతా • వళులఁ జేర్చి
స్వీయకౌశల మేర్పడ • సేతుపథము
నున్నతానతదశలు లే • కుండ నలుఁడు
సమవిభక్తంబుగా గట్టె • సమరు లలర. 41

సేతునిర్మాణమందు సముద్రుని సహాయముం
జెప్పుచున్నాఁడు,

గీ. అబ్ధి నలశిల్పి సేతువు • నందు జక్క-
నిడ్డ కుధరంబులెల్ల వి • హీనశక్తి
ఘనతరంగచయాహతిఁ • గదలకుండ
నిజకరంబుల దృఢముగా • నిలిపి నిలిపి
ముందుముందుకు జనుచుండె • మూద మెలర్ప. 42

నలుని బలాతిశయముం జెప్పుచున్నాఁడు.

గీ. మిహిరరథచక్రనేమి సం • మృష్టశిఖర
భాగములు గల్గునే గిరుల్ • పావమాని
తెచ్చి యందిచ్చెనో వాని • దీవ్రగతిని
హస్తలాఘవ మేపార • నపుడె తీసి
సేతుబంధాన నమరిచెఁ • జిత్రముగను, 43

సముద్రశైలోత్కర్షముం జెప్పుచున్నాఁడు.

గీ. వికచ కంజాత కహ్లార ♦ విమలసరసు
లబ్ధి నిక్షిప్యమాణాయ♦తావనీధ్ర
వితతులను నాగలోక సం♦విష్టితంబు
లైన గిరులెల్ల ధరియించె ♦ నతిదృఢముగ. 44

మణుల యవస్థం జెప్పుచున్నాఁడు.

గీ. జలధితీర నివిష్టంబు ♦ జలధివారి
వేగ నిర్ధూయమానంబు ♦ విమలకిరణ
విటపయుక్తంబు మరకత ♦ విమలకాంతి
గలుగు వనరాజి యత్తఱి ♦ గంపమొందె. 45

జలహస్తిసర్పములకు సంబంధముం జెప్పుచున్నాఁడు.

గీ. వార్ధిమకరోరుదంత సం♦వళితములయి
కాలలోహ సదృశాభ♦కలితములయి
క్షోభసంవిగ్న వనగజా♦కుంతఘాత
నిర్ధుతములౌచు జలధిలో ♦ నిధన మొందె. 46

తరంగముల యానుకూల్యముం జెప్పుచున్నాఁడు.

గీ. భూరిభూధర పతన వి♦స్ఫారితార్ధ
జలధి జలభాగ మెయ్యది♦ త్రోలుత తీర
భూమి కేతెంచి యచ్చోటు ♦ బోవవిడిచి
మరల యద్దియె నల సేతు♦మార్గమునను
జనుచు గొండలకూర్పును ♦ జక్కఁజేసె. 47

గజసర్పములకు సంబంధముం జెప్పుచున్నాఁడు.

సీ. నిరత నిస్స్యందమదజల ♦ నిర్ఝరములు
తరళ వారాశి జల సము♦త్థాపితములు

నైన మాతంగములు కాళ్ల♦కంటుకొన్న
పాశములరీతినున్న సర్పములనెల్ల
దంతములఁ గొట్టి చెండాడెఁ ♦ దక్షిణమున. 48

తరంగములకు రత్నాదులతో సంబంధముం జెప్పుచున్నాఁడు.

గీ. వివిధరత్నమహోద్యుతి♦విలసితములు
ఫలరసస్యందహారిత స♦ద్వర్ణఘటిత
మరకతవ్రాతములు పిష్ట♦దర విపాండు
ఫేనపుంజంబులై యొప్పు ♦ పీన వీచి
సముదయంబులు జలధిలో ♦ సాంద్రమయ్యె. 49

పాతాళమందున్న జలము పైకుబుకుట.

గీ. ఎంతమట్టుకు వార్ధిమ♦హీధ్రతతులు
నేకకాలంబుననె కప్పె ♦ నేపుమీర
నంతమట్టుకు పాతాళ♦మందునున్న
జలము లుప్పొంగె నద్భుత♦సరణి నపుడు. 50

భూక్షోభముం జెప్పుచున్నాఁడు.

గీ. ఊర్ధ్వ నిస్సృత తటినీ జ♦లోత్కరములు
స్వపద విచ్యుతి శిథిలిత♦పర్వతములు
క్షుభితవారాశిజలము ల♦క్షుద్రభూమి
కంపములు గగనతలమును ♦ గదలజేసె. 51

సేతువు కొంచెను పుట్టుటను జెప్పుచున్నాఁడు.

గీ. అర్ధదత్తకపివ్రజా♦హ్లాదమగుచు
సర్ధపాతిత ధరణీధ♦రాళి యగుచు
సత్వరార్ధాపసారిత ♦ సర్వజగతి

యగుచు నర్ధవినిర్మిత ♦ హారి సేతు
బంధము యొప్పె నబ్ధిక♦బంధమపుడు. 52

గీ. పాతితాద్రివితాన వి♦భక్త సలిల
భాగయుగ్మపృథక్స్థిత ♦ బంధమైన
సేతుబంధంబు కనులకు ♦ జ్ఞాతమయ్యె
నెప్పుడారెండు కలిసెనో ♦ యపుడె సేతు
వల్పముగ గానవచ్చె న♦య్యబ్ధిలోన. 53

మహావరాహముయొక్క డెక్కలచేతనైన గోతులు
పూరింపఁబడుచున్నవి.

గీ. పూర్ణమయ్యెను పాతాళ♦భువన మెల్ల
కాని కుపితదిశానాగ♦గమన ఘాత
భాగములు దంభకోలాంఘ్రి ♦ పాటితములు
వార్ధితలముల నింపంగ ♦ పటుత లేదు. 54

నీటియొక్క నానారూపత్వముం జెప్పుచున్నాఁడు.

సీ. భూధరానీక విమథితాం♦భోధిజలము
ధాతు నిస్యంద సంసక్త♦ధాత్రిజాత
కిసలయాతామ్రమై వృక్ష♦విసరభంగ
తువర సౌగంధ్యయుక్తమై ♦ తోచె నపుడు. 55

సముద్రసంచారమునను సేతుస్థైర్యముం జెప్పుచున్నాఁడు.

సీ. విరళపర్వతసందోహ♦విరచితమగు
సేతుబంధంబు వారిధి♦ చేతిచేత
నూపి కదలించి గట్టిగా ♦ నొక్కమారు
స్థైర్యపరిశీలనముజేసె ♦ జలిత శిఖర

పూర్ణవివరస్థిరంబౌచుఁ ♦ బొలుపుమీర
నపుడె యాగట్టు నిశ్చలం ♦ బయ్యెఁ జూడ. 56

సేతు విట్టిదని నిశ్చయింపశక్యముగాని రూపముగలదని
చెప్పుచున్నాఁడు.

గీ. వానరుల చేత నభమున ♦ బద్ధమగుచు
బడెనొ జలనిధి మలయప♦ర్వతమునుండి
తీసితెచ్చిరో పాతాళ♦వాసియైన
యిద్ది యిన్నాళ్ల కిచ్చటి ♦ కెగసివచ్చె
నోయటంచు వికల్పంబు ♦ లొక్కమొగిని
దనరె జనులకు సేతుబంధంబుఁ జూచి. 57

సేతువునందున్న పర్వతములన్నియు సమానముగాఁ
గానవచ్చుచున్నవి.

గీ. గగన మందబ్ధి సలిలంబు ♦ కనులముక్త
నాగలోకంబు నందును ♦ నభము వెలసె
గగనమందు జలంబున ♦ గరుడశత్రు
భువనమందున సమముగా ♦ మూఁటియందు
బర్వతావళి చూపట్టె ♦ వరుస తోఁడ. 58

సేతువుయొక్క యాందోళనముం జెప్పుచున్నాఁడు.

గీ. తీరదేశస్థిరాలాన ♦ వారితుఁడగు
సింధువల్లభుఁ డారణ్య♦సింధురంబు
స్తంభమును బోలె పాతాళ ♦ సన్నివిష్ట
సేతుబంధంబుఁ జలింపఁ♦జేసెఁ దరుచు. 59

సేతువుయొక్క నిబిడత్వముం జెప్పుచున్నాఁడు.

గీ. క్షుభిత జలసిక్త భూధర♦కోట్ల నెచట
హస్తములఁ బ్రేరణముజేసి ♦ యద్రిచరులు
నడుమ నవ్వాలి కవియన్ని ♦ విడుపు లేక
చేరె నొక్కొక్క టచ్చట ♦ శీఘ్రగతిని. 60

సముద్ర ధ్వని.

గీ. ప్లవగయూథమహోఘజో♦త్పాటితములు
విప్రకీర్ణమహారత్న ♦ విషమగతులు
భీతి సంపిష్ట కిన్నర♦వ్రాతములును
నైన కుధరంబు లబ్ధిలో ♦ నడుగున బడ
వాహినులభీతి నారించు♦వానిపగిది
జలధీ దైన్యంబుతో నార్చెఁ జదలుముట్ట. 61

మణిప్రభలు పుట్టుట.

గీ. ఉరుమహీధరపతన స♦ముత్థితాబ్ధి
అతుల మణికాంతిపూరిత♦మైనయట్లు
పతిత భూధరధాతుజ ♦ పంకిలంబు
కడుఁగబడినట్లు మింటికిఁ ♦ గడురయమున
నెగసి మరలంగ నుపరోధ ♦ మెనయునట్లు
భిన్న మైనను మణివర♦పీనరుచుల
ఘటితమైనట్లుఁ దోఁచెను ♦ గనఁ బయోధి. 62

జలనగజములకు సంగమము.

సీ. క్షుభిత సాగరజలమధ్య ♦ సుస్థితములు
సేతుబంధ నిపాతిత ♦ క్షితిధరౌఘ

పాతవిద్రావితంబులు • నైన వార్ధి
గజములకు దానరూపిత • కాననేభ
ఘటలకును పెద్దయుద్ధంబు • ఘటితమయ్యె. 63

సేతువునందు తరంగపతనముం జెప్పుచున్నాఁడు.

గీ. వేగభగ్నసముద్ధృత • విటపితతులు
మృదిత నలసథపార్శ్వంబు • లుదితశైల
ధాతుజంబాలకలుష వ్రీభూత వీచి
బృందములు వచ్చిపడె నప్డు • మందముగను. 64

మృగాదుల చేష్టలం జెప్పుచున్నాఁడు.

సీ. పర్వతౌఘనిపాతోత్థ • భయవిలోల
నేత్రులై యెల్లజనములు • నేర్పుకాని
నలునిమృగములు వారాశి•జలముజూడ
స్ఖలితతటమైన హ్రాదినీ • జలముమీద
కెగసి వారాశిలోఁబడ • హెచ్చరికను
కపులు కరతాళికాస్వనో•త్కర్ష మెసగ
కలకలారావతూర్యముల్ • జెలఁగఁ గనిరి. 65

సేతువును వర్ణించుచున్నాఁడు.

గీ. ఇట్టు లఖిలమహీతలా•హీనకుధర
జాలవిన్యాసరచిత సం•స్థానమగుచు
నాత్మకాంతిచ్ఛటాశ్యామ•లాంబురాశి
కుక్షికుహర లతచ్ఛంబ•రక్షయంబు. 66

గీ. విషమ చలితోరుపాషాణ•వితతిఘాత
ఛిన్నపుచ్ఛాది మత్స్యవి•శేషమగుచు

మధ్య సంఛిన్నసర్పాఘ•మండలకృత
దారుణావేష్టన విదారి•తోరుశైలము. 67

గీ. పర్వతాదాన సంభ్రమ•పరిగృహీత
నష్టగజమార్గ ధావిత • రుష్టసింహ
మవనిధరకూట సంస్థితి • నవ పయోద
గర్భ నిస్సర దధికాంబు • నిర్ఝరంబు. 68

గీ. పార్శ్వపాతిత పనమత్త•వారణోప
రుద్ధ బహుధా విభక్తాద్రి•రూఢ నిష్ఠు
రాంబుపూరంబు ధరణీధ•రావగాఢ
చందనజ్ఞాత మలయాద్రి • సానుయుతము. 69

గీ. తుంగభంగోపహత భూజ • సంగ లంబ
మాన నానాలతావర్గ • మానితంబు
విషమశిఖరాంతరాగత • వేల్లితాంబు
రాశి ఘటియించె నలుఁడట • రమ్యపథము. 70

సువేలదర్శనముం జెప్పుచున్నాఁడు.

గీ. బద్ధసేతువు విస్తీర్ణ•భావమొందె
క్ష్మాధరాహతన్నై యబ్ధి • కంపమొందె
దిగ్వికీర్ణప్రతిధ్వని • దృష్టిమార్గ
పతిత రమ్యసువేలాద్రి • బహుళ కీశ
బలము లోనరించె కలకల•ధ్వనుల నపుడు. 71

సముద్రావస్థను వర్ణించుచున్నాఁడు.

గీ. కపిసమాకృష్టి సంభ్రమ•గళితమైన
భయపలాయిత పర్వత•పక్షసమితి

నలనథాక్రాంతమై భిన్న • సలిలరాశి
మధ్యమున జూడనయ్యెను • మర్కటులకు. 72

సేతువునందు విడిపోయినప్రదేశములను మరల కలుపుటను
జెప్పుచున్నాఁడు.

గీ. కుధరసంఘాతఘాత సం•క్షుబ్ధసలిల
విక్షుతిచ్యావితావని•భృద్విశీర్ణ
బంధమా సేతుబంధంబు • భద్రముగను
బాగుజేసిరి మరల ప్లవంగవరులు. 73

సేతువు సమాప్తకల్పమైనది.

గీ. ఏ నగిది సేతుబంధంబు • నావగేశు
దాఁటి యవ్వలిదరిఁజేర • దగ్గరించె
నా నగిది వార్ధిసలిల ము•హార్యనికర
ఘాతముల మీద కెగయంగఁ • గడఁగె కొంత. 74

సేతువుమీదకు సముద్రజలముగుండా నదీజలము
వచ్చుట.

గీ. భూరిభూధరగాఢప్ర•హార నున్న
మగుచునే వారిపూరంబు • లటునిటు దిగి
సేతుబంధంబుపైఁబడె • శీఘ్రగతిని
నవియె వక్రితసంచారు•లగుచు నదుల
ముఖములై పాఱె జనులెల్ల • ముదమునొంద. 75

సేతువుయొక్క మిగిలినభాగమును తిమింగిలముతో
సంధించిరి.

గీ. తత్క్షణాన సువేలాద్రి • దరియ సేతు
బంధ మీనదసంపూర్ణ•భావ మొంద

సేతుపర్వతమధ్యస్థ • సింధుసలిల
భాగమునుగప్పి యొక తిమి • బంధపూర్తి
జేసె నందుకు జనులెల్లఁ • జిత్రమనిరి. 76

కొండలను దృఢముగా జేయుట.

గీ. విషమసంస్థిత పృథుభూమి•భృద్వరంబు
సేతుబద్ధంబు నలుఁడప్పు • చేతిచేత
మెల్లగ గదల్చి సవరించె • మీద మీద
నప్పుడాక్రాంతవసుధయా • నబ్ధి సలిల
మంతయును జేరె దనచోటు • నంతమందు. 77

సముద్రము కొంచెమే మిగిలినది.

గీ. పరిబృఢాజ్ఞాతిభార ని•ర్వహణ హృష్ట
కపివితాన నిపాతిత • క్ష్మాధరేంద్ర
గాఢతాడన వలమాన • కంధి కొంత
తడవు సేతు సువేల మ•ధ్యస్థమగుచు
నలరె కల్లోలినీప్రవా•హంబు మాడ్కి. 78

రావణుని మనఃక్షోభముం జెప్పుచున్నాఁడు.

గీ. ఏ పగిది వానరానీక • మేపుమీఱ
సేతు వంభోధిఁ గట్టెనో • చిత్తమలర
నట్లు రావణహృదయ మ•త్యంత చింత
బగిలె సాగరసలిలంబు • పగిది నపుడు. 79

సేతుసమాప్తిం జెప్పుచున్నాఁడు.

గీ. నిర్ఝరౌఘ సరత్సరి•న్నివహమగుచు
నాగలోక సరస్స్థల•భాగ మగుచు

స్థాన సుస్థిరమైయున్న సకలశైల
వర్గమునకా సువేలాద్రి వసనమయ్యె. 80

సుగ్రీవాదులకు సేతువనగా నెట్టిదో యను జ్ఞాన
మప్పుడు కలిగెను.

గీ. మలయభూధరమస్తక నిలయుఁడైన
మనుజనాథునిపార్శ్వవర్తనపరుండు
జలజబాంధవపుత్రుండు జలధిలోన
నద్వితీయమహీధరాభ్యధిక సౌష్ఠ
వంబు గలిగిన సేతుబంధంబు గట్టి
బడియె ననువార్త బహుళప్లవా వానరాసు
కలకలంబునఁ దెలియంగఁ గల్యుఁడయ్యె. 81

సముద్రము రెండుభాగములుగా విభక్తమైనది.

గీ. సేతువారభ్యమాణమై చేతిరెత్తు
లేవ జలనిధి భాగత్రయావశేష
విషమమై తోఁచె నది సమాప్తిని భజింప
నా సముద్రంబె రెండింతలయ్యె నపుడు. 82

సేతువు సువేలాద్రిపై నానుకొనియున్నది.

గీ. పృథులమైనది వారాశి వీచితతులఁ
గంప్యమానంబు నలుని యాజ్ఞ కట్టు కపుల
బరువుచే వంపబడినను వంగియున్న
తరువు క్రిందొక తరువును దన్ను బెట్టి
నిలుపురీతి సువేలంబు నిలిపె గట్టు. 83

సేతువుయొక్క ఔన్నత్యముం జెప్పుచున్నాఁడు.

గీ. భూరిసేతుద్విధాకృత పూర్వాపరమ
దిగ్విభాగంబు లనవృత్తి దేశ పార్శ్వ

ద్వితయమై మధ్యవిక్షిప్తవిషమముగుచు
నన్నితమైనట్లు చూపట్టె నభముజూడ. 84

సేతువుయొక్క పొడవుం జెప్పుచున్నాఁడు.

గీ. మలయశైల సువేలాద్రి మధ్యగమయి
పదలుఁబోలిన వారాశిజలములందు
నిలిచి యుదయాస్తధరాగ్ర నివ్వటిల్లు
రవిశతాంగపథంబన రమ్యమగుచు
నొప్పె నల సేతుపథము మహీహోద్ధతముగ. 85

సేతు వెట్లున్నదో చెప్పుచున్నాఁడు.

గీ. పవన దోధూయమానాబ్ధి వారిపూర
వివరనిష్ఠితశిఖరంబు విషమసారి
తాగ్ర్యపక్షద్వయంబయి యంబరమున
కెగయు భూధరసామ్యంబు నెఱయుచున్న
నల వినిర్మితసేతువు జలధిఁ బొల్చె. 86

సేతువు సమాప్తికాఁగా రామరావణుల యవస్థం
జెప్పుచున్నాఁడు.

గీ. అరతి నిట్టూర్పుగమి నిద్ర యల్పమగుట
అంగపాదంబు వైవర్ణ్య మనెడు నివ్వి
సేతునిర్మితి ముగియంగ యాతుధాన
పతిని జెందెను జానకీసతిని విడిచి. 87

సేతు వర్ణనము.

గీ. బంధుమిత్రప్రసేతుని బంక్తికంఠుఁ
దనదు లోకంబునకు దీసికొనెడు బుద్ధి

యముఁడు చాచిన తన దీర్ఘహస్తమనఁగ
నొప్పె నల సేతుబంధన ముదధిలోన. 88

దీని నే మఱియొకరీతిగా నుత్ప్రేక్షించుచున్నాఁడు.

గీ. విషమునై భూధరోత్తము వికటమగుచు
దీర్ఘమైయున్న శూలంబు దీప్తిఁజెలగు
సద్ధ్రిబంధాన సమర సాహసభృతంబు
బ్రికృతివిషమంబు రావణసాహసహృదయ
మార్గణంబున భిన్నమై యవియఁ జొచ్చె. 89

సేతువునందున్న కటకద్రుమములనుగూర్చి
చెప్పుచున్నాఁడు.

గీ. క్షుభితసాగర సలిలార్ద్ర కుసుమకోటి
సక్తబంభర నికరముల్ సాంద్ర పార్శ్వ
శైల సంరూఢ భూరుహాళి కిసల
మిశ్ర కటకావనీజముల్ సేరలేక
గానవచ్చెను నలశిల్పి గట్టునందు. 90

సేతువునందు స్ఫటికమయమైన భాగములం
జెప్పుచున్నాఁడు.

గీ. స్థిమిత సాగరసలిల సద్దీప్తి కలిగి
పర్వతాంతర దేశ నిపాతితములు
స్ఫాటికాశ్మసమూహ సంబద్ధములగు
సేతుబంధావకాశముల్ ఛిన్నమైన
కరణిఁ గన్పట్టె నలుచోట్లఁ గన్నులకును. 91

సేతువులోఁగట్టిన కొండలచిహ్నములం జెప్పుచున్నాఁడు.

గీ. నిరత హిమపాత నీరంధ్ర నిచితములయి
మృదిత చందనతరుగంధ మేదురంబు

లైన గిరివర మలయాద్రి పీనశిఖర
తతులు సేతునినిర్మితి చితములగుచు
నిప్పటికిసైత మెరుగంగ జొప్పడును. 92

సేతువుపైని సముద్రజల ప్రవాహ సంచారముం
జెప్పుచున్నాఁడు.

గీ. వెనుకకును ముందుకును బోవు వెల్లువలను
ధూయమానంబులై వార్ధితోయమందు
సంచరించెడు జలసింహచయము చేత
సాంద్రమై యొప్పు సాగరసలిల వేల
సేతుబంధంబు పైబడె శీఘ్రగతిని. 93

సేతువునందు సింహములయవస్థం జెప్పుచున్నాఁడు.

గీ. పర్వతౌఘ వికర్షణ పాతితములు
వారిపూరార్ద్రకేసర భారవహము
లీషదుత్తీర్ణజలధులు రోషయుతము
లైన సంచాస్యముల సేతు వందు గనిరి. 94

జలచర సంచార ప్రతిరోధమును జెప్పుచున్నాఁడు.

గీ. మున్ను జలరాశి పూర్వార్థమున వసించు
జలచరంబులు పరభాగ జలముఁజొరగ
జలధి రెండవభాగాన సంచరించు
నవ్వి.తొలుభాగమున.కేఁగ నలవిగాక
నిలిచె నెప్పటిరీతిని నెలవులందు. 95

సేతువునకు మలయును వేలములు మంగళధ్వజములవలె
నున్నవి.

గీ. ధాతుతామ్రంబు లనిలపోతాహతి ప్ర
చాల్యమాన వళతు నిర్ఝరపటంబు

లుచ్చశిఖరాగ్రదేశంబు లుభయపార్శ్వ
సంస్థితంబులు సేతుసంస్థానమునకు
మలయశైల సువేలాద్రు లాలనై రెండు
మంగళార్థధ్వజద్వయశోభంగి తోఁప. 96

వానరసైన్యప్రయాణముం జెప్పుచున్నాఁడు.

గీ. రచిత నలసేతుబంధంబు రమ్య సేతు
బంధనాధిక దేశ నిపాతితాద్రి
చలిత రాఘవహృదయ సంస్థాప్యమాన
సమరసుఖమైన వానరసైన్య మప్పుఁ
డేఁగె రాక్షసలంకకు వేగమునను. 97

వానరులు సముద్రముం జూచుట.

గీ. సేతుబంధ విభక్త విస్తీర్ణతలము
నౌర్వవైశ్వానరశిఖాచయార్ధదగ్ధ
సలిలభాగంబు వానరసైన్య మబ్ధి
దాటసాగెఁ గుతూహల తరళమగుచు. 98

వానరసైన్యయాత్రయందు సముద్ర మనుకూలముగా
నుండుటను జెప్పుచున్నాఁడు.

గీ. శంఖసంఘాత ధవళ కంజాతకులము
దళిత మరకత హరిత పత్రవ్రజంబు
కీర్ణ విద్రుమ సంయుక్త కిసలయంబు
నుభయతట గోచరంబయి యొప్పునట్టి. 99

గీ. నల వినిర్మితపథమందు నడచె కపుల
సైన్య మత్తఱి సంకీర్ణ శైలమగుచు
వడకె సేతువు దానిని వారిరాశి
కదలకుండంగ ధరియించె మొదలఁ దుదను. 100

సేతు సముద్రముల యవస్థం జెప్పుచున్నాఁడు.

గీ. స్తంభసంబద్ధ వనగజ సామ్యమునను
సేతుమూలంబు చలియింపఁ జేసి జలధి
యుపరిభాగంబును నుదగ్ర విపులవీచి
కరచయంబున నిల్పెను గదలకుండ. 101

వానరసైన్య మవ్వలియొడ్డునకుం బోవుట.

గీ. శైలభారభరాక్రాంతి జాత ఘర్మ
సలిలబిందు సమాకీర్ణ సర్వదేహు
లద్రిచరులెల్ల ధాతురాగార్ద్రమైన
హస్తముల సేతుపార్శ్వస్థితాద్రిశిఖరుల
గడఁగి దాటిరి సేతువుఁ గడుభయమున. 102

వానరసైన్యము సువేలాద్రిం జేరెను.

గీ. దనుజరాణ్ణీత నందనవన విరూఢ
పాదపాచిత వనవాట మేదురంబు
వారిభర మందసంచార వారివాహ
వారికణ సిక్త వనలతా భూరుహంబు
నౌ సువేలధరోత్సంగ మపుడు కపులు
చేరి విశ్రాంతిఁ గాంచిరి చిత్తమలర. 103

రావణునియందు రాక్షసుల యనాదరణము.

గీ. అపుడు విద్రావితాభీల రిపుచయంబు
ప్లవగసైన్యంబు వార్ధి నవ్యాహతముగ
దాటివచ్చినవార్తను దనుజవితతి
విని దశగ్రీవు నాజ్ఞను వీతదాడఁగె. 104

రావణుఁడు కృతాంతవశుఁడగుట.

గీ. ఎపుడు వార్ధితటంబున కపులసేన
విడియుటకు యత్నమొనరింపఁ దొడఁగె నపుడు
పంక్తికంఠుని దశశీర్ష పంక్తియందు
వామపాదంబుబెట్టె వైవస్వతుండు. 105

రామరావణుల ప్రతాపముంగూర్చి చెప్పుచున్నాఁడు.

గీ. తరుచరౌఘంబు సేతువు దాఁటి రాగ,
సతి జగత్ప్రియమైన యద్యువనిజేసు
శాత్రవానీక దుస్సహ శౌర్యగరిమ
ప్రాకె దిగ్భిత్తులకు మాఱు లేక యపుడు
పంక్తికంఠుప్రతాపంబు వరణవలయ
సన్నిరోధంబునను నిల్చె నున్నచోట. 106

గీ. త్రిదశజనితానురాగుండు ముద మెలర్ప
రామచంద్రుండు చంద్రునిరమణ నొప్ప
మథిత వారాన్నిధికి సద్మమాన్యగేహ
తోడ నొకవింత శోభయుఁ దోఁచె నపుడు. 107

ఆంధ్ర సేతుబంధ మహాకావ్యము నందలి
అష్టమాశ్వాసము ముగిసెను.



# ఆంధ్ర సేతుబంధ కావ్యము.

## నవమాశ్వాసము.

ఈ యాశ్వాసమంతయు సువేలాద్రివర్ణనము.

గీ. నమిత కుంభాత్మసంభవ - విమితదిశము
సకలధాత్రీతలాక్రాంతి - వికట వృద్ధ
పృథులశిఖరంబు పూర్వదిగ్విస్తృతంబు
నగు సువేలాద్రి నగచరు లంత గనిరి. 1

మఱల సువేలాద్రియొక్క గొప్పతనముం
జెప్పుచున్నాఁడు.

గీ. భువనధారణదక్షుఁడు - పూత నారి
భువనధారణ ఖిన్నుఁడౌ - పూతనారి
కలభుజంగేశుఁ డతనికి - సలిలరాశి
దాని విశ్రాంతిహేతువై - ధరణిధరము. 2

ఈకొండ భూజలాకాశవాయువుల కాధారమైయున్నది.

గీ. భూమిభారోద్వహనదక్ష - భూరిశక్తి
జలధిపూరణపర్యాప్త - జలనదీక
మంబరాయామమాన దండంబు విలయ
వాయుసంచారరోధక - పటు నితంబ
మీ సువేలంబు వర్ణింప - నేరికగును. 3

ఈ కొండ మీదగాను అడ్డుగాను దిగువగాను
వ్యాపించినదని చెప్పుచున్నాడు.

గీ. దూర విద్రావితాశంబు । దూరసమిత
నాగలోకంబు దూరను । న్నాంబరంబు
హస్తసంచేయ ఫలపుష్ప । హారి భూజ
మండలాలంకృతం బిద్ది । మహితధరము. 4

మరల మూలమాలిప్రకర్షముం జెప్పుచున్నాడు.

గీ. పార్శ్వ భాగస్రవన్నదీ । పటలమగుచు
ననవరత సక్తపాతాళ । వనధివారి
సముదయోత్సంగమై యొప్పి । భద్రకోల
పుచ్ఛ విక్షేప ఖండిత । భూమిశకల
మనగ నొప్పు సువేలాద్రిఁ । గనిరి కపులు. 5

మూలదార్ఢ్యముం జెప్పుచున్నాడు.

గీ. సర్వలోకస్థ మూలదేశప్రతిష్ఠ
గలిగి వజ్రౌఘ సంపేష । ఘుటిత మృత్తి
కా దృఢీకృత నిష్కంప । గతి యుతంబు
దితిజమత్తేభ కండూల । వితతగండ
కషణ మసృణితపార్శ్వస్థ । గండశిలము
నై వెలింగె గజాలాన । మనగ నద్రి. 6

మరల మూలమాలిప్రకర్షముం జెప్పుచున్నాడు.

గీ. మృదిత పాతాళతలుఁడైన । మేటిపావ
జేనికైనను జూడంగ । రాని మూల
మమరరక్షణపరత న । వ్యాహతాత్మ

వృద్ధినొందు త్రివిక్రమ వృషభుడైన
గని యెరుంగడు దీని శృంగంబుఁ దొల్లి. 7

మరల దాని దార్ఢ్యమునే చెప్పుచున్నాడు.

గీ. జలధి మథనక్షణమ్మున శార్ఙ్గపాణి
కరచతుష్కముచే మున్ను కదియబట్టి
మందరమువోలె రవికర మండలమున
గాఢ సంశ్లిష్టమెయ్యొప్పు కాంతిమిగుల
క్షిప్త సాగరవారి సోత్సేధకటక
విహార దహినాథదత్త సంవేష్టనంబు. 8

మరల మూల మాలి మహత్త్వముం జెప్పుచున్నాడు.

గీ. శేషశీర్ష మహారత్న • చిత్రకాంతి
కర్బురిత మూలమణిసంఘ ఘట్టనోత్థ
సుషమ సంక్షీణ పాతాళ విషమ తిమిర
ముచ్చశిఖశాఖ సంవృతోద్ద్యోత సూర్య
మగుట గగనంబు తిమిరోపహతిని జెందె. 9

మరల నౌన్నత్యముం జెప్పుచున్నాఁడు.

గీ. చంద్రపార్శ్వ నిఘర్షణ సాంద్రకృష్ణ
వ్రస్త శేదూక నిస్సరత్ప్రబల సుధము
చంద్రికాపూర సంప్లావ సమునజాత
మితి విహీనోష్మబోధిత మిహిరరథము. 10

తిరిగి దానినే చెప్పుచున్నాఁడు.

గీ. నిశల వినికృత్త ధారిత నీరజాత
కందమై దేహసంసక్త కర్దమంబు

నౌచు విలసిల్లు సురదంతి । యంద మొప్ప
శిఖర లీన శశాంకమై । చెన్ను మీఱి
విరళ సంపీత జలమేఘ । భిత్తమగుచు. 11

నదీసంబంధమును జెప్పుచున్నాఁడు.

గీ. హరిత వనరాజి పిశునితా।యత విదూర
దృశ్యమానోరు బహుళ న।దీముఖంబు
పవన ఖండిత విక్లాంత । పద్మవైరి
రశ్మి సంగ సవీకృత । రమ్యతఁ గనె. 12

సముద్రమందు సువేలాద్రి ప్రతిబింబమును
జెప్పుచున్నాఁడు.

గీ. దూరగమనోద్యతంబులై । తోఁచుపగిది
తుంద శిఖరవ్రజంబులఁ । దోర మగుచు
ప్రళయ వజ్రప్రహారాతి । ప్రహృతమగుచు
నేకభాగంబు నా వార్ధి । నీఁక జెలఁగు
చున్న ప్రతిబింబమును దాల్చి । యొప్పుదాని. 13

కొండయొక్క గురుత్వమును జెప్పుచున్నాఁడు.

గీ. ప్రబలభారభరానమ్ర । ఫణిమహీశ
శీర్ష సంఘబలోద్ధృతా।శేష మూల
భాగ ముద్ధుర సంవర్త । వాయువేగ
భగ్న నీత తటాపత।త్పాటితాన్య
శైలశిఖరంబు గని రప్డు । సంతసమున 14

ఈకొండ శ్వాపదములచే నిండియున్నది.

గీ. పీత పానీయజలధర । ప్రేరణాత్త
సౌఖ్య నిర్భర సునిషణ్ణ । సైరిభంబు

నిహత వేదండకటయుగ్మ నిర్గతార్ద్ర
రుధిర రూషిత ఘనశిలా గ్రథిత శుష్క
మౌక్తికాలంకృతం బౌచు మహితమయ్యె. 15

తిరిగి దానినే చెప్పుచున్నాఁడు.

గీ. సింధుజలశీకరవ్రాత సిక్తభూజ
నిచయ సంజాత పల్లవ నిబిడ రాగ
జనిత సాంధ్యాభ్రవిభ్రమ మనఘధరము
సింహగర్జారవ త్రస్త చిత్ర జంతు
జాల సుఖవాస సముచితోత్తాలగుహము. 16

తిరుగ దానివిస్తారముం జెప్పుచున్నాఁడు.

గీ. విపుల కటకావళీ ప్రతి ప్రేరితములు
రవి కరవ్యాప్త కందరాశ్రయములగుచు
నొప్పు దిశలెల్ల దీనికి నుండె వెనుక
ననగ రాజిల్లు నెప్పుడీ యవనిధరము. 17

ఉదారత్వముం జెప్పుచున్నాఁడు.

గీ. రాత్రి శిఖరాగ్రసంస్థిత రత్నకాంతి
పుంజ నీరాజితాభ్రంబు పురుడు లేని
దతిసుఖాసీన మృగనిచయాద్యమాన
శృంగ సంరూఢ నవతృణాక్షేప్తమిద్ది. 18

దీని యత్యౌన్నత్యముం జెప్పుచున్నాఁడు.

గీ. మూలభాగ సమాత్త పాతాళలోక
మంశుమాలికరాతీత మస్త తేజ
మబ్ధితోయ సమాచ్ఛన్న మర్ధభాగ
మట్లనే వ్యోమనష్టార్ధ మద్రిపాడవు. 19

చందనవృక్షములం గలిగియుండుటం జెప్పుచున్నాఁడు.

గీ. మారుతాఘాత చందన భూరుహాళి
ఘట్టనోత్థిత సౌగంధ్య ఘటితదిశము
కంఠదఘ్న నిపీతాబ్ధి కమలభరిత
గురుక జలధర సంఘాత గాఢమాళి. 20

ఈ కొండయందు నానావస్తుసంబంధముం
జెప్పుచున్నాఁడు.

గీ. మూలభాగోపహత వార్ధిపూర్ణజలము
నూర్ధ్వ నిష్ఠ్యూత నిర్ఝరాళ్యుదకధార
నిహతి రోషిత పంచాస్య నివహమాచు
తారకాగ్రహనక్షత్ర పూరితమయి
శిఖర సంస్థిత శశలక్ష్మ శేఖరంబు. 21

తిరిగి దానినే చెప్పుచున్నాఁడు.

గీ. తుంగమౌళి సమాక్రాంత తోయజారి
వాయుశూన్య దరీముఖ వహదకంప
నిమ్నగౌఘము మణిమయ స్నిగ్ధ పార్శ్వ
మమల పాషాణ నిష్ఠిత హరిణ సమితి. 22

శ్వాపదములచే నిండియున్నదని చెప్పుచున్నాఁడు.

గీ. దంతయుగఘాత నిర్భిన్న దరకరోరు
కుపిత శార్దూల కబళిత కుంభిచయము
బిలశయాళు బిలేశయ విపుల శీర్ష
మణివరానీక నిర్గతామలరుచంబు. 23

తిరిగి దానినే చెప్పుచున్నాఁడు.

గీ. మారుతోద్ధూత వారాశి వారిబిందు
సంతతుల చేతముట్టనశక్యమౌచు

కంటకాయిత మణిమయ ఘనతటంబు
కరరుహాసక్త మౌక్తిక భర గజేంద్ర
మస్తకారూఢ హర్యక్ష మండితంబు. 24
గీ. గురుక వర్షోదక క్లిన్న కోమలములు
నా శిఖరమూలపర్యంత హారి కుసుమ
పల్లవానీక ఫలభర బహుళ శాఖ
లాతపాశుష్క మారుతపోత ధూత
వల్కలాంశుక సంవీత వనభృతంబు. 25

నదీ ప్రవాహము జెప్పుచున్నాఁడు.

గీ. మిళితసాగరజలములు మృదిత పార్శ్వ
రూఢ తరువులు ఫలసుమాకీర్ణ తటులు
స్ఫటికభూమిగళత్స్వచ్ఛజలములైన
నదుల నొప్పారు నేయద్రి ముదముగొల్పు. 26

మరల నౌన్నత్యము జెప్పుచున్నాఁడు.

గీ. స్తోకతోయార్ద్రరశ్మి లసత్స్తోక గళిత
స్యందినీ ఫేనపుంజ నిస్స్యందజడము
లైన కమలాస్త్రరథయుక్త హయముఖముల
వాత విక్షిప్త నిర్ఝర వారిబిందు
వితతిచేఁ గడ్గుచుండెడు విధముదోఁచు. 27

దానినే మరలఁ జెప్పుచున్నాఁడు.

గీ. దీర్ఘశిఖరాగ్ర సక్తంబు దీప్రకాంతి
జాల దివ్యౌషధీ స్పృష్ట శశ కళంక
మైన మృగలాంఛనుని బింబ మంబరమున
కజ్జలాన్వితకుక్షి నా గానవచ్చె. 28

నదుల యాధిక్యముం జెప్పుచున్నాఁడు.

గీ. ఉద్ధృతావనిగర్త నిమ్నోదరంబు
దంభపోత్రిసమాహృతోద్దండ పంక
మతుల సంవర్త చండాంశు వితత తాప
శోషితాంభోధినంతయు పోషితంబు
జేయు నీకొంతఁ బుట్టెడు సింధువితతి. 29

గుహాల గాంభీర్యముం జెప్పుచున్నాఁడు.

గీ. అవిదితోత్పత్తి దేశంబు లతి గభీర
ప్రతిరవత్రస్త విద్రుత వనమృగంబు
లుద్ధృతైకశ్రుతిప్రోద్యతోరుగజము
లద్రివివరోదరాభ్యంతరాశ్రితములు
నైన వనసింహరవముల కాటపట్టు. 30

తిరిగి దానినే చెప్పుచున్నాఁడు.

గీ. అత్యగాధ సరోజాత నిత్యఫుల్ల
పద్మషండ రజఃకణ పాటవంబు
ముదిత కాదంబ నిస్స్వనముఖరితంబు
వక్త్రకుహరాంతరాహిత పలలఖండ
మబ్ధివేలానిలార్ద్రిత హరితవనము. 31

గుహాగాంభీర్యముం జెప్పుచున్నాఁడు.

గీ. సంక్రమితతోయరాశ్యర్ధజలములగుచు
కబళితాయత గగనభాగంబులగుచు
గ్రస్త దశదిఙ్ముఖాభోగ కలితములయి
భువనభాగంబులనఁబోలు భూరిగుహాల
నెల్లెడల గల్గి యియ్యద్రి యుల్లసిల్లు. 32

సెలయేళ్ల స్వాదముం జెప్పుచున్నాఁడు.

గీ. అనిల విక్షిప్త జలధి జలావృతములు
స్తోకనశ్చాద్గతాస్తోక  తోయతతులు
ఆదిమధురంబు లంతంత  కబ్ధిజలము
నిండ లవణంబులై యొప్పు  నిర్ఝరముల
దాల్చియుండును సతత మీ ధరణీధరము. 33

దీనియందు రత్న కాంతులు.

గీ. వివిధరత్నచ్ఛవివ్రాత  విచ్ఛురితము
వలదపీంద్రమహాఫణాచలన ధుతము
మంజుపద్మసరోవర  మండితంబు
కటకరూఢలతాలగ్న  కమలబంధు
రమ్యరథచక్రమిది సురాగమ్యమగును.

మణీతటముంగూర్చి చెప్పుచున్నాఁడు.

సీ. నీలపుష్కరనిభములు  నిష్ఠురాత
పాహతిగ్లాన మహిషసంఘార్ధ్యమాన
భూతలప్రాప్తిమార్గంబు  లాతతోరు
పార్శ్వసంజాతరశ్ములుత్పన్న విపుల
మరు మరీచికలాయత  సరసులగతి
నొప్పె మణీమయతటము లయ్యురుధరాన.

అనురూపగతిని చెప్పుచున్నాఁడు.

గీ. మత్త వేదండ భగ్న తమాలవనము
సింహముఖ రుద్ధ రాజత  శిఖరఖండ
కృష్ణమహిష విఖండిత  కృష్ణశిలము
స్థాన సంత్యక్త వనచరోదగ్రరుషము.

గజముక్తామయత్వముం జెప్పుచున్నాఁడు.

గీ. క్రూరసింహనఖాహతి • దారితేభ
కుంభవిచ్యుత ముక్తౌఘ • సంభృతంబు
దావవైశ్వానర త్రస్త • ధావమాన
దంతి సంభ్రమ సంభగ్న • తటకుజంబు. 37

తిరిగి పర్వతౌన్నత్యముం జెప్పుచున్నాఁడు.

గీ. కటక సంచరదుష్ణాంశు • ఘనరథంబు
తాల వనరాజి వినిరుద్ధ • తారకాళి
పార్శ్వభాగ నిషణ్ణ సం • పత్తి విలస
దోకమై వెల్గు నా భువ • ర్లోకమునకు
మీఁదుగా నుండు నీకొండ • మేటియగుచు. 38

తిరిగి యౌన్నత్యమునే చెప్పుచున్నాఁడు.

గీ. అద్రిసంభిన్న సూర్యస • హస్రకరము
లేక దేశాసమాప్తాబ్జ • కృత్స్నకిరణ
సంతతులు గరుడమార్గిత • సత్పథములు
నైన కటకంబులను గల్గి • యద్రియొప్పు. 39

రత్నాధిక్యముం జెప్పుచున్నాఁడు.

గీ. దివ్యవరవర్ణినీ కుచ • ద్వితయ శోభి
హార ఘటితోచ్చరత్నోప • హారదంబు
సిద్ధ రత్నాసనంబౌచు • సింధువునకు
వనజపత్రాంతరస్థిత • స్వాదుజలము
వకుళ పుష్పాళివాసిత • వనవృతంబు. 40

గైరికాది ధాతుమత్తను జెప్పుచున్నాఁడు.

గీ. వృద్ధసూర్యాతప ద్రుత • పీతనోత్థ
గంధ మూర్ఛిత మృగగణ • బంధురంబు

శుష్కసాగర శీకర ♦ క్షోదజనిత
లవణ రసలోల మహిష జా♦లస్రవిహ్వ
మాన పాషాణమండల ♦ మండితంబు. 41

రజతమయశిఖరముం జెప్పుచున్నాఁడు.

గీ. తుంగ కలధౌతమయశృంగ ♦ సంగతార
ముగ్ర పంచాస్యఖండితో♦దగ్రకుంభి
కుంభ నిస్సృత లోహిత ♦ శుంభదమల
మౌక్తికము బహుళయుగళియు ♦ మానితంబు
జలధితోయవిమిశ్ర కా♦సారజలము. 42

దీనియందు మఱియొకగుణముం జెప్పుచున్నాఁడు.

గీ. మణిగణశ్యామలాంబు స♦మాన్యసరసి
మోదమాన సురోరగ ♦ ముఖ్యగణము
ప్రావృషేణ్య పయోవాహ ♦ వారిశాంత
దావపావకపీడ యీ ♦ ధరణీధరము. 43

మఱియొకగుణముం జెప్పుచున్నాఁడు.

గీ. దృప్తదశకంఠ సంతోష ♦ దీపకంబు
కందరాస్థిత సౌగంధ్య ♦ కలితజలము
విమల కలధౌతకాంతి వి♦భ్రమతటంబు
వాంత విషభూరుహానీక ♦ వర్ధకంబు. 44

చందనవృక్షములం గలిగియుండుటం జెప్పుచున్నాఁడు.

గీ. జరఠ విషనాశకౌషధీ♦జాలవేష్ట
నాహి సంత్యక్త సురభిళ ♦ రోహిణంబు
సంచరద్గూఢ పాత్ఫణ ♦ సాంద్ర రత్న
కాంతి సహృత భూరుహచ్ఛాయ♦కాంత మిద్ది. 45

స్ఫటికమణులం గలిగియుండుటం జెప్పుచున్నాఁడు.

గీ. స్ఫటికమణికాంతి ధవళిత • సర్వభూమి
శ్రూయమాణాప్సరోగీతి • సుఖవితీర్ణ
క్షయసమయ వారిపూరాసక్తకల విధౌత
ముదితచంద్రాభ కలధౌత • కోజ్జ్వలంబు. 46

పద్మరాగాదిమణులం గలిగియుండుటం జెప్పుచున్నాఁడు.

గీ. పద్మరాగాదిమణిగణ • ప్రభవకాంతి
కందరాశ్రిత తరులతా • కబళితంబు
పూత తారాగ్రహాది వి • ద్ద్యోతితంబు
నాకబందీ నివాసైక • నవగృహంబు. 47

పంకబాహుళ్యముం జెప్పుచున్నాఁడు.

గీ. కర్దమోత్తీర్ణపోత్రిని • గదియజూచి
దాని లంఘింపఁ గ్రమ్మఱ • దంష్ట్రి బురద
నుఱుక సింగంబు వంచన • నొంది మరలి
పోయె నిజయత్న మోఘత • బుద్ధిఁ దలఁచి. 48

శిఖరోత్కర్షముం జెప్పుచున్నాఁడు.

గీ. సజలనీలాబ్ద లావణ్య • సంయుతంబు
సకల నక్షత్రతారకా • చ్ఛవి విశేష
రచిత మేఖల నాకాశ • రమను దీర్ఘ
బాహుసదృశంబులగు శృంగ • పటలములను
గప్పుచున్నట్టి యాగట్టుఁ • గనిరి కపులు. 49

దీనియందు గుణాంతరముం జెప్పుచున్నాఁడు.

గీ. రావణాశ్రిత రాక్షస • రమ్యవసతి
సింహదనుజాదిగర్జితా • శ్రితశరంబు

దశదిశాకామినీవర్గ ♦ ధారకంబు
నంధకార మహీపాల♦కాశ్రయంబు
సూర్యకాంతమణీద్యుతి ♦ శోభితంబు. 50

సువేలాద్రియొక్క శరీరమహత్త్వముం జెప్పుచున్నాఁడు.

గీ. ఇద్ధకాయత కేశవు ♦ డిద్ధరిత్రి
గొల్చి నవ్వు డతండును ♦ జలదజలధి
సప్తకము విలయమందును ♦ సకలవృత్తి
నాక్రమింపంగ నెద్దాని ♦ నలవిగాక
యూరకుండెనో యదియె యీ ♦ యుర్వివోయు.51

ఆ స్థితినే మరల జెప్పుచున్నాఁడు.

గీ. జాలరంధ్ర వినిర్గత ♦ శాంతరశ్మి
యస్తమితుభంగి దనరుచు ♦ మస్తకోత్థ
దావశిఖికీల సందగ్ధు ♦ భావమొంది
యున్న భాస్కరు శిఖరాన ♦ నుంచుకొనెను. 52

సింధుతరంగాభిఘాతముం జెప్పుచున్నాఁడు.

గీ. దుష్టజామాతృభాషిత ♦ దూషణముల
దుహితృవాత్సల్యవశులయి ♦ దూరదర్శు
లైన గేస్తులు సైరించి♦నట్లు సతము
భీషణౌర్వాగ్ని సంతాప ♦ భిన్నతటము
లైన యబ్ధితరంగప్ర♦హారములను
సైచు నీకొండ నదులను ♦ సాఁకఁ దలఁచి. 53

తిరిగి యౌన్నత్యముం జెప్పుచున్నాఁడు.

గీ. నిశల నాతామ్రమణిశిలా♦నివహమందు
సంక్రమించిన శుభ్రాంశు♦ఛాయల గని

రవిశతాంగాశ్వఖురచిహ్న • రమ్యపథము
భంగి రాజిల్లె బహుళపక్ష • భాస్వితంబు. 54

దీనియందలి స్వర్ణమయభూమిం జెప్పుచున్నాఁడు.

గీ. విషమదేశస్థితంబులు • విషమరూఢ
నిబిడనానాలతాగృహ • నిచులితములు
దితవికర్తనరశ్మిసం • తతినిభంబు
లైన కాంచనశిలలచే • నావృతంబు. 55

మరల నౌన్నత్యమునే చెప్పుచున్నాఁడు.

గీ. దినకరాలోకశూన్యముల్ • దివసనాథ
భీషణాతపభీతద • ర్వీకరాళు
లూర్ధ్వపరివర్ధితచ్ఛాయ • లురువులైన
వనములను దాల్చు నీకొండ • వప్రములను. 56

మరల నౌన్నత్యమునే చెప్పుచున్నాఁడు.

గీ. వారివాహాధ్వపర్యంత • సారితములు
త్రిదశవేదండరదయుగ్మ • తీవ్రఘాత
భిన్నతటములు బహుదీర్ఘ • విటపిషండ
శోభితోన్నతకటకముల్ • చూడ్కిఁ దనుపు. 57

దీనికి పారిజాతసంబంధముం జెప్పుచున్నాఁడు.

గీ. విబుధవేదండహస్తోష్మ • పీడ్యమాన
రక్తపల్లవసంఘాత • రాజితములు
ద్విరదకండూలకటభిత్తి • పరుషకషణ
కృత్తవల్కలసందోహ • కృష్ణవర్ణ
నిబిడమై యొప్పు కల్పావ • నీరుహముల
శిఖరముల దాల్చు నెప్పుడీ • శిఖరిగనుడు. 58

గీ. మణిమయోరునితంబోత్థ • మహితకాంతి
ధవళితాంకమృగంబు శు•ద్ధాంబు లసిత
నిర్ఝరాఘాత విపరీత • నిర్మలాత్మ
బింబమునుగల్గు చంద్రుని • పృథు నితంబ
పాళిచే మోయుచుండెడు • పర్వత మిది. 59

దీనియందు వనసమృద్ధిని జెప్పుచున్నాఁడు.

గీ. సలిలధరఘాత సురభిళ • సాంద్రకుసుమ
ముసరిసంచరదహిమాంశు • విపులరశ్మి
జలధిశీకర సేచన • శ్యామలంబు
నైన వనరాజి నొప్పు నీ • యవనిధరము. 60

దేవగజముల రాకపోకలం జెప్పుచున్నాఁడు.

గీ. అరిగి కడుదూర మంబర•మందు మరల
మరలివచ్చెడు దానార్థి • మధుకరాళి
ఝంకృతినినాదముఖరితా•శాతటంబు
లవపతన బోధితంబులు • నైన విబుధ
దంతిమార్గంబు లీకొండ • దాల్చునెపుడు. 61

దీనియందు రత్నాంకురములు పుట్టుట.

గీ. స్తోకనాశిత తిమిరముల్ • స్తోక నిర్య
దమలకాంతులు దర నిర్గ•తాస్నిగర్భ
తములపోలిక నుండు వి•స్తార రత్న
సముదయాంకూరభూముల•సరణి దాల్చు. 62

ఈకొండ వనగజయుద్ధచిహ్నముల ధరించుచున్నది.

గీ. భగ్నశుష్కద్రుమంబులు • భద్రదంతి
కాయవేష్టన పుంజిత • కాననోరు

లతలు గాఢ ప్రహార ఖం। డితరదంబు
లాదిగాగల గజసంప్రహార చిహ్న
లవనిధర మిద్ది దాల్చెడు। ననవరతము. 63

సముద్రజలసత్త్రను జెప్పుచున్నాడు.

గీ. మథన సమయాన మందర। క్ష్మాధరేంద్ర
ఘాత దలితంబు లురుమణి। గర్భితంబు
లవట నిహితంబు లవి నిర్గ। తామృతములు
నైన జలధి ప్రదేశమ్ము। లధికముగను
దాల్చు నీకొండ సతతంబు। ధన్యతమము. 64

రామశరసత్త్రను జెప్పుచున్నాఁడు.

గీ. పౌరుషాతత పవిచ్ఛిన్న। పక్షశేష
ధారి యీకొండయన నొప్పు। ధరణిమీద
లవణవార్ధిజలక్షోభ। లగ్నమైన
యవనిజాభర్తృశరజాల। మంటియుండ. 65

కరికేసరియుద్ధము.

గీ. కుంభయుగ్మసమాక్రాంతిఁ। గుంభిని పయిఁ
గూలినట్టి మదేభంబు। క్రోధవశత
స్వకర మెత్తి మృగేంద్రంబు। సటల బెరికి
చేసె వైరూప్యనిహతంబు। సింహమఱవ. 66

ఇచట చంద్రకాంతమణులున్నవని చెప్పుచున్నాఁడు.

గీ. మందమారుత సంస్పర్శ। మంద కంప
శైవలంబులు హిమఖండ। శైత్యయుతము
లర్ధశుష్కంబు లాతపోహతిని జెంది
చంద్రకాంతమణిస్యంద। సలిలపూర
రాజితం బీమహీధర।రాజ మెపుడు. 67

దీనియందు పారదసత్తను జెప్పుచున్నాఁడు.

గీ. విషమ నిర్గత పరిమళ । విస్తృతములు
బిసరుహాచ్ఛద గతజల । బిందురుచులు
మరకతాశ్మమయస్థల । పరిగతములు
నైన పారదరసము లీ । యద్రివాల్చు. 68

సూర్యసంచారక్రమమును జెప్పుచున్నాఁడు.

గీ. ఊర్ధ్వసంచార ఖిన్న హరియోత్త ముండు
మరల మధ్యాహ్నమున సమకమండలుఁడయి
సరళగతి బోవు నవ్వల । సాయమందు
దిగువ కరిగెడు పంచాస । దేజరిల్లు. 69

తారకాసంచారమును జెప్పుచున్నాఁడు.

గీ. విషమమార్గపరిత్యాగ । విహితబుద్ధి
వనచరావళి కటకపార్శ్వములయందు
సంచరత్తారకాజ్యోతి । సాయమునను
గమ్యపథముల సుఖముగా । గందురిచట. 70

చంద్రసంచారమును జెప్పుచున్నాఁడు.

గీ. శిఖర సంసక్త చంద్రుని । జేరి దయిత
విరహ సంతాపకృశలైన । భిల్లయువతు
లశ్రు మలినిత కుసుమప్రహారములను
గొట్టి మెల్లగఁబోవు నీ । కుధరమందు. 71

గగన సామ్యమును జెప్పుచున్నాఁడు.

గీ. గ్రహసమూహవిరాజిత । గగనమునఁగ
మేరమీఱిన పరిమితి । మీఱిన దన
శిఖర సంరుద్ధలయ వాయుశేషశ్రిత యన

రత్నమణిరాగరంజన ♦ రమ్యమనఁగ
సింహగర్జన ముఖరిత ♦ శృంగమనఁగ
నొప్పు నీకొండ సతతంబు ♦ నుక్కుమిగిలి. 72

వ్యాపకత్వముం జెప్పుచున్నాఁడు.

గీ. అఖిలదిశలును దేనియం ♦ దణఁగినట్లు
క్షీణమైనట్లు దేనిలో ♦ క్షితితలంబు
వ్యోమ మెద్దాన నవసితిఁ ♦ బొందినట్లు
కడలి యెద్దాని విలయంబుఁ ♦ గాంచినట్లు
నష్టమైనట్టు లెద్దాన ♦ నాగ జగతి
జగములన్నియు దేనిలో ♦ దిగినయట్టు
లొప్పు నీకొండ యుర్విలో ♦ నుపమలేక. 73

వికటమైన శిఖరములం గల్గియుంటం జెప్పుచున్నాఁడు.

సీ. వక్రిమగుచున్న యుగముచే ♦ వక్రమైన
మెడలుగలవియు మిహిరుని ♦ మేటియంత
వాని ఋజుమార్గమునఁ బెట్టఁ ♦ బూనినపుడు
ఘోణమున వ్రేలు చామర ♦ కోటిగలవి
యైన రవిరథహయములు ♦ దేనిశిఖర
మందు జనుచుండు వక్రతఁ ♦ జెంది సతము, 74

దీనియందు జ్యోతిర్లోకసత్తం జెప్పుచున్నాఁడు.

గీ. ఎచటివనముల పుష్పంబు ♦ లేపుచూపి
తొలి నిశల సూర్యుఁ డుదయింపఁ ♦ దలఁగి కాంతి
తారకావళిభంగిని ♦ దూరముగను
గానవచ్చును కనువారి ♦ కన్నులకును, 75

దీనియందు మహిషములయొక్క నిద్రం జెప్పుచున్నాఁడు.

గీ. స్థూలనిశ్వాస నిర్ధూత ♦ తోయదములు
చంద్రకిరణాళి సంస్పృష్ట ♦ చంద్రకాంత
సలిల నిష్యంద సేచన ♦ సౌఖ్యమంది
నిశలయందు లులాయముః ♦ నిద్రఁజెందు. 76

ఇచ్చట మహోరగము లున్నవి.

గీ. ఏమహీధరశిఖరాన ♦ నిండుబింబ
మురుశిలాభిత్తిపార్శ్వమం ♦ దుండియుండి
సర్పరాట్ఛీర్షమణి నిఘ♦ర్షణ వినష్ట
కాంతిసంచయమై దారిఁ ♦ గానలేక
పోవు నిటునటు దిగ్భ్రమఁ ♦ బొందినట్లు. 77

కంపోత్కర్షముం జెప్పుచున్నాఁడు.

గీ. ప్రళయసంభవ దుత్పాత♦వాతధుతము
త్యక్తపాతాళలోకంబు త్యక్తశేష
వార్ధిజాతంబు వార్ధియే ♦ సర్వతస్థ
తటముముంచంగ శక్తమౌ ♦ పటిమఁగలిగి. 78

మేఘములు సింహములు కలిసియుండుట.

గీ. కరరుహాంకుర శిఖర వి♦ఖండితాంబు
దములు వక్త్రాంతరావిష్ట♦తరళ వైద్యు
తాగ్ని సందగ్ధకేసర ♦ హారితాత్మ
శోభలైనట్టి సింహముల్ ♦ చుట్టుఁదిరుగు. 79

హరిచందనవృక్షములక్రింద నేనుంగులు కూర్చొనుచున్నవి.

గీ. నిర్ఝరోదక మజ్జన ♦ నిర్గతాత్మ
తాపములు మరల నాతప♦తాపితములు

గండకషణాతికంపిత ఽ ఘనవిశాల
చందనానోకహచ్ఛాయ ఽ లందుఁ దిరుగు
మదగజంబులు వశలతో ఽ ముద మెసఁగ. 80

సూర్యగమనాగమనములం జెప్పుచున్నాఁడు.

గీ. అటనశీల ద్విరేఫాళి ఽ కటకరూఢ
తరువరాగ్రవిలగ్న చా ఽ మరశిఖంబు
శ్వసిత నిర్ధూత పుష్పర ఽ జంబులైన
తరణిరథవాజిబృందగ ఽ తంబు దెలియ
వచ్చునే కొండసానువు ఽ లుచ్చఁజూడ. 81

ఇచట ఖైదీలుగా పట్టుబడిన యప్సరస లున్నారు.

గీ. పాపదశకంఠ కారాని ఽ బద్ధ విబుధ
యువతి కజ్జలమాలిన్య ఽ యుతములైన
లోచనాశ్రుకణంబు లు ఽ ల్లోలమైన
కల్పతరువుల యంశుక ఽ గణములకును
జేయుచుండు మలీమస ఽ స్థితుల నిచట॥ 82

ఈకొండ దీర్ఘత్వముం జెప్పుచున్నాఁడు.

గీ. సతత మయనద్వయంబున ఽ సవిత నభము
రాకపోకలచేత నే ఽ రమ్యమైన
యాక్కశిఖరంబునను యంత ఽ మొందు నెప్పు
డాతెరువు శోషితావని ఽ జాతమునను
తెలియఁబడుచుండు నాకొండ ఽ దీర్ఘతయును. 83

ఈకొండవృద్ధిని జెప్పుచున్నాఁడు.

గీ. ఎద్దిభరభిన్నభూతలం ఽ బెద్ది మూల
నిహత పాతాళ మెయ్యది ఽ నిహ్నుశాఖి

లాంబరంబెద్ది సర్వది । గ్వ్యాప్త మెద్ది
యివ్విధంబునఁ బరివృద్ధి । నెద్దిపొంది
త్రిభువనంబును వర్ధిల్లఁ । దేజరిల్లు. 84

నిత్యము సకలఋతువులు దీనియందుండును.

గీ. నందనోద్యానవిహరణా । నందితములు
గంధలోభభ్రమద్భృంగ । గణము లెచట
సర్వఋతువులు సౌరభ్య । సాంద్రములగు
సర్వకాలంబులందు వైశేష్యముడిగి
యాక్కరాటకుఁ గట్టిన । యుద్ధతేభ
వితతి కైవడి నీ మహీ । భృత్తునందు. 85

శిఖరౌన్నత్యముం జెప్పుచున్నాఁడు.

గీ. ఏమహీధర శిఖరాన । నెపుడు సవిత
దృఢవిలగ్నవరిమోచిత । దేహుఁడౌచు
నికటవర్తి దశానన । నిష్ఠురాజ్ఞ
భీతుఁడౌచు మహోద్భ్రత । యాతి నొంది
సరుగులిడువానిబోలె గ । నవ్పట్టుచుండు. 86

ఇచట కిన్నరగానముం జెప్పుచున్నాఁడు.

గీ. కిన్నరీహారి గానావకృష్ట । మృగము
లతి సుఖావాప్తిచేఁ జొక్కి । యఖిమూసి
రోసి నోమంథముల హ్రాప్త । రోమములయి
చేరి క్రీడించు నీకొంత । శిఖరమందు. 87

ఇచట తెల్లకలువల వికాసముం జెప్పుచున్నాఁడు.

గీ. ఎచటనున్నట్టి సరసుల । నింపునింప
సంచగమికూత చెవులకు । నానితలిడు

దంతియుగముల కలహంబు తగ్గకుండు
కుముదవనములు సూర్యుని కుంఠరశ్మి
సోకినను ముకుళభావంబు దాఁక వెపుడు. 88

ఈ కొండను శేషనాగుఁడు పెద్దపూనికతో
మోయుచున్నాఁడు.

గీ. పార్శ్వపరివర్తనము సల్పఁ బద్మనాభుఁ
డహికులాధీశుఁ డాత్మీయ బహుళభార
నమిత ఫణబృంద ముజ్జ్వల విమలరత్న
రశ్మిరంజిత మీ గిరిశేఖరత్నమందు
బెట్టి విశ్రాంతిగాంచును భీతివిడిచ. 89

చంద్రుని యవస్థం జెప్పుచున్నాఁడు.

గీ. ఏ నగంబున కటకావకేళీనుఁడగుచు
వివరతుల్యమృగచ్ఛాయ నవఘళించి
యుభయభాగ వినిర్గతోత్కద్ద్యోతుఁడైన
చంద్రుఁ డున్నతశేఖర నిర్ఝరవిదీర్ణ
మంచలునిమాడ్కి రాజిల్లు నిండుకాంతి. 90

ఈకొండ మూఁడులోకములకు నాధారమని
చెప్పుచున్నాఁడు.

గీ. మధ్యవివరంబు గలవి యనేమానభరము
లైన ముల్లోకములు విష్ణు నతికఠోర
బాహుయుగళంబున వసించు వలయములన
నంటియుండును నీగిరి ననవరతము. 91

నక్షత్రముల రాకపోకలం జెప్పుచున్నాఁడు.

సీ. ఎచట శోభిత భూరుహం బిసనథంబు
సితమయూఖునిమార్గంబు శీతలంబు

వనములందు తనుత్వముఁ । బడసి కొంచె
మైనఁ దెలియదు చుక్కల । యానపథము. 92

దేవస్త్రీసంచారముం జెప్పుచున్నాఁడు.

గీ. ఎచట బృందారకాంగనా । కచ విలగ్న
సురభిగంధంబు శిలలపై । పరిమృదితము
నవ తమాలపత్రవాళంబు । పవనపోత
మెపుడు మెల్లనఁ గదలించి । యెగురఁజేయు. 93

మేఘముల రాకపోకలం జెప్పుచున్నాఁడు.

గీ. వారిధరములు విపరీత । పథముఁ ద్రొక్కి
గుహలఁ బాపెడు నిర్ఝర । కోటి జలము
కొంచెమే గ్రోలి తద్వాయు । వంచనమున
మరల నాకాశమున కేఁగి । తిరుగుచుండు. 94

శ్వాపద బాహుళ్యముం జెప్పుచున్నాఁడు. యుగ్మము.

గీ. అతిబలాఢ్య గజోద్ధూత । పతితవృక్ష-
పాత మూర్ఛిత పునరుత్థి । తాతివేల
రుష్టసింహాళి కుపిత శా । ర్దూల ఘోర
నాద విత్రాసితాన్యోన్య । నద్ధ విబుధ
కిన్నరస్త్రీసమాజమే । గిరివరాన. 95

గీ. తుంగతట నిర్ఝరధ్వాన । త్థూత్సాలకృష్ణ
గండశిలలను సేవించు । గాఢప్రీతి
భరితలగు కిన్నరస్త్రీల । భర్తృవిషయ
కానురాగంబు పుష్కల । మాచునుండు. 96

ఆంధ్ర సేతుబంధ మహాకావ్యమునందు నవమాశ్వాసము
ముగిసెను.



# ఆంధ్ర సేతుబంధ కావ్యము.



## దశమాశ్వాసము.

---

కపులు సువేలాద్రి నెక్కుట.

గీ. పుత్రమిత్రకళత్ర స-మృద్ధియుతుఁడు
పంక్తికంఠుఁడు బవరానఁ - బడకమున్నె
పూర్వపరిచితగిరులందు - బోలె నఘుడు
స్వేచ్ఛ వానరబలము సు-వేలశైల
మందు విహరింపఁదొడఁగె నా-హ్లాదమునను. 1

సువేలోపమర్దముం జెప్పుచున్నాఁడు.

గీ. ఇనశతాంగహయావళి - యెరుగ నివియు
గంధవహుఁడైన నెప్పుఁడు - గాన నివియు
పరిభృతంబులు గీర్వాణ-వరులచేత
నిట్టి యీకొండపై భూము - లిప్పుడెక్కి
కపులు మర్దించి విడిచిరి - కసిమసంగి. 2

కొండనుండి లంకం జూచుచున్నారు.

గీ. వైరిపురమని కోపంబు - వసుమతీజ
యిచట నివసించునని హర్ష-వృద్ధియాత్మ
నుభయరస మిశ్రితంబైన - విభునిదృష్టి
లంకపై వ్యాప్తమయ్యె ని-శ్శంకముగను. 3

రావణక్షోభముం జెప్పుచున్నాఁడు.

గీ. రావణుం డంత రఘునాథు రాక దెలిసి
గళిత ధైర్యత వానరాక్రాంత శిఖర
మగు సువేలాద్రితోఁ గంపమందె జాత
కోప సంరక్త లోచనకోటియయ్యె. 4

దివసావసానముం జెప్పుచున్నాఁడు.

గీ. సవిధవర్తి మహాశత్రుసైన్యఘోష
కలుషితుం డగు దశకంఠు ఖరతరాక్షి
వింశతికి నెదుట నిలువంగ వెఱచి వాని
భృత్యతతివోలె నేగెను భీతి నహము. 5

సూర్యకిరణములు పచ్చబడుట.

గీ. త్రిదశవేదండ మబ్జినీతేజమువలె
దివసకాంతిని దనతోడఁ దీసికొనుచు
జనెడు కమలాప్తు హరితాశ్వ సదృశమైన
రశ్మినికరంబు వనజాతరజముచేత
గప్పఁబడినట్లు మందమై గళితమయ్యె. 6

చెట్లనీడలు పొడవుగా నగుట.

గీ. క్షీయమాణ ప్రసారితాక్షీణ సూర్య
కాంతి దీర్ఘంబులౌ తరూత్కర విశాల
ఛాయ సత్తతి నెవ్వఁడో సాఁగదీసి
నట్లు పొడవయ్యె నా దినాంతమునఁ జూడ. 7

సూర్యమండలముంగూర్చి చెప్పుచున్నాఁడు.

గీ. అపుడు సిందూర రంజిత ద్విపవరోరు
కుంభసదృశంబు విద్రుమకుల నిభంబు

మందరాద్రి బృహద్ధాతుబిందు రక్త
వృత్త వాసుకిమండల విధముఁ దాల్చి
యొప్పె నస్తాద్రి రవిబింబ మొప్పుదఱిఁగి. 8

దివసావశేషముం జెప్పుచున్నాఁడు.

గీ. పొందె సంకోచమును దిశల్ పొలుపువీడి
నష్టతేజంబు జగమెల్ల నల్లనయ్యె
నష్టకళయయ్యె దివలక్ష్మి నభమునందు
కాలకంఠగళద్యుతి హేలసేయు
తిమిర మెల్లెడఁ బర్వెను తేజ మడఁచి. 9

సూర్యుఁడు క్రిందకు దిగిపోవుట.

గీ. చరమశైల నితంబానఁ బరిణతంబు
చాలితాతపపుంజ రజంబునైన
సురగజేంద్రము కైవడి సొంపుతగ్గి
ఖండితంబైన ధాతుశృంగంబు వగిది
దివసనాథునిబింబంబు తేజరిల్లె. 10

పద్మములు ముకుళించుట.

సీ. గళిత తీవ్రాతపక్లాంతి లులితరుచులు
మధురసాస్వాదభృతమత్తమధుకరాళి
చలితపక్షద్వయోత్ప్రేంఖదలఘుమధుర
మధురసంబులు పద్మనిర్మలదళంబు
లపుడు ముకుళించె కొలఁకులయందుఁ జూడ. 11

రవిరావణులకు సమావస్థం జెప్పుచున్నాఁడు.

గీ. అస్తమింపంగఁ గోరు సహస్రకరుండు
సముపసీద ద్వినాశుఁ [illegible]స్రవవిభుండు

నైన రవిరావణులు వారికరాంఘ్రిదళిత
భూరజోభర సంఛన్న మూర్తులగుచు
తుల్యదశనొందియున్నట్లు తోఁచి రపుడు. 12

సూర్యాస్తమయవర్ణనము.

గీ. పరమసాగరజలమగ్న తరణిబింబ
మగ్రభూధర సక్తాతపావశేష
ముజ్ఝితావనిమండల మూర్ధ్వగామి
యగుచు దివసంబు క్లాంతిచే నంతరించె. 13

సూర్యకిరణము లూర్ధ్వముగాఁ బ్రసరించుట.

గీ. వనగజాహత పాతితావనిరుహంబు
స్వీయమూలంబులను పైకి వెల్లడించి
వడినచందాన దినముచేఁ బాటునొంది
యస్తగిరిమీద గుంకెడు నబ్జమిత్రు
కిరణసముదాయ మూర్ధ్వదిక్కీర్ణమయ్యె. 14

సంధ్యాగమనముం జెప్పుచున్నాఁడు.

గీ. పంక్తికంఠుని ఖండిత ప్రథమకంఠ
సంచయం బాత్మవిస్ఫురత్ క్షతజపంక
మందుఁ గూలినకైవడి నంబుజాప్తు
బింబ మతిలోహితంబైన విపుల సాంధ్య
రాగమున డిందెఁ గోల్పోయి రాగగరిమ. 15

కమలములు ముకుళించుట.

గీ. భ్రమరభారావనతములు పరిణతంబు
లైన కింజల్కములనున్న యధికరజము
చేత గురువులు ప్రోజ్ఝిత శ్రీకములును

రవికిరణవిరహితంబులు • రమ్య పద్మ
దళములత్తఱి ముకుళించెఁ • దరణిఁ బాసి. 16

పడమటను సూర్యకాంతి మెండుగానుండుట.

గీ. పశ్చిమాశావికీర్ణంబు • బహుళదీర్ఘ
కిరణవిషమీకృత స్రీభాశోభరము కాల
వదనగహ్వర సంలగ్న • వాసరమును
లాగి విడిపించుమార్గముశోలాగు దోఁచె. 17

సంధ్యారాగవర్ణనము.

సీ. స్ఖలితబింబంబుగల రవి • కడుజవమున
దాఁటి భూమిని పశ్చిమశోధరను గూల
నినునితో మీఁది కెగసిన • యెంపచేత
నెత్తురై యొప్పె మేఘంబు • లెల్లదెసల. 18

సంధ్యారాగపౌఢిని జెప్పుచున్నాఁడు.

గీ. హేమభూధరతట సముత్సృష్టహేమ
కర్దమాతామ్రమాదిత్య • ఘనశతాంగ
వేగపతితోద్ధితధ్వజశోవీధ్రిసటము
చందమున నస్తశిఖరాన • సాంధ్యరాగ
మొప్పెఁ జూపఱకనులకు • నొప్పిదముగ. 19

కుముదవికాసముం జెప్పుచున్నాఁడు.

గీ. ధవళవర్ణంబు రక్తంబు • దంతిరుధిర
సిక్తహర్యక్షకేసరశ్రేయుతంబు
చటుల మారుతపోత సంచాలితంబు
సాంధ్యరాగోపరక్తకింజల్కమైన
కుముదమప్పుడు వికసించె • కొలకులందు. 20

సాయంకాలపు చెట్లనీడలు.

గీ. అల్పశేషిత సాంధ్యరాగారుణంబు
నల్పదీర్ఘంబు ధూసరమైన దిశలు
నూతనాబద్ధ తిమిర సంశ్రితజగము
నై వెలింగెను దివసాంత మధికముగను. 21

సంధ్యాకాలము శాంతించుట.

గీ. సాంధ్యసమయాతసత్యక్త సర్వదిశము
జ్వలిత శాంతానలస్థాన సన్నిభంబు
దూరనష్ట ప్రభాకర చారుబింబ
మంబరం బప్డు ప్రళయంబు ననుకరించె. 22

దీపకాంతిం జెప్పుచున్నాఁడు.

గీ. సాంధ్యరాగావృతంబులు సామిరూఢ
తిమిర విరచిత పరభాగ దీప్రరుచులు
శేషదివకాంతి క్రమముగా క్షీణదశను
బొంద గృహముల దీపముల్ పొలుపుమిఱె. 23

చక్రవాక వియోగము.

గీ. నిత్యమైనట్టి యనురాగ నిగళమునను
బద్ధమైనది నది కిఱుకెప్రక్కలందు
నుండి యన్యోన్యదృష్టి సంయోగ జనిత
రతిసుఖాప్యాయితము కంఠరావమాత్ర
శ్రవణధారిత జీవిత సత్త్వమైన
జక్కవలజోడు విడిపోయె నెక్కడు వగ. 24

చీఁకటి క్రమ్ముట.

గీ. క్రతుభుగీశద్విపశ్రేష్ఠ । కాయలగ్న
కర్దమాతినిఘర్షణ । ఘనత నొంది
హసితతాపింఛ తరుషండ । హారికాంతి
గాఢ తిమిరంబు జగమెల్లఁ । గ్రమ్ముకొనియె. 25

చీఁకటి వ్యాపించుట.

గీ. ఎల్లెడల నేకరీతిగా । నిరవుకొన్న
యిరులు దగ్గర గప్పట్టి । విరళముగను
దవ్వులకు నేఁగ దట్టమై । నివ్వటిల్లె
ఘనతవహియించె నతిదూరకమునకుఁ జూడ. 26

చీఁకటిలో చెట్లు కాన్పింపకుండుట.

గీ. దీర్ఘతరుషండ శిఖరాగ్ర । తిమిరచయము
తిమిరసందోహ సంక్రాంత । విమల కిసల
వితతి కిసలయ సంస్థిత । వీధ్రకుసుమ
గణము పుష్పౌఘమందు సౌ । గంధ్యభరము
దాన జ్ఞాతంబులయ్యెను । దరువులెల్ల. 27

అంతటను చీఁకటి వ్యాపించుట.

గీ. ఏకమయ్యెను దిక్చక్ర । మెల్ల పునడు
వమ్మ కన్నయ్యె దరినున్న । వస్తువందు
సాధనాంతర వేద్యమి । సర్వపృథివి
కమలజాండంబు తానయ్యె । క్రమ్మె తమము. 28

గాఢాంధకారము వర్ణించుచున్నాఁడు.

గీ. కత్తులనుగోయవచ్చు నీ । గాఢతమము
త్రవ్వఁదగినట్టి సాంద్రతఁ । దాల్చె నిద్ది

హస్తములఁ బట్టు యోగ్యత - నబ్బియుండె
చంద్రికరభేద్య సంహతి - చాలియుండె. 29

చీఁకటిగొప్పతనముం జెప్పుచున్నాఁడు.

గీ. వసుమతిని గప్పి తద్గత - వస్తుసమితి
మోయుచున్నట్లు వెనుకను - మునుకనివలె
ద్రోయుచున్నట్లు ముందర - చేయునిచ్చి
యెత్తుచున్నట్లు ప్రక్కల - హెచ్చు పెరిగి
ప్రేరణము సేయునాఁడ్కి - నిరావరణముగ
తమము జగమెల్లఁ దానయై - దనరెనపుడు. 30

చంద్రకిరణములు పైకి వ్యాపించుట.

గీ. నీలపాషాణ నిపతిత - నీరబిందు
నికరధవళంబు నీపదు - నిర్మలదాన
యుదయశైలాంతరిత తనూ - ద్ద్యోతమైన
జ్యోత్స్న పొడసూపె నప్పుడెఁ జూడ్కు లలర. 31

తూర్పుదిక్కు ప్రకాశించుటం జెప్పుచున్నాఁడు.

గీ. చంద్రకిరణ వినాశిత - స్వల్పతిమిర
నిర్వలిత ధూమ హుతవహ - నిచయ దహ్య
మాన వారాశి లయకాల - మధ్యమంబుఁ
బోలెఁ బ్రాగ్దిశ పూనె - నపూర్వశోభ. 32

చంద్రకళ మీఁదకు వచ్చుట.

గీ. అంత నచ్ఛాచ్ఛకాంతి ని - హత తమస్సు
నుదయభూధరశృంగ సం - యుక్తశోభ
మైన ప్రాగ్దిశముగ్ధ మృ - గాంకరేఖఁ
దాల్చె పాండురవర్ణంబు - తత్క్షణమున. 33

చంద్రబింబోదయమును జెప్పుచున్నాఁడు.

గీ. నవ సరోరుహగర్భసచ్ఛవి వినూత్న
కేసరావళి సుకుమార ♦ భాసమాన
కిరణజాలంబు శశిబింబ ♦ మరుణకాంత
పార్శ్వవర్తితనుంబును ♦ బొనఁగలిగె. 34

చంద్రమండలపౌర్ణిమం జెప్పుచున్నాఁడు.

గీ. తిమిరసంఘంబుఁ బడఁగొట్టి ♦ తెలుపుగలిగి
యెదురుగానున్న దేవేంద్రు ♦ మదగజంబు
దంతమును బోలి వర్తులత్వ స్వహించి
పూర్ణతారేశబింబంబు ♦ పూర్వశైల
శిఖరమునఁ దోఁచె నప్పటి ♦ నిస్తులముగ. 35

ఆకాశము నల్లగా నగుట.

గీ. అపుడు శశికరసంఘాత ♦ హత తమిస్ర
సంగ కాలుష్య విరహిత ♦ సకలతార
మంబరంబు సుమహాఘ సత్మహా స్త్రుతాతి
నీల పాషాణతిలకసన్నిభత నొందె. 36

చెట్లనీడల వర్ణించుచున్నాఁడు.

గీ. దరవిమిశ్రిత తారేశ ♦ తరళరుచులు
నర విపాటిత తిమిరపాండుర సుశోభ
లీషదాలోక్యమానావనీరుహంబు
లల్ప సంబద్ధవర్తులత్వమైన నీడ
లగుచుఁ గన్పట్టె వృక్షంబు లాక్షణాన. 37

ముదిరిన చంద్రమండలము వర్ణించుచున్నాఁడు.

గీ. గగనమండల సంచార ఘటితమగుచు
స్థైర్యవిలసిత కిరణౌఘ సాంద్రతమము
విగతముగ్ధస్వభావంబు వృద్ధధవళ
మిందుబింబంబు కాంతి చేమందమయ్యె. 38

ముదిరిన వెన్నెల వర్ణించుచున్నాఁడు.

గీ. కిరణజాల ఖనిత్రాళి క్రిందమీద
ద్రవ్వి తమమెల్ల శశి మహీతలముకంత
జక్కఁజేయఁగ దిక్కులు పిక్కటిల్లె
దొంటివలె నొప్పె నేలలు తోరముగను. 39

మరల నీడలనే వర్ణించుచున్నాఁడు.

సీ. శశికరంబులు పాదపచ్ఛాయ నపుడు
రూపుమాపంగ జాలక యేపుదొలఁగి
శత్రువునుబట్టి సమయింపశక్తి లేని
నృపతిరిపుపట్టణంబును నిజ భటాళి
తోడ ముట్టడివేసిన తోయమునను
నావరించెను నలుప్రక్కలందు దాని. 40

తెల్లకలువలు వికసించుట.

గీ. కుముదషండ వికాసంబుఁ గూర్ప శశియె
పటువుకాడు తదీయాగ్రపత్రపుటము
లెల్ల విడునట్లు మెల్లనఁ జొచ్చి వాని
యందు మధువునుగ్రోలు నిందిరములు
తొలి వికాసంబునకు హేతువులుగ గొనుడు. 41

అన్నిచోట్లను చీఁకటి పూర్తిగాఁ బోవుటం జెప్పుచున్నాఁడు.

గీ. ఒక్కపెట్టున తమమెల్ల నురువులైన
తనకరంబులఁ దుడిచెనో వనజవైరి
దెసలకొసలకు విసరెనో తీవ్రరుషను
లేక పానంబుఁజేసెనో వీఁక నతఁడు
తెలియదెద్దియు చీఁకటి విలయమంద. 42

ఆకాశ ముజ్జ్వలమై ప్రకాశించుట.

గీ. కరయుగగ్రాహ్యమైయున్న కరణిదోఁప
సాంద్రకర్దమసంహతి సన్నిభంబు
మలినితాశేష దిగ్విదిఙ్మండలమ్ము
తమము చంద్రోదయమ్మున దళితమయ్యె
ధవళవర్ణాస్పదంబౌచు దివము వెలిఁగె. 43

వనములంగూర్చి చెప్పుచున్నాఁడు.

గీ. దిత నిరంతర తిమిర దుర్దిన వితతులు
విటప సందోహ వినివిష్ట విధుకరములు
స్తోకసుఖదాయికాంతు లస్తోక ముగ్ధ
పల్లవంబులుగల్గిన వనములపుడు
ప్రకటతను జెందె వెన్నెలరాత్రులందు. 44

కుముదసామ్రాజ్యముం జెప్పుచున్నాఁడు.

గీ. విలులితాశేష తరువీథ్రి వివిధపుష్ప
సముదయంబులు పరిభుక్త సకల దిగిభ
దాన నిస్యందములు ఘృష్టతరళ పంక
జాతవనములు బంభరచయము లపుడు
దూఱె కుముదోదరంబులఁ దోప మెసఁగ. 45

చంద్రుఁడాకాశముమీదకు వచ్చుట.

గీ. లంబమానాతిదీర్ఘ జాలక నివిష్ట
శీతరశ్మికరావళి శశిమణీంద్ర
రచిత కుట్టిమ పతితమై రుచివహించె
హ్రదజలాదానసక్తి చే మదగజంబు
చాచియున్నట్టి తుండంబు చందమునను. 46

చంద్రుఁ డూర్ధ్వముగాఁ బోవుట.

గీ. ద్విరదసంతానసీలంబు శ్వేతచంద్ర
సింహ వినిపాత తిమిరాఖ్య సింధురంబు
సంకలిస్త పదావళిశభంగి దీర్ఘ
భవనముల నీడలెంతయుఁ బ్రబలెనపుడు. 47

చంద్రుఁ డాకాశమధ్యమందుండుట.

గీ. తిర్యగూర్ధ్వగతిప్రాప్త దివమునంటి
వివరములనుండు చీఁకటి వేగఁబాపి
భవనజాలకరంధ్ర లబ్ధప్రవేశ
నిర్గమములైన కరముల నిండియున్న
చంద్రబింబంబు పదలునఁ జాల వెలిఁగె. 48

మరల వెన్నెల వర్ణించుచున్నాఁడు.

గీ. అపుడు రాశీకృత శ్వేత విపులచూర్ణ
సదృశపీతాంబువాహాళి సాంద్రశోభ
వికటజాలకరంధ్రప్రవిష్ట రూప
దీపనికరచ్ఛవిశ్లిష్ట ధీధితియయి
జ్యోత్స్న వెలిఁగె నభంబునఁ జూడ్కులలర. 49

తెల్లగలువల శోభం జెప్పుచున్నాఁడు.

గీ. బహుళశీతాంశురశ్మి సంభరితమగుచు
కాలపరిణామ విరచితోన్మీలనంబు
గళిత చంద్రాతపభ్రష్ట కాంతిపుంజ
మతిభరానమ్రదళజాత మపుడు కుముద
వితతి వడఁకెను హిమబిందువిద్ధమగుచు. 50

వృక్షముల యవస్థం జెప్పుచున్నాఁడు.

గీ. పవనకంపిత శిఖరముల్ వళిత విటప
బహుళ సచ్ఛాయ లంబుజవైరి కిరణ
వేష్టితంబులు చంద్రికా విమలసలిల
మగ్నములు భూరుహంబులు ద్విగ్నగతిని
నీదుచున్నట్లు గన్పట్టె బ్రోదిగలిగి. 51

తిరుగ వెన్నెలవర్ణనము.

గీ. దీపజాలమయూఖ సందీప్రకాంతి
సలిల సంసిక్త చందన సారవర్ణ
భూరి నిమ్ననిగూఢాంధకారవైరి
జగమునిండెను చంద్రికాజాల మపుడు. 52

నక్షత్రములు విరళములైనవి.

గీ. గళిత నిజకాంతిజాలంబు గతవయస్క
చంద్రికాపూర తరదంబుజాతవైరి
విరళ సందృశ్యమానోడువితతియపుడు
గగనమండలమయ్యెను విగతశోభ. 53

సర్వతముల యవస్థం జెప్పుచున్నాఁడు.

గీ. దృష్టభూతలబంధనముల్ ౯ దీర్ఘశేఖర
చుంబితాంబుద సంతతుల్ ౯ శూన్యరుచులు
గగనమధ్యస్థశశిమయూఖాళి పీన
కాంతులై భూమిధరములు ౯ కానుపించె. 54

జ్యోత్స్నసన్నికర్షముం జెప్పుచున్నాఁడు.

గీ. నిబిడభూరుహమండల ౯ నిర్మితాతి
సాంద్రతిమిరంబుగలచోట్ల ౯ సంశయించి
గర్తమనుభ్రాంతి వెన్నెల ౯ గలుగునట్టి
వివరములలోనఁ జొరఁబాఱు ౯ భీతివీడి. 55

రాక్షసస్త్రీలసంభోగమును వర్ణించుచున్నాఁడు.

గీ. చిత్తసంభవ సంతానశిఖలచేత
వేఁగి నిద్రావిహీనలై ౯ విధివశమున
విరహితంబులు నదికూలవిహరణములు
చక్రవాకంబు లత్తఱిఁ ౯ జాలఁ గుంద. 56

గీ. తుమ్మెదలు కుముదకుటీని ౯ దుఃఖమంద
మన్మథాశుగ ఖండిత ౯ మానసమున
దయితసంశ్లేషకాంక్షచే ౯ త్వరితలైన
మానినులు సంతసిల్లిరా ౯ మాపునందు. 57

ఆవిషయమునే మరలఁ జెప్పుచున్నాఁడు.

గీ. లబ్ధనష్టాతిసౌఖ్యంబు ౯ లాఘవమున
జాత సంవేగవశ సముజ్జృంతసుఖము
ఛిన్నసంఘట్యమాన సంకుచిత రసంబు

నైన సంభోగమున జవరాండ్రు ప్రియుల
చుంబనంబుల సుఖమును జూడలేదు. 58

తిరిగి దానినే చెప్పుచున్నాఁడు.

గీ. వక్షఁ కుచుండును నిట్టూర్పు విడుచునెపుడు
క్లాంతినొందును నెజ్జపైఁ గాయముంచు
భయమునొందెనో మన్మథపారవశ్య
మునను నిటుచేయఁదొడఁగెను ముగుదపిండు. 59

రాక్షసస్త్రీల పీఠికితనముం జెప్పుచున్నాఁడు.

గీ. దిగ్గజానీక కఠిన సుదీర్ఘదంత
ముసలతాడన క్షతి మూఢభర్తృ
వక్షముఁజూచి రాక్షసవనితలెల్ల
ముందు గాబోవు కదనంబు డెందమందు
దలఁచి భయకంపమొందిరి తల్లడించ. 60

తిరిగి వారిభయముం జెప్పుచున్నాఁడు.

గీ. సురతసౌఖ్యార్ధ ముకుళిత మరమదాళి
దర సమాక్రాంత మాలతీ సరస ముకుళ
నిభము సంలక్ష్యతారకా నిస్తులంబు
దానవీనేత్రయుగళంబు దరియు నాజిఁ
దెలియఁజేసెను మనము లుద్వేగమంద. 61

ఈ రాక్షసస్త్రీలభయముం బోగొట్టు శృంగారోత్కర్షముం
జెప్పుచున్నాఁడు.

గీ. అంత చంద్రోదయోత్పన్న హర్ష సమయ
మధిక మదరాగ పారవశ్యాభిసరణ
జనితసౌఖ్యంబు కామసంకథాదితాగ్ర్య

మానముత్కటరాగోద్ధ । నూనబాణ
కేళిసంజాత నిర్వాణ । మిలితాక్ష
మంగనాహ్లాదజనకమై । యొప్పె వేళ. 62

గీ. కోపసంజాత చింత నా । కులత నొంది
ప్రియులచాటూక్తిశతములఁ । బ్రీతి లేక
చుంబనంబుల నొల్లక । సుదతులెల్ల
మదభరాక్రాంతహృదయలై । మందగిలిరి. 63

క్రొత్తపెండ్లికూతుంప్రకోపముం జెప్పుచున్నాఁడు.

గీ. కోపవినివర్తితాధర । కుటిలగతులు
ప్రియజనాహార్యచుంబనా । ప్రీతహృదయ
లధికమన్యుభరాక్రాంతలైన ముగ్ధ
భామలాడు సరాజ్యుక్ష । భాషణములు
ప్రియులమనముల కెంతయుఁ । బ్రీతిఁ జేసె. 64

అభిసారికల దుఃఖముం జెప్పుచున్నాఁడు.

గీ. చంద్రదర్శన వినిహతో । త్సాహలగుచు
నాక్షణంబున నభిసారి । కాబ్జముఖులు
ప్రియుల కానంద మొసగంగ । ప్రేమమీఱ
మేనుకైసేత మానిరి । మానవశత
దూతికల బంపనొల్ల ర । ప్రీతిఁ జెంది
మూఢమానసలైరి స । మ్మోద మెడలి. 65

శృంగారసామ్రాజ్యముం జెప్పుచున్నాఁడు.

గీ. అవనతేక్ష్వాకుకులనాథ । మంబరమణి
వంశనాయక మారణా । బద్ధ దీక్ష.

పంక్తికింతంబు దానవీశవల్లవాధ
రీ నిగూఢాధరతాసక్తిఁ గమానితంబు
నైన రజనీముఖంబప్పుడఖిల యాతు
ధానులకు పూర్ణహర్షప్రదాయియయ్యె. 66

స్త్రీల యనురాగాతిశయముం జెప్పుచున్నాఁడు.

గీ. వల్లభసకాశమునుండి వచ్చినట్టి
దూతికలు చెప్పుమాట మిథ్యాతివాద
మైన దానినె నమ్మి యబ్జాక్షులెల్ల
సంతసమ్మును జేతురు సంతతంబు. 67

కవి యాస్త్రీల నేర్పుం జెప్పుచున్నాఁడు.

గీ. ప్రణయకలహంబులాదవిన క్షణములందు
శయనములయందు సమ్ముఖశయితులైన
ప్రియులు సెజ్జను విడనాడి వెలికిఁబొమ్ము
వలదు నీపొందు నాకని పరుషభాషి
తములఁ బల్కిన సైరించి తరుణులపుడు
నిలిచి కన్నులనించిరి నీరు వెతను. 68

స్త్రీల వైలక్షణ్యముం జెప్పుచున్నాఁడు.

గీ. ప్రియుఁడు దేశాంతరమునుండి ప్రీతితోడ
నింటి కేతేరఁ గడు వడి నింతులెల్ల
గూడి యొకచోట గుసగుసలాడి కొంద
ఱలకభారంబు సవరించిరందు కొంద
ఱర్ధగళితాంశుకంబుల నంద మొప్ప
బిగియఁగట్టిరి కంకణవితతి జారఁ
జక్కఁబెట్టిరి చెలులతో సాకుబెట్టి
సరసవచనంబు లాడిరి సంతసమున. 69

మానినీమానభంగముం జెప్పుచున్నాఁడు.

గీ. జీవితేశోక్త సాంత్వభాషసితవితాన
మహిమచే నొక్కక్షణమందు మానవతుల
మానసంబున తోషమనందముగను
జాతిమైనను గ్రిమ్మఱి సాజమైన
కోపమే హెచ్చె శాంతి సంకోచ మొందె. 70

నాయకుల యుత్కంఠం జెప్పుచున్నాఁడు.

గీ. ప్రియుఁడు రాఁ జూచి లేవంగ వేగవతులు
గాఢపరిరంభణోద్యోగ క్లాంతతనులు
అపరిపూర్ణప్రసాధితానునమ దేహ
లగు విలాసిను లుత్కంఠ మిగుల శయన
మెక్కఁదలఁచుట శోభిల్లె మిక్కటముగ. 71

నవోఢావూానముం జెప్పుచున్నాఁడు.

గీ. స్థిరసఖీదృష్టివారిత చేష్టితంబు
సప్రసాదిత చిత్తంబు నధికలజ్జ
దయితజనబద్ధకోపంబు నయవిదూర
మివ్వధూసార్థమని విభు లెన్నుకొనిరి. 72

ప్రౌఢస్త్రీలమదమును కామవికారమును జెప్పుచున్నాఁడు.

గీ. శైశవమునుండి తనతోడ సాహసించి
చెలులపోలిక వృద్ధిని జెందియుండి
యాత్మవల్లభు దరిఁజేర నంతరాయ
మైన లజ్జను దొలఁగించె నాత్మభవుఁడు. 73

దూతికలను శిక్షించుటం జెప్పుచున్నాడు.

గీ. విభుసమాగమసుఖము బ్రాపింపఁగోరి
యుల్ల్వవిన్యస్తతిలకంబు • నాత్మముఖము
రభసవృత్తిని జేటీకరంబునుండి
లాగి మెడద్రిప్పి దూతికా • లపితములను
వినుచు విభులకు జెప్పెడు • విధము లెల్ల
గఱపుచుందురు యువతులు • గారవమున. 74

ఈ స్త్రీల రసమత్తతం జెప్పుచున్నాడు.

గీ. చెలులముందర నొక్కటి • ఛలముతోడ
దూతికలతోడ మఱియొక • రీతిమాట
ధైర్యమును వీడి యస్యంబు • దయితుని కడ
బల్కుదురు యువతిజనములు • బహువిధముల. 75

నవోఢా సంగమము.

గీ. అధికయత్నంబు సేయంగ • నాభిముఖ్య
మొందె నంకస్థలంబె క్కె • నుచితభాష
ణముల ప్రసభంబుగాఁ జుంబనంబుఁ జేయ
నయ్యె పరివృత్తముఖపద్మ • మాక్షణమున
నైన నూత్నవధూచయ • మాత్మవిభుల
కనుపమానంద దాయిగా • నలరె నిశల. 76

మానినీభంగాభివ్యక్తిం జెప్పుచున్నాడు.

గీ. దయితచాటూక్తిరచనల • దళితమాన
మగు విలాసిని సార్ధంబు • హర్షమొంది
ప్రియులమేనులఁ బొఁగమిఁక • స్పృథులరోమ

హర్షణముఁజూచి యెదుట నుపాంతభూమిఁ
గూర్మిఁ గూర్చుండి వారిని గుస్తరించె. 77

విస్రబ్ధనవోఢాతారతమ్యముం జెప్పుచున్నాఁడు.

గీ. మొదటికలయిక సిగ్గుచే మోమువంచి
యధర మీయదు వల్లభు నాదరించి
తా నతని మోవిగ్రోలదు తద్దవడఁకు
ముద్దుగొనఁగోర నెత్తదు మోముదమ్మి
నైనఁ గరగించె పతి సార్థకమానసముల
ముగ్ధనూత్న వధూతతి మోద మెసఁగ. 78

సఖియందు దూతీపరిహాసముం జెప్పుచున్నాఁడు.

గీ. ఒకనిగూడిన జలజాక్షి నొక్కదూతి
మేలమాడంగ నిట్టనె హేలతోడఁ
బూను ధైర్యంబు నీయెడఁ బూవుఁబోఁడి
రాదు వాఁడిచ్చటికి నమ్ము రాత్రిముఖము
గడచినప్పుడు నైతము కంబుకంఠి. 79

మదిరాపానముం జెప్పుచున్నాఁడు.

గీ. ప్రియుల సంయోగ విశ్లేష వేళలందు
విలసస్త్రీవ్రజంబున కలఘుబుద్ధి
త్యక్తలజ్జాభరాన్వితోదార వాక్కు
లందు చాతురి గలిగించి యలయికలను
మాన్చు వారుణి హర్షంబు మదికి నిచ్చు. 80

ఉద్దీపనవిభావములం జెప్పుచున్నాఁడు.

గీ. చంద్రికాంతిని హెచ్చెనో చాలమదము
మదబలంబునఁ బెరిగెనో మాపుతేదు

ఈద్వయము చేత మన్మథుం డె దెసరి నేమొ
శశిమదంబుల మదనుండు త్రాసి హాయయ్యె
నేమొ చెప్పంగ దరమె యీ భూమిలోన. 81

ఆశ్వాసాంతము.

గీ. వెన్నెలల చేత మారుని విక్రమమున
విధు మదంబున మానినీ మణులకపుడు
ఒహాురసంబైన యనురాగ భరముప్రియుల
యందు గన్పట్టె నతిభూమి నొందినట్లు. 82

ఆంధ్ర సేతుబంధ మహాకావ్యము నందు
దశమాశ్వాసము ముగిసెను.



# ఆంధ్ర సేతుబంధ కావ్యము.

## ఏకాదశాశ్వాసము.

సీతాదర్శనమువలన నుద్రేకించిన కామముగల రావణుని విరహావస్థను జెప్పుచున్నాఁడు.

గీ. ఇట్లు చంద్రుండు దూరాభి♦వృద్ధి నొంద
నిశయు ఖండిత యామత ♦ నిష్ఠనొంద
నపగతోద్ధత మదమాన♦లగుచు సతులు
పగటివిరహంబు భావించి ♦ భయమునొంద. 1

గీ. చింతచే ధైర్యమంతయుఁ ♦ జెదరిపోవ
రాక్షసేంద్రుండు కర్తవ్య♦రహితుఁడగుచుఁ
బదిముఖంబుల బదిదిక్కు ♦ లదరఁజూచి
నిడుద వెచ్చనియూర్పుల ♦ నిగుడఁజేసె. 2

రావణుని యున్మాదావస్థం జెప్పుచున్నాఁడు.

గీ. వంతఁజెందును నిట్టూర్పు♦ వడలఁజేయు
దుఃఖమొందును బాహువుల్ ♦ ముడుచుచుండు
నదిశిరంబులు గదలించు♦ పలుమరు నగు
నవనిజాతాపహరణ మ♦నర్థమనును
దశముఖుంపష్ట విరహాగ్ని ♦ తప్తుఁడగుచు. 3

స్మృతిరూపావస్థం జెప్పుచున్నాఁడు.

గీ. ప్రసభహ్రియమాణ జానకీ♦ బాహుయుగళ
పరిసమాశ్లిష్ట మాత్మీయ ♦ బాహుమధ్య

మెన్నుకొనుచుండు సంతస • మెదను బొదల
ననధిగత జానకీవక్త్రి • వనజమధుర
పల్లవాధరపీయూష•పాన రహిత
మైన నిజముఖనివహంబు • నాత్మ( దిట్టు. 4

చింతాసంగమము జెప్పుచున్నా(డు.

గీ. భంగమొందిన ధైర్యంబు • బహువిధముల
మానసంబున దృఢపర్చి • మగువరూపు
దల(చి పంచాంబకాస్త్ర సం•తానగరిమ
బొరలె రాక్షసనాథుండు • వెలవుదో(వ. 5

విషాదరూప భావోదయము జెప్పుచున్నా(డు.

గీ. విషమవరివర్తితాంగుళి • వివరపిహిత
మంసశిఖరవ్రవేశిత • మతని:ముఖము
వర్ధితాయాసగళిత బా•ష్పాంబుధార
క్లిన్నమయ్యెను లోనున్న • ఖేద మెడల. 6

విషయనివృత్తిం జెప్పుచున్నా(డు.

గీ. కర్ణయుగ పేయమైయున్న • కటుతగల్గి
దూన దంతవ్రణాధర•దుగిఖద మయి
ప్రేక్షమందోదరీముఖ • ప్రేయసులును
బలుకు జయశబ్దములకు•మహావజ్ఞతోడ
వినును లేశము మనమున • వేడ్క లేక. 7

సీ. జానకీగాత్రసంశ్లేష•సాధనముల
వెద(కుచుండెడి మానసా•వేగమునను
శయన మొల్లడు వే(కువ•జాము గోరు

నింటనుండఁడు విహరించు ♦ నొంటిగాను
ఏవగించును దివసంబు ♦ నెప్పుడతఁడు. 8

గోత్రస్ఖలనములం జెప్పుచున్నాఁడు.

గీ. ప్రేయసులమోఁ్రల దానంగ ♦ వివిధగతుల
యత్న మొనరించినను వాని ♦ కలవిగాక
హృదయసంస్థిత జానకీ♦ముదిత గూర్చి
పదిముఖంబుల సమముగా ♦ బలుకఁజొచ్చె. 9

రాగాధిక్యముం జెప్పుచున్నాఁడు.

గీ. శంబరాహిత శాంబరీ♦శక్తి నిఘ్న
మానసంబున దానవ♦మహితుఁ డొండు
దలఁప సీతయె పొడకట్టు ♦ దన్నుకుంప
నన్యయువతుల బిలిచెడు ♦ నా క్షణమున
నవనిజానామమే వచ్చు ♦ నతనినోట. 10

వ్యాధ్యవస్థం జెప్పుచున్నాఁడు.

గీ. వాసగృహకోణపుంజిత ♦ ప్రసవరాశి
ఆయతాత్యుష్ణనిశ్వాస♦హత సుగంధ్ర
నందనోద్యాన భూరుహ♦బృంద కిసల
రచితశయ్యయు దశముఖు♦ప్రచిత తాప
గరిమ దెలుపుచునుండెను ♦ గరితలకును. 11

దేహవిక్షేపాదులచే నా ఘువస్థనే చెప్పుచున్నాఁడు.

గీ. సంక్రీతకంఠుండు నిజదేహ♦పరిమితిగల
పల్లవాద వినిర్మిత ♦ ప్రకట భూమి
శయనమందుండి కరములు ♦ చరణములును

మాటిమాటికి గదలించి మగుడ పార్శ్వ
శాయిరైపొంపు వెతలను ♦ సంతతంబు. 12

దాక్షిణ్యముం జెప్పుచున్నాఁడు.

సీ. మహిసుతాశ్లేషవాంఛాతి ♦ మాత్రదత్త
నిబిడితోత్కంఠనిండిన ♦ నెమ్మనమున
స్వప్రియానసవీక్షణ ♦ క్షణ విలక్ష
మయ్యె దశముఖు దశముఖి ♦ యాక్షణమున. 13

రావణుని సంతాపోత్కర్షముం జెప్పుచున్నాఁడు.

గీ. ఎంతలోఁ బంక్తిముఖుఁడాత్మ ♦ కాంతలఁగని
యొక్కముఖమున నవ్వుచు ♦ నూఱడించు
నంతలో నన్యముఖము నితాంత తీవ్ర
తాపభరమున తాంతమై ♦ తల్లడిల్లు. 14

రావణుని సీతామగ్నచిత్తతను జెప్పుచున్నాఁడు.

గీ. అన్యసంక్రాంతహృదయుఁడ ♦ య్యసురరాజు
నిపుణ హసితానుబద్ధంబు ♦ రిపుకళత్ర
సంగమాప్తి విసంవాద ♦ చాటువచన
ఫణితి నిజకాంతలెల్లరు ♦ బలుక వినఁడు. 15

సీతానరత్వముం జెప్పుచున్నాఁడు.

గీ. బహుళమాత్సర్యరోష సంవర్ధితములు
మానినీకూరనిందల ♦ మదిఁదలంచి
సాప్త వైలక్ష్యహసితవా ♦ క్పాటవమున
బుచ్చుచుండును కాలంబు ♦ ఱిచ్చవోయి. 16

మరల చింతాసంగమముం జెప్పుచున్నాఁడు.

గీ. రూఢబాష్పౌఘవేగ సం ♦ రుద్ధకంఠ
విషమవర్ణపదన్యాస ♦ వికలమైన

వితథరావణగోత్ర స్ఖ♦లితము లెప్పు
డంగనలు దెలియఁజాలరు ♦ వ్యక్తముగను. 17

రావణుఁడు తన మనోవికారమును దాఁచుకొనుటను
మరలఁ జెప్పుచున్నాఁడు.

గీ. ఎప్పుఁ డెవ్వరు వలుకక ♦ మిన్నకున్న
నడుగు నెవ్వర దేమని ♦ వ్యర్థముగను
కన్నదోయని నీర్నించి ♦ కాంతలెల్ల
కుపితలైపూని మానంబు ♦ కొలుకొలుఁగన
జేసె నాకారగుప్తి సం♦సిద్ధుఁడగుచు. 18

భ్రమోత్కర్షముం జెప్పుచున్నాఁడు.

గీ. రోషదష్టాధరద్వయ♦రూక్షదృష్టిఁ
జూచి మాత్సర్యసూచక ♦ సూక్తి వితతి
బల్కినను వానిమనములోఁ ♦ దలఁపకెపుడు
బాగటంచు వచించును ♦ పంక్తిముఖుఁడు. 19

వాని సంకల్పముం జెప్పుచున్నాఁడు.

గీ. అన్యసంక్రాంతహృదయత♦నాసనంబు
సావదేశంబుగా పీడి ♦ చను నవలకు
ప్రియలు మాత్సర్యమునఁజూపఁ ♦ బ్రేమదక్క
పరిహసించును తనుదానె ♦ పంక్తిముఖుఁడు. 20

విప్రలంభప్రకర్షముం జెప్పుచున్నాఁడు.

గీ. విరహసంతాపవేదనా ♦ వివశుఁడయ్యె
ననుచు మందోదరీముఖాం♦గనల కెల్ల
తెలియదనికాదు తెలిసియు ♦ దెల్లముగను
నవహసింపరు వారిక ♦ నసృతమగును

పరిహసించియు నిజపతి | పాటుజూచి
వగవరనుమాట యెంతయు | వట్టిమాట. 21

రావణునిచింతం జెప్పుచున్నాడు.

గీ. దశముఖోభయ పార్శ్వస్థ | దశకపోల
యుగళమం దుష్ణనిశ్వాస | విగమతప్త
హస్తవింశతిఁ గీలించి | యవనిదుహితృ
సంతత ధ్యానసంతాన | తంతుబద్ధ
హృదయుడై యుండు నన్యంబు | వదలిపెట్టి. 22

ఏడుపద్యములచే రావణుని చింతాప్రకారముం జెప్పుచున్నాడు.

గీ. రాత్రి రతిసౌఖ్య విఘ్న|కరంబు కీశ
బలమునంతయు నేనోర్వ | గలనుగాని
రతి సుఖాస్వాద విరహిత | మతిమనోజ
తాపతప్తంబు హృదయంబు | తల్లడించు. 23

యుద్ధకోటికనైన వికల్పముం జెప్పుచున్నాడు.

గీ. మద్భుజానీక వివర స|మ్మర్దితాతి
ఘోరనిస్వనముఖరిత | కువలయంబు
కపిబలంబునుబట్టి త|త్కాయరుధిర
మాంసమజ్జావసాదుల | మాఱులేక
భూతతతికేను బలిసేతు | భూరిశక్తి. 24

బలాత్కారసుఖముం జెప్పుచున్నాడు.

గీ. శశికరాహతి వికచలో|చన నిరస్త
బాష్పధారా పరిక్లిన్న | పల్లవోష్ఠి
కర గృహీతాతికమనీయ | కచవికీర్ణ
ముఖిని నేబట్టి రమియింతు | ముదముదీర. 25

రంభా శాపమువలన నిదియు ననుపపన్నమని చెప్పుచున్నాడు.

గీ. భర్తృవిరహాధి పీడిత స్వాంతయౌచు
నున్న వేళనె నాయెడ నున్న ప్రేమ
ఇప్పుడాసన్నమై యుండ నింతినన్ను
జూచునే విప్పి కన్నుల సూడుదొలఁగి
యితరవేళల నిందుని సేవగించు
పద్మలత భాస్కరుండుంత వానిగనునె 26

ప్రార్థించుటకు కూడ పొసగదు.

గీ. లోభపెట్టంగ వశమె త్రైలోక్యమిచ్చి
యనునయంబున గొన దస్మదాదికృతము
నాత్మవధకైన నయ్యింతి యాత్మనలరు
నెట్లు జానకి వశమౌనొ యెంచిచూడ. 27

దానినే మరల జెప్పుచున్నాడు.

గీ. విదిత నిజభర్తృ విస్మిత వీర్యవిభవ
నిరసితాశేష నిస్తులా పరభప్రౌఘు
లూన రాఘవశీర్షావ లోకనమున
గాని జానకి నన్నెట్లు కాంక్ష సేయు. 28

రామవధయే కర్తవ్యమని చెప్పుచున్నాడు.

గీ. త్యక్తలజ్జాభయుండు నైరాశ్యహతుడు
భగ్నజీవన సంత్రాణ పాటవుండు
బంధుహీనుండు సన్మాన వర్జితుండు
జనుడు మర్యాద గోల్పోయి చనునునీచ
మార్గమున కన్నమాట యీశమగువ కబ్బు. 29

సేవకులం బిల్చుచున్నాడు.

గీ. స్విన్నగాత్రుండు జృంభావి ళేషితాస్య
దలన పరివర్తిత ముఖుండు నగుచు నూర్ధ్వ
గాసు నిగిడించి వింశతి దృష్టులపుడు
పిలిచె దానవపతి నిజభృత్య సమితి. 30

ఆజ్ఞాపూర్వావస్థం జెప్పుచున్నాడు.

గీ. ఏకహృదయావధారిత మీప్సితార్థ
లాభగర్భిత వర్ణానళీ భృతంబు
దశముఖంబుల నొకమాఱు దశముఖుండు
చెప్ప శక్తుఁడుగాకుండెఁ జిత్రమిద్ది. 31

ఆనందమువల నిరూత్సుక్యముం జెప్పుచున్నాడు.

గీ. ఒక ముఖంబున నుడివిన యొక్కమాట
యన్యముఖమున స్వరభంగ మందిపలుకు
నగము జెప్ప మరొక్క యాస్యంబుతోడ
నంత మొందించు నామాట నన్యమునను. 32

మాటలాడునపుడు నిట్టూర్పువిడుచును.

గీ. సంప్రకాశిత శోకుండు సర్వవదన
కుహరసంచార శీలోగ్ర కుటిలధూమ
తానసంతాపితైక హృద్దశము ఖాఘ
స్ఖలిత వచనుండు పలికెద శాస్యుడిట్లు. 33

రావణుడు రాక్షసులతో మాట్లాడుట.

గీ. ఫాలచుంబిత భూతల పతితులగుచు
నాజ్ఞనిచ్చిన సమకాలమునంజె మాఱు

పలుకువారలు ముకుళిత * పాణియుగులు
నైన దనుజులగని విభుండనియె నిట్లు. 34

రావణ వచనస్వరూపముం జెప్పుచున్నాడు.

గీ. ప్రబల రిపుదర్శనాగ్రహ * వలిత నయన
మవనిపుత్రీవియోగార్తి * నతి వివర్ణ
ముంగవిచ్ఛిన్న కాకుత్స్థ * హారిశిరము
దెచ్చి భటులార చూపుడు * దేవికిపుడు. 35

రాక్షసులు మాయాశిరస్సుం దెచ్చుట.

గీ. తీవ్రకోపాతిశయ సముత్క్షిప్త కుటిల
భ్రూకుటీ దుర్నిరీక్ష్యంబు * భువనభయద
మాక్షణంబున ఖండితమైన యట్టు
లున్న శిరమప్డు నిర్మించి * యువిద మోల
నిడిరి దైత్యులు విభునాజ్ఞ * నిష్టమెసగ. 36

సేవకులు బయలుదేరుటను జెప్పుచున్నాడు.

గీ. త్వరిత విన్యస్త పదపత * ధరణితలులు
దశవదన శిక్షితాజ్ఞప్తి * ధరులు దనుజ
భటులు సన్నద్ధులై రామపత్ని యున్న
ప్రమదవనమున కేఁగిరి * ప్రమదమెసఁగ. 37

రాక్షసులు ప్రమదవనమునకుం బోవుట.

గీ. స్ఫుటితమణితట వివరోత్థ * ఫుల్లనళిన
షండ మధుపానముఖర చంచల మదాళి
పవన సుతభగ్నపాద పోత్పన్న బాల
పల్లవ విరాజమానంబు * ప్రమదవనము. 38

పండ్రెండు పద్యములచే సీతావస్థను వర్ణించుచున్నాడు.

గీ. కరసరోజాత విన్యస్త - కమ్రవదన
సంక్రాంతకంతా గమాసంక బహుళలాక్షి
యెచట పదశబ్దమైన గన్నెత్తి చూచి
భీతికంపిత గాత్రినా - పృథ్వీపుత్రిఁ
గనిరి రావణభృత్యులు - కన్నులార. 39

గీ. ప్రియతమ ప్రేషితా నర్ఘ - పృథుల రత్న
రహిత వేణీకలాప సంకేతాంత చరిత
రోదనోచ్ఛ్వాస లోచన - రుచులదాని
ధౌత కలధౌత పాండుర - దత్త ధార
లైన బాష్పాంబు ఝరిభూమి - నార్ద్రఁజేయ. 40

గీ. అయుని తాయతవేణిక - నశ్రువారి
క్లిన్న నీలాలకోత్కర - కీర్ణవదనఁ
ద్వ్యక్తరశ నానితంబ సంసక్త హృదయ
మండ నార్హశరీరన - మండితాంగి. 41

గీ. స్తోకము కుథాయితాంభోజ - సుందరములు
శూన్యహృదయత నిశ్చల - నిష్ప్రభంబు
లైన కన్నులుగలదాని - హరిసమూహ
కలకలారవ సంశ్రుతి - ఘటితహర్ష. 42

గీ. లోచనాశ్రు ఝరీధౌత - లుప్తరాగ
మధరముగ లక్షితాలిని - నధిక కృశను
సహచరుని బాసి పరితపించు - చక్రవాకి
చందముననున్న జానకిఁ గనిరి. 43

గీ. పాండుదుర్బల గండదర్పణ నివేద్య
వదన విస్తారకతిపయ వాసరాంత
కళల పూరయితవ్యమౌ కలువల చెలి
బింబమన నొప్పు రాఘవ ప్రియను గనిరి. 44

గీ. సకలభూషణ బంధన స్థానములను
దేహకాంతి విముక్త ప్రతీకములను
రోచనాచారు శోభావి రూషితములు
దాల్చు జానకిఁ గాంచిరా దనుజవరులు. 45

గీ. గాఢపరిరంభణ క్లాంతికలిత భుజను
దర్శనీయాక్షి యుగళను దనుజజాతి
కంఠదేశాపీనద్ధమౌ కాలపాశ
మంతికస్థిత వల్లభ నధికశోక
సవనిపుత్రిని గాంచి రయ్యసురవరులు. 46

గీ. విరహిణీజన దుస్సహ విధు సమీక్ష
గాఢతరజాత దుర్భగోత్కంఠ సుకృశ
కాయయష్టి నిషణ్ణను గళిత జీవ
యను విశంకను నిశిచరాంగనల చేత
హస్తపరిమృష్టహృదయాబ్జ నవనిపుత్రిఁ
గనిరి రావణభృత్యులు దనుజవరులు 47

గీ. బాష్పజలబిందు సందోహభరిత కుటిల
కుంతలావస్తృతాస్యాబ్జ గూఢహృదయ
కాంత సంప్రేషితోర్మికాగత మహార్ఘ
రత్నసందర్శనోత్పన్న నూత్నహర్ష. 48

గీ. భావిసంగ్రామ మూహించి ౯ భయవశాత్మ
భర్తృదోర్దండ చండిమాతపాస్త్రతాప
హృదయ నిపతిత దశకంఠ ౯ మెట్టితానో
యనుచు వెఱవందు జానకిఁ ౯ గనిరివారు. 49

గీ. సమ్ముఖాలోకనసహార్తి ౯ సాంద్రలజ్జ
యధిక లజ్జాభరాయత్త ౯ విధుతహృదయ
హృదయ సంజనితౌత్సుక్యకవిదళితాశ
నవనిపుత్రికఁ గాంచి రయ్యసురవరులు. 50

రాక్షసులు సీతసమీపమునకు వెళ్లుట.

గీ. జానకినిజూచి దుఃఖితస్వాంతులగుచు
మఱచి కర్తవ్యకర్మను ౯ మరల రాజ
భయవశంబున స్మృతిశక్తిఁ ౯ బదిలపఱచి
మాయ రాఘవశీర్ష నిర్మాణవిధిని
జేసి కొంకుచు సీతను ౯ జేరఁబోయి. 51

రాక్షసులు సీతకు మాయాశీర్షముం జూపుచున్నారు.

గీ. విశసనోద్గతమాంస సంవేష్టితంబు
ఛిన్నమధ్య విలగ్న సంక్షిప్తధనువు
రాము మాయాశిరంబును ౯ రజనిచరులు
సీత చెంగట నుంచిరి ౯ భీతిలేక. 52

సీత దానినిజూచి మూర్ఛిల్లుట.

గీ. దూరమునఁ జూచి భూపుత్రి ౯ దుఃఖమొందె
దగ్గరకు రాగ భయకంపితాంగియయ్యె
చూడమిది రాముశిరమంచుఁ ౯ జూవ మూర్ఛ
మునిఁగె సంమూఢచిత్తయై ౯ ముగుదయపుడు. 53

సీత మూర్ఛిల్లి భూమిపైఁబడుట.

గీ. వామగండస్థలస్థల ✽ ద్వామహస్త
స్రస్తకుచమండలోత్సంగ ✽ క్షౌమవస్త్ర
క్షితి విలుంఠన విచ్యుత ✽ కేశపాశ
సీతగూలెను దల్లిపైఁ ✽ జేష్టలుడిగి. 54

భూమి నాధారముగాఁ జేసికొని సీత బ్రదికియున్నదని
చెప్పుచున్నాఁడు.

గీ. ఆప్తజనులెల్ల దేవభూ ✽ యంబు నొంద
జగతిజనులకు బంధువుల్ ✽ సాకువారు
శోకసాగర కబళిత ✽ భూకుమారి
ధరణిపైఁగూలె మూర్ఛిల్లి ✽ తల్లియనుచు. 55

సీతాదేవి గాఢమూర్ఛను జెప్పుచున్నాఁడు.

గీ. బాష్పమోక్షంబు జేయదు ✽ పడతిమిన్న
రామశీర్షంబు జూడంగ ✽ రహితశక్తి
కేవలము ప్రాప్తమోహయై ✽ క్షితితలాన
గళిత జీవిత చందానఁ ✽ గలికి యుండు. 56

సీత మూర్ఛావస్థం జెప్పుచున్నాఁడు.

గీ. అవనిపుత్రీముఖాంభోజ ✽ మాంక్షణాస
సాంద్రమోహాంధతమమున ✽ శ్యామకాంతి
క్షీణ వినిస్సృతి నిశ్చల ✽ శ్వాసవితతి
విరళ మిళితాత్మలోచన ✽ సరసిజంబు
మోహలుప్తాక్షితారకా ✽ ముగ్ధమయ్యె. 57

సీత మూర్ఛచే దుఃఖమునుగూడ నెఱుఁగకుండ
నున్నదని చెప్పుచున్నాఁడు.

గీ. కబళితాత్యంత విరహ దుఃఖంబు నష్ట
భర్తృ మారణ సంప్రాప్త బహుళదుఃఖ
మగు సుఖంబును మూర్ఛానిమీలితాక్షి
జనకనందిని పొందెను తనువు మఱచి. 58

నిట్టూర్పులువచ్చుటం జెప్పుచున్నాఁడు.

గీ. స్తనపరీణాహ సంవృత తాంతహృదయ
మందు గనపడ దించుకయైన నూర్పు
దీర్ఘ నిశ్వాసకంపంబు దేవి యధర
పల్లవమునందె చూపట్టె బహుళముగను. 59

మోహము శాంతింపగా గన్నులుతెఱచుచున్నది.

గీ. మూర్ఛఁదేరిన తటినైన ముగుద చిన్న
యూర్పు లలయించు బల్మాఱు నుస్సురనుచు
నిస్సహములైన యంగముల్ నిలువలేక
సంతతశ్శోచ్యతదధికాశ్రుసంతతులను
మునిఁగియున్న కనీనికల్ పొలుపుఁజూప
మెల్ల మెల్లనఁ గనువిచ్చె మెలతయపుడు. 60

మూర్ఛ తెలివినొంది సీత మాయాశిరస్సుం జూచుట.

గీ. రభసపాతిత మండలాగ్ర ప్రహార
విషమ సంఛిన్న కంఠాగ్ర విగళితంబు
చాప సంహిత నారాచ సంచయముల
శ్యామవర్ణీకృతాపాంగ సంయుతంబు. 61

గీ. వర్జితాశేషశోణిత ƒ పాండువర్ణ
ముకుళితచ్ఛేదమాంస సకేమ్ముద్రితోరు
రంధ్రమాభగ్న పతితాసి ƒ రక్త పంక
భీషణం బౌచుఁ జూడ్కికి ƒ వెఱపుగదుర. 62

గీ. ఉగ్రనిర్దయదష్టాధరోష్ఠ మధ్య
దర్శితాపాండుదంష్ట్రావికతానయుతము
పుష్కలస్త్యానశోణిత ƒ పూర్యమాణ
కృష్ణకంఠ నికృంతన ƒ కీర్ణశిరము. 63

గీ. నిశిచరానీకనీతంబు ƒ నిటలనష్ట
భ్రుకుటిబంధంబు గళితార్ధ ƒ రుధిర లఘువు
నిర్మనస్క ప్రదర్శిత ƒ నిజ కనీని
కైన రాముని శీర్షంబు ƒ నతివ జూచె. 64

రామశిరస్సుం జూచి సీత మఱల మూర్ఛపోయినది.

గీ. సీత యత్తఱిఁ జెక్కటఁ ƒ జేర్చినట్టి
విహ్వలంబైన హస్తంబు ƒ వేగ నురము
నందుఁ గీలించి తనదృష్టి ƒ నాత్మనాథు
నంద తగిలించి ధాత్రి నిస్పంద యగుచు
గూలె గళితాసువును బోలెఁ ƒ గూళ లలర. 65

మఱల తెలివిరాగా సీత పూర్వదర్శనమును నమ్మక
లేచి చూచి నిశ్చయించుచున్నది.

గీ. ముగుద సీతమ్మ యంతట ƒ మూర్ఛఁ దేరి
యేమి టిదియంచు నొకపరి ƒ నెత్తి మోము
దిశల విదిశల జదలున ƒ దృష్టి నిలిపి
శూన్యముగఁ జూచి ƒ సర్వంబు ƒ శోకమందె. 66

ఆమెకు నోటివెంట మాటరాలేదు.

గీ. ఆత్మనాథుని శిరమున • కభిముఖియయి
సర్వగాత్రావసాద విసంజ్ఞయగుచు
కోరినను వాక్కు మరణంబు • గోమలాంగి
పొందలేదేమి చిత్రింబో • బుద్ధిఁ దలఁప. 67

తిరిగి యావేగమువలన సీత క్రిందఁబడిపోవుట.

గీ. ధూళిధూసరధాత్రిపై • గూలి జనక
పుత్రి విక్షిప్తవేణియై • పొలువు విడి
విపులవక్షఃస్థలీలగ్న • పృథులభూమి
వర్తులీకృత కుచయుగ • భారయయ్యె. 68

స్తనజఘనోన్నతిం జెప్పుచున్నాఁడు.

గీ. జనకరాజేంద్రపుత్రి విషణ్ణ యగుచు
సర్వదేహాంగభరమున • జన్మతలాన
పతితయైయున్న సంలుప్త • వళి విభంగ
మధ్యదేశంబు ధాత్రిని • మట్టలేదు. 69

తెలివివచ్చినప్పుడు కన్నీరు నించుచున్నది.

గీ. సంక్లిష్టకంఠంపు బవరానఁ • బడినసీదప
జూడఁదగినట్టి సుభగుని • సుందరాస్య
మిప్పగిది జూడబడెనంచు • నెన్నరాని
శోకసాగరమగ్నయై • సుదతి సంజ్ఞ
యశ్రుజాతంబు నొకమారె • యవతరించె. 70

రామశిరోదర్శనముకొఱకు సీత ప్రయత్నముం
జెప్పుచున్నాఁడు.

గీ. అప్పుడవనిజ బహుకష్ట • ముప్పతిల్ల
ప్రాప్తచైతన్యయై బాష్ప • పటల కార్ద్ర

గండతల దష్ట కుంతలౌ♦ఘముల జక్కి
నొత్త హస్తంబు వశముగా♦కుండె నపుడు. 71

సీతయొక్క విహస్తతం జెప్పుచున్నాఁడు.

గీ. అవనిజాత మహోద్వేగ♦వివశయగుచు
మీద కెత్తిన చేదోయి ♦ మీరిన వెత
నోర్వ శక్తివిహీనమై ♦ యొక్కమారు
స్తనయుగంబును జేరక ♦ తటుకున నది
పడియె నుత్సంగమం దతి♦భారమగుచు. 72

క్రీగంటిచే రామశిరస్సుం జూచుచున్నది.

గీ. మూఢహృదయాంబుజాత యా♦భూమిజాత
కాంతుశిరము సధీరంబు♦గాఁ గనంగ
సాహసము లేమి నడ్డుగా ♦ సగము ద్రిప్పి
మోము వీక్షించె శోకాబ్ధి ♦ మునిఁగి గరిత. 73

గుండెలు కొట్టుకొని యేడ్చుచున్నది.

గీ. హస్తయుగ నిర్దయాత్యంత♦హనన తామ్ర
కుచయుగభ్రష్టచేలయై ♦ కువలయాత్మ
జాత నిజకాయ సంక్రాంత ♦ సకల భర్తృ
దుఃఖయై యేడ్వ మొదలిడె ♦ దీనయగుచు. 74

సీత యేడ్పును వర్ణించుచున్నాఁడు.

గీ. రామ నీదగు శీర్షంబు ♦ రమణ దక్కి
కనగ నాపాతభయదమే ♦ కాదు సుమ్మి
దారుణాఖండ దుఃఖప్ర♦దాయి యగుచు
హృదయబంధన మెడలించె ♦ నసయ మగుచు. 75

సీ. గృహపరిత్యాగమాదిగా • నింతదనుక
కుఱుచగాకుండ జూచెదు • కోష్ణమైన
యశ్రుబిందుపాత్కారంబు నీ • యతిమనోజ్ఞ
వక్షమునఁజార్చి నాదగు • బహుళ దుఃఖ
తాపమార్పంగఁ గోరితి • ధరణినాథ
యిట్లు నీవేగ నది నాకు • నెట్లు తీరు. 76

గీ. నిన్నుఁ జూచెదఁ గ్రమ్మఱ • నీరజాక్ష
యనుచు విరహానఁ బ్రాణంబు • నిలుపుకొంటి
నిన్నుఁ జూచితిగాని నే • నెన్నుకొన్న
కోర్కె ఫలియింపలేదు నా • కుటిలదైవ
మేమనందును రఘుకులసోమ నేడు. 77

సీ. ధాత్రియును రాజలక్ష్మియు • ధాత్రిపుత్రి
నైన నేనును నీకగు • సతులమయ్య
రమణ బహుతానిషేవ్య యా • రాజలక్ష్మి
భర్తయగు నొక్కపురుషుండు • వసుధ కెవ్వ
డెవ్వరికి లేని వైధవ్య • మిపుడు నాకుఁ
గలిగె విధివక్రతను జేసి • కష్ట మయ్యొ. 78

గీ. బాష్పమీలితలోచన • ద్వయముఁ దెరచి
సిగ్గు విడనాడి తావక • శీర్ష మిపుడు
గంటి నిదియేమటంచును • గంఠ మెత్తి
యేడ్వసాగితి • నీముఖ • మిద్ది నిజము. 79

గీ. నిన్ను జూచెడు నాశచే • నిన్నినాళ్లు
విషమ దుస్సహ తావక • విరహదశను

సైచియుంటిని చెలులతో • సహవసించు
కరణి ఖలరాక్షసులతోడఁ • గలసియుంటి. 80

గీ. నీవు పరలోకగతినొంద • నిశ్చయముగ
ననుమృతి ప్రాప్తనై నిన్ను • గని సుఖంబుఁ
బడయనోపుదు రఘునాథ • పంక్తి కంఠ
వధము లేదని హృదంబు • వక్కెతాను. 81

గీ. అశ్రుపాతంబు నక్షుల • నణగలేదు
నిన్ను దర్శించు నాశ నా • నెమ్మనంబు
నిలుపుచున్నద దేమొకో • తెలియజాలఁ
గారణము రఘుకులోద్ధారచు • ఖలవిరామ. 82

గీ. ఆత్మవల్లభ నాకొఱ • కబ్ధి దాటి
ప్రాణముల గోలుపోయితి • ప్రకటముగను
నాథ యెంతకృతఘ్న మో • నామనంబు
జీవితంబిప్డు సైతము • స్థిరత గాంచె. 83

గీ. సకల కల్యాణ గుణగణ • స్థానమంచు
నిన్ను జనములు జగతిలో • నెన్నుకొందురు
గళిత మహిళా స్వభావనై • కడవరాని
శోక సాగరమగ్ననై • నుక్కు నాదు
పేరె నశియించు నేజన్న • పిదప రామ. 84

గీ. రామ భవదీయ తీక్ష్ణ నా • రాచ నికర
ఖండితాధళిపత ద్దశ • కంఠసమితి
కన్ను లారంగఁ గనెదు నా • కాంక్ష లెల్ల
భగ్నమయ్యెను మద్భాగ్య • వక్రగతిని. 85

గీ. ఇలను జనతయుఁ జేశ్రమచే శే నిష్టజనుల
చావు శంకించెదరు నూన • సమున నల్ప
విరహమున నైతమి దృశే • చిరవియోగ
దశను బొందితి దుస్సహ • తాపగరిమ. 86

త్రిజట సీతనోదార్చుట.

గీ. అపుడు కడలేని దుఃఖాబ్ధి • నడుగుముట్టి
నిశ్చలాంగియు నిస్సృత • నీరనేత్రి
శూన్య హృదయయునై యున్న • క్షోణిజాత
దరిసి నిజహస్తమున నామె • కురులుదువ్వి
యశ్రుకలుషంబులగు కన్ను • లద్ది మోము
నెత్తి యీరీతిఁ ద్రిజట వ • చించె నార్య. 87

పండ్రెండు పద్యములచేఁ ద్రిజట సీతనోదార్చుటం
జెప్పుచున్నాడు.

గీ. యువతి జనముల శీలాన • నుగ్రశోక
మిడులేనట్టి ముగ్ధత • యెన్న రాని
ప్రేమ బహుళంబుగానుండు • పృథ్విజాత
వస్తుతత్త్వ విచారంబు • వారికిల్ల
తిమిర చయమున భయమగు • దినకరునకు
ననుచుఁ బలుకుదురెప్పుడు • వనజనేత్రి. 88

గీ. జానకీదేవి త్రిభువన • సంఘసృష్టి
స్థితిలయంబుల కర్తగాఁ • జెప్పనెవనిఁ
బ్రాగ్వచోబృంద సీమంత • పరిషదెల్ల
కనక నేత్రాది ఖల రిపు • ఖండనమున

నెవ్వడింపు(నిభయము వా • రించె(దొల్లి
నతడితడె సుమ్మి యోముగ్ధ • మతిని నమ్ము. 89

గీ. కలియకుండెడు సప్తసా•గర జలంబు
మేరమీరని భూధరవారయుతము
ధరణిమండల మేగతి • దళిత రాము
శిరము మోయంగ(గలదని • సీత నీవు
ఎట్లు నమ్మెదవో నాకు • నెఱుగ(జెప్పు. 90

గీ. ఇనకులస్వామి నిజముగా • నీల్గెనేని
పంక్తికంఠగృహోద్యాన • వాటమెల్ల
నెట్లు విగళితకాంతియై • హీనమగును
మారుతం బెట్లు విరుచును • భూరుహాళి
కమలముకుళన శక్తుడే • కమలవైరి. 91

గీ. ఉడుగురోదన మోయమ్మ • యుత్పలాక్షి
తుడుచుకొనవమ్మ బాష్పబిం•దువుల నిపుడు
అంస పరివృత్త వల్లభా•స్యారవింద
మతిదృఢంబుగ( గౌ(గిట • నలవరించి
విరహ విగమక్షణంబున • బ్రియతమాంక
మందు( గూర్చొని విశ్లేష•మందు( బుట్టి
నట్టి శోకంబు( జెప్పుచు • నపనయింపు. 92

గీ, పటువిరహ దుఃఖ పాండుర • వదన కాంతి
దశవదన మారణోజ్ఝితో • దాత్తరుషను
సుఖ విలోకన సౌమ్యంబు • సులలితమ్ము
జూడగలవీవు పతిమోము • సుదతి నమ్ము. 93

గీ. కన్నుమెడవేల్పు నైతము • నొవ్వఁకొని
శిరశ్శకృంతన మిసకుల • శేఖరునకు
నయ్యె నేని నిజంబుగా • నది కచంబుఁ
బట్టిలాగిన స్ఫుటితపాణిఁ • బదనయన. 94

గీ. దశవదన దర్పభంగ సం•దర్శకంబు
క్షితిపతి ప్రేష్యవానర • కీట దళిత
బహుళ శాఖా ఫలస్తోమ • భరితదృశ్య
ప్రమదవనమును జూచియుఁ • బ్రత్యయంబు
నీకు లేదేమి చెప్పుదు • నీరజాక్షి. 95

గీ. దృప్త రాక్షస నివహ సం • దీర్యమాణ
మాహతోత్ఖాత సురలోక • మఖిల భువన
మెవని పీనభుజార్గళ • మేపుమీర
నిలుపకుండిన నది యెట్లు • నిలుచు సుదతి. 96

గీ. మూర్ఛమునుగుచు నిస్సహా•బుద్ధహృదయ
వౌచు దానవమాయగా • నాత్మ నెఱిఁగి
యేల నొందెద వీమోహ • మేణనయన
లెమ్ము ధైర్యము జేకొను•మమ్మ యిపుడు. 97

గీ. సహిత సర్వనిశాచర • సవిధమందు
మలయశైల సువేలాద్రి • మధ్యమందు
సేతుపథమును నిర్మించి • కౌతుకమున
రాక్షసుల దున్మింప సిద్ధుఁడౌ • రామునందు
నీక విశ్వాస మెట్లగు • నీరజాక్షి. 98

గీ. మలయశైల నితంబంబు • మర్దితంబు
వార్ధి సలిలాన భూమిపై • వలెను కపులు

నడచి వచ్చి సువేలాద్రి • విడిసి రబల
యింక నైనను నమ్మవ•య్యనకు లేసు. 99

సీత త్రిజటయొడిమూర్ఛపైఁ బడుట.

గీ. అంత జానకి యావల్కు • లాలకించి
మూగతోత్క్రాంత జీవిత•యగుచు మోహ
వార్ధి మున్గుచుఁ బరమాప్త•భావ కలిత
సఖి సమానత నీక్షించి • చయ్యనఁ బడె
నామె యురమున లత యన నాక్షణంబు. 100

అట్టి యవస్థలోనున్న సీత యేడ్చుటం జెప్పుచున్నాఁడు.

గీ. త్రిజటవక్షస్స్థలంబున • దెలివిదప్పి
స్ఖలితయైయున్న ధాత్రీజ • కనుల వెంట
నురులుచున్నట్టి బాష్పంబు • లుద్దవిడిని
తడిపి తత్కచభారంబుఁ • దడిపె నేల. 101

చైతన్యముగలిగినదియై సీత మాట్లాడుట.

గీ. శిథిల కచభారమంతయుఁ • జెదిరి పృథుల
కుచభరంబున లగ్నమౌ • శ్రోణిరజముఁ
దుడువఁ ద్రిజటాంకమునునుండి • తూర్ణగతిని
లేచి మాటాడదొడఁగెను • లేమ సీత. 102

సీతాసంభాషణమును జెప్పుచున్నాఁడు.

గీ. తొలుత నే నేను రాముని•తలను జూచి
మూర్ఛబోతినో యా నేనె • మూర్ఛ దేఱి
చూచుచుంటిని దాని నే. • సుదతి యిప్పు
డిట్టి దుఃఖంబులోనుండి • యింక నేను

ప్రాణముల నిల్పియుంటిని • పడతి దీని
కేసవార్థినిఁజెప్పెద • వింతి నీవు 103

గీ. దానవాలయవాస దుర్దశను సైచి
కొనకు నేనట్టి యవసానమునను గంటి
నిపుడు వచనీయహతము నాహృదయ మింక
పొగలెగయుగాని నుండదు • పూవుబోడి. 104

గీ. పురుషులకు యోగ్యమౌ రీతి • పాలిసితీవు
శాత్రవు డొనర్పునీకీన్ను • శంస కర్మ
నాతులు లభించు మృతినాకు • నలిననేత్ర
యెట్లు లభియించుభాగ్య విహీన నైన. 105

గీ. బ్రదికియున్నది వైదేహి • రామభద్ర
యని సమీరప్రియాత్మజు • డన్న మాట
నమ్మి ననుగావ నిచటికి • నయముమీర
వచ్చితివిగాని నేను జీవనము తోడ
నుండగా మరణమొందితి • పుర్వినాథ. 106

తిరిగి సీతామోహమును జెప్పుచున్నాఁడు.

గీ. అలకనిచయావృతానన • జలజ సీత
వేణికాబంధవేష్టిత • విమలకంఠ
మోహ సమున్మథమానస • ముగ్ధభాషి
తముల నాడుచు గూలెను • ధాత్రిపైని. 107

గీ. గళిత కబరీ వినిస్సరత్స్వచ్ఛ శిరోజ
చయ సమాస్తృతమైయున్న • క్ష్మాతలమున
లక్ష్మణాగ్రజవక్షస్స్థలాధిశయన

దూర పర్యస్త విషమ మకరోర ధాధ్య
యగుచు గూలెను ద్విజట దుగ్ధాబ్ధి మునుగ. 108

తిరిగి శిరోదర్శనానుకూలవ్యాపారముం జెప్పుచున్నాఁడు.

గీ. తరుణపల్లవ సన్నిభ ♦ మురు కుచప్ర
హార తామ్రాతివిహ్వల ♦ హస్తమునను
నేకగండస్థలాలకాళిక దష్ట
మైన ముఖమును దుడువంగ ♦ నవబువయ్యె. 109

సీత కన్నీరు తుడుచుకొనుచున్నది.

గీ. కట్టెదుటనున్న వస్తువు ♦ గాంచ లేక
యశ్రుధారాపరిప్లావితాక్షియుగళ
జనకరాజపుత్రియాత్మజ ♦ చాలశ్రమను
దుడుచుకొనె రెండుచేతులతోడ గనుల. 110

మరల శిరోదర్శనముం జెప్పుచున్నాఁడు.

గీ. లక్ష్మణాగ్రజుశిరమందు ♦ లక్ష్యముంచి
చలిత మారుత విషమ సంచాలితాల
కాళి పరిమృష్ట బాష్పజలాస్య సీత
రాక్షస క్షుణ్ణ భూతల ♦ ప్రలుఠితంబు
రామశిరమును జూచెఁ బ్రకామచింత. 111

సీత తిరిగి ఏడ్చుట.

గీ. ప్రతికలోద్బద్ధ శోకాతిభార వేగ
నిశ్చలీకృత నేత్రమై ♦ నిర్మలాంగి
బాష్పవారిప్రవాహ సంప్లావితాక్షి
యగుచు ధాత్రీతనూజాత ♦ యవని ద్రెళ్లె. 112

సీత స్థైర్యముం జెప్పుచున్నాఁడు.

గీ. అపుడు రాముని శీర్షమ • త్యాదరమున
గని గళద్బాష్ప పాండులో • చనయుగాన
త్రిజటవదిక్కుఁ గన్గొన్నఁ • దిరిగి సీత
మరల నిశ్చయమాత్మలో మ్రాఁడి గొన
కలికి నెలవిమ్మ భగ్నను • గలిసి కొనఁగ. 113

త్రిజటతో సీతవాక్యము.

త్రిజట శ్రీరామచంద్రుని • దీర్ఘ తీక్ష్ణ
విరహదుఃఖంబు సైచితిఁ • దరముగాని
విధురతాదుఃఖ వివశత • వెంటనంటె
సైచుకోమలి నిస్నేహ • సాంద్రమైన
హృదయమున నాదుమరణంబు • నిప్పుడనుచు
నేడ్చె జానకి కన్నీటి • యేఱు పాఱ. 114

మరల సీతా విలాపము.

గీ. అందరికి నిట్టి గతిపుట్టు • దాత్మదలప
మానసౌన్నత్య మహితులా • మానవులకె
యిట్టి యవసానమబ్బున • టంచుబలికి
స్తనకలశ యుగ్మముభయహ • స్తముల గొట్టి
కొనుచు గూలెను ధరణిపైఁ • గోమలాంగి. 115

సీత తనయందవజ్ఞను జెప్పుకొనుచున్నది.

గీ. అట్లుజీవన లజ్జిత • యైన సీత
నిరుపమాన విషాదాతి • నిస్సహాయయి
దాశరథియంచుఁ బల్కంగ • దక్షయయ్యు
"ప్రియ" యటంచును బల్కంగఁ • బ్రీతివీడె. 116

సీత ప్రలాపనముం జాలించుచున్నది.

గీ. విలపనము మానె కన్నీరు • విడువ లేదు
స్వాంగతనిఁ గొట్టుకొనుటకు • శక్తియుడిగె
మానవేంద్రుని కులసతి • మనమునందు
మరణనిశ్చయపరత నా • తరుణమందు. 117

త్రిజట సాంత్వవచనములం బల్కుచున్నది.

గీ. జీవితాంత కరక్రూర • చేష్టనుండి
మరలజాలని హృదయాన • మనుజనాథు
చాన వీక్షించి త్రిజట సంసాంత్వవచన
రచన మొప్పార నిట్లనె • రాగసరణి. 118

త్రిజటావచనముం జెప్పుచున్నాఁడు.

గీ. జనక రాజేంద్రపుత్రి నే • దనుజ ననుచు
సేవగింపంగఁబోకు నీ • భావమందు
స్నేహమున నిట్లు నుడివితి • జిత్తగింపు
వనలతలనైన నుద్యాన•వాటినైన
సురభి కుసుమాళి గ్రహియింత్రు•సూవె బుధులు. 119

మరలఁ ద్రిజట చెప్పుచున్నది.

గీ. సత్యముగ రాముని ధనంబు • జరిగెనేని
నిలువదిక నీదుజీవంబు • నెలఁత నేడు
అక్షతుండౌచు రఘునాథుఁ • డవనినుండ
నాధిసాగరమగ్నుఁడై • యతఁడుగుండు. 120

మరలఁ ద్రిజటా వాక్యము.

గీ. అతనిమరణ మసంభావ్య మని తలంపు
నమ్ము నామాట నాతిరో • నమ్మఁగాదు

ఘనులు ప్రాకృత జనసార్థ • మునకు బోలె
జెప్పనొల్లరు నీవంటి • చేడియలకు. 121

త్రిజటా వాక్యము.

గీ. ఒక్క కపి నాడు లంకలో • నుక్కుమిగిలి
లంక నెల్లను దహియించి • శంక లేక
బాల వృద్ధాంగనా శిశు • వ్రాతరోద
నాతిఘోరమహారాక్ష • సాలయముల
నుగ్రక్క జేయడె మఱచితే • సుదతి నేడు. 122

రాక్షస ప్రళయము సంభవించునని
సిద్ధాంతము జేయుచున్నది.

గీ. లేడు లేడీ జగంబున • లేడు రాము
నోర్వగలదండి మగడొక్క • డువిద నమ్మ
ముజ్జగమ్ములు రాక్షస • ముక్తములగు
నేరికప్రియమీ దుష్ట • మారణంబు. 123

ఏడుపు మంచిదికాదని చెప్పి త్రిజట సీత యేడ్పును
వారించుచున్నది.

గీ. వసతి లెమ్మిక శోకంబు • విడువుమమ్మ
అశ్రుబిందు నిపాతార్ద్ర • మక్షియుగము
దుడుచు కొనుమమ్మ దురమున • దుముక బోవు
రఘుపతికి మంచి శకునమ్ము • రమణి కాదు. 124

రామసత్త్రయం దనుమానముం జెప్పుచున్నది.

గీ. సిగ్గుపడి మోము లెత్తక • చిన్నతనము
దోప దశకంఠుడాత్మీయ • దుర్గమున నె
నిలిచె కంపిత గాత్రుడై • నిష్ప్రభత్వ

మొందె నెవ్వని వీర్యాన కే మందయాన
యిట్టి రఘునాథు వీర్య కే మందేల శంక. 125

భావి రామానురాగ వ్యాపారముం దలంచి చెప్పి
త్రిజట సీతమనస్సును చల్లగా, జేయుచున్నది.

గీ. ఆస్రహస్తాగ్ర ముకుళితా కే సర్వ్య సత్క్ర
వేపమానాంగుళిక్షిప్త కే విషమ భాగ
మైన నీవేణి వేగనే కే యర్కకులుడు
చక్కజేయును కోమలి కే సంతసమున. 126

రావణుని మరణము నిశ్చయమని చెప్పుచున్నది.

గీ. బ్రతికి యుండంగ రఘుపతి కే సంక్రముఖుడు
పాపియై మాయశిరమును కే జూపి నీకు
నమిత దుఃఖము గలిగించె, ననుచు వగవ
వాని దుర్వృత్తమునకు నే కే వగతు నబల. 127

రాముడు పరులచే నసభిభవనీయుడు.

గీ. వాలివధ దృష్టసారంబు కే బాణకీలి
శోషితాంభోధి దత్త సుకేశీపథము
రుద్ధ లంకాపురీ వర కే మిద్ధతేజ
మైన్న రాముని భుజబలం కే బల్పమనుచు
మది దలంపకు దానికి కే మారు లేదు. 128

త్రిజట శకునమును గన్పర్చి సీతను నమ్మించుచున్నది.

గీ. అర్కశశిబింబ మిళిత వక్త్రాబ్జనౌచు
రద చతుష్టయ మండిత కే రమ్యదంతి
కర్ణతాళానిలోద్ధూత కే కమ్రశుక్ల

వసన మొక్కటి ధరియించి ♦ వన్నెమీర
జనగ నినుగంటిఁ గలలోన సన్నుతాంగి. 129

మఱల స్వప్నముచేతనే త్రిజట రావణునియనర్థముం
జెప్పుచున్నది.

గీ. క్రమిక దశకంఠకర్తన ♦ క్రకచ విషమ
మార్గ(జౌచు నరేతరాకృత్మారణోగ్ర
పాశబంధవికర్షణోత్పతిత వదన
సంగుఁడై నేలఁగూలిన ♦ చంద మేను
స్వప్నమునఁ గంటి గతనిశ ♦ వామనయన. 130

రామునిశిరస్సు మాయాకల్పితమని సిద్ధాంతీకరించు
చున్నది.

గీ. కాన వైదేహి ధైర్యంబు ♦ కలిగియుండు
మమ్మ నశియించు నీదగు ♦ నశుభ మెల్ల
జ్ఞాత యాథార్థ్యమైన యీ ♦ యాతుధాన
మాయ యింకేమిజేయును ♦ మగువ నిన్ను. 131

శిరోమాయాత్వము నుపసంహరించుచు త్రిజటా
వచనమును నుపహరించుచున్నాడు.

గీ. నిజముగా నిద్ది రాముని ♦ నెత్తి యేని
యమృత రసతుల్య భవదీయ ♦ హస్తమంట
లబ్ధ చైతన్యమగుట దుర్లభము గాదు
నమ్ము నామాట జానకి ♦ నమ్ము మమ్మ. 132

బంధుజనహృదయము లనిష్టమును శంకించునని
సీత మరల నేడ్చుచున్నది.

గీ. త్రిజట యారీతి రామునిశ్రేయతత్త్వ
మెల్ల వర్ణింప నుద్బుద్ధహృదయశోక

దీర్ణమానసయై సీత తీవ్రగతిని
నేడ్వ మొదలిడె నెలుగెత్తి యింతులడర. 133

మఱియొకరీతిగా సీతాసమాశ్వాసనముం
జెప్పుచున్నాఁడు.

గీ. త్రిజటచెప్పిన సాంత్వనోద్రిక్త వచన
సరణి జానకి యెంతలో స్వస్థచిత్త
గాకయుండెనో యంత నిక్ష్వాకుకులజు
యుద్ధసన్నాహబోధక యోధముఖ్య
వాద్యమానాతిచండప్రభాత పటహ
రవము కపిసైన్య కలకలారవము వినుచు
భీతిఁబాసెను మది భర్తృవిజయమందు. 134

సమాశ్వాసమునొందినసీత యూపిరివిడుచుచున్నది.

గీ. అంతబహువిధ సంస్థాపనాతిచతుర
వచన నిచయ ప్రతిష్ఠిత ప్రాణకాంక్ష
దగిలి క్రమ్మఱ జానకి ధైర్యమూని
దూరనామిత కుచయుగ భారయగుచు
నూర్పులాలయించె స్త్రీజన ముల్లసిల్ల. 135

మరల సీతావిరహదుఃఖోత్పత్తిం జెప్పుచున్నాఁడు.

గీ. అప్పుడాశ్వాసవచనోత్థహర్ష వశత
సుఖిత మానసయైన యాశోభనాంగి
గళితవైభవ్యభయయయ్యు దొలుత మరల
భర్తృవిరహవ్యథాదుఃఖభరమునొందె. 136

సీతను త్రిజటయందుండు ననురాగముం జెప్పుచు
నాశ్వాసమును ముగించుచున్నాడు.

గీ. మాయచేసైన మోహంబు కే మహిజ కపుడు
నాశ మొంగంగ సమర సంనద్ధ కీశ
సైన్య కలకలమాలించి కే సంతసిల్లి
త్రిజటకున్నట్టి యనురక్తిం కే దెలిసి మదిని
నామెమాటలు సత్యంబు కే లనుచు నమ్మె. 1:7

ఆంధ్ర సేతుబంధమహాకావ్యమునందు
ఏకాదశాశ్వాసము ముగిసెను.



# ఆంధ్ర సేతుబంధ కావ్యము.

## ద్వాదశాశ్వాసము.

ప్రాతఃకాల వర్ణనము.

గీ. ఈష దుత్ఫుల్ల నీలోత్ప ॥ లేధమాన
ధూళి మలినిత కలహంస ॥ జాల రుతము
దర నిమీలిత కుముదౌఘ ♦ భరిత సరసిఁ
దోఁచెఁ బ్రత్యూష సమయంబు ॥ తూర్పు దెసను. 1

నిశావసానమును జెప్పుచున్నాఁడు.

గీ. తామరసబాంధవోదయ ॥ తామ్రకాంతి
నవ సలిలపూర కలుషిత ॥ నళిన వైరి
చంద్రికాహతమూలంబు ॥ సరసధాతు
వంక కలుషంబు తటిని కైవడిని రాత్రి
చరమభాగంబు మెల్లనఁ ॥ జారెనంత. 2

వెన్నెలపోగాఁ జెట్లనీడలు కనఁబడకపోవుట.

గీ. సూరసూతకరాహత ॥ జ్యోత్స్న యైన
భూమితలమందు గతనైల్య ॥ భూరుహాళి
ఛాయ లట గానవచ్చెను ॥ చలితము లయి
యచ్చటచ్చటఁ జూడంగ ॥ నధికములయి. 3

ప్రాతఃకాలస్వరూపమును జెప్పుచున్నాఁడు.

గీ. ముకుళతనుజెందె కుముదముల్ ॥ మోద మెడలి
చంద్రబింబంబు చేరెను ॥ చరమగిరిని

రాత్రికాంతియు క్షీణించె • గ్రమముగాను
భాస్కరోదయ నిష్ప్రభ • భగణయుక్త
మయ్యె పురుహూతదిశ యట్టి • యవసరమున. 4

ఆకాశముయొక్క పరుషతామ్రత్వమును జెప్పుచున్నాఁడు.

గీ. తిమిర సంత్యక్త పల్లవ • సముద యారు
ణారుణాహత మేఘంబు • హారి కాంతి
నవ విదారిత విషమ మ • నశ్శిలోరు
భంగ మశిపర్వతార్థంబు • భంగి నభము
గానవచ్చెను బ్రత్యూష • కాలమందు. 5

చంద్రాస్తమయము.

గీ. అభినవోదక పూరిత • హస్తిపాద
కలుష వర్ణంబు భాస్కర • కరసమూహ
రూషితాంబరభాగ సం • పోషితంబు
చంద్రబింబంబు చరమాద్రి • సానువెక్కె. 6

వనముల అవస్థను జెప్పుచున్నాఁడు.

గీ. పరస మారుతపోత సం • చాలితములు
మత్త విహగాళి సన్నాద • మంజులములు
మధుర మధుపాన ముఖరిత • మధుకరములు
వనములప్పుడు రమ్యతా • వసథులయ్యె. 7

చంద్రుఁడు గ్రుంకిపోవుట.

గీ. అరుణరశ్మి సమాక్రాంత • మంబరమున
నంకమృగపోత సంభృతా • త్యంత కాంతి
ఖండిత కరావలంబు • కమలవైరి
బింబ మస్తాద్రి శిఖర ప్ర • విష్టమయ్యె. 8

చక్రవాకములు కలియుట.

గీ. తెల్లవారంగ రాతిరి ♦ తీవ్రమైన
ప్రియ విరహదుఃఖ మెట్టులో ♦ వెళ్లబుచ్చి
చక్రవాకంబు గన్పడఁ ♦ జక్రవాకి
ప్రతిరవంబుల సల్పుచు ♦ గుతుక మొప్ప
నెదురుగా జను బోలిక ♦ నేగు దవ్వు. 9

అస్తాచలావస్థను జెప్పుచున్నాడు.

గీ. అస్త శిఖరాగ్ర నిహ్ను తు♦ పబ్జవైరి
కాగ నయ్యద్రి యమిత సం♦ఖ్యాక దీప్తి
తౌషధీజాలకాంతుల ♦ నుజ్జ్వలంబు
చంద్రమణిపుంజ నిష్యంద ♦ సాంద్రమయ్యె. 10

అరుణోదయమును జెప్పుచున్నాఁడు.

గీ. దూర నత తారకౌఘంబు ♦ సూరసూత
కిరణసంఘాత సంస్పృష్ట ♦ సరసిజాత
వైరిబింబంబు సభమప్డు ♦ వన్నె తగ్గి
పూర్వగిరినుండి పుట్టిన ♦ పోలుపుతోఁచె. 11

ప్రాతఃకాల విగమము.

గీ. పతిసమాగమసంప్రాప్తి♦బాసె సంధ్య
మంచి సమయంబు రతిసుఖ♦మాన్యమైన
నిశయుఁగడచె ససిర్విణ్ణ♦నిష్టమదన
మావహద్విరహమైన యు♦హార్ముఖంబు
గళితమయ్యెను కామినుల్ ♦ కలఁతనొంద. 12

ప్రాభాతికసురతమును జెప్పుచున్నాఁడు.

గీ. మానసప్రీతివర్ధితా♦నూన రసము
నధిక రాగస్థలద్వ్యాక్య ♦ హర్ష హేతు

వస్తమయసంగతికిఁ జూడ ♦ సమిత దూర
మతిగత ముదంబు ప్రత్యూష♦రతము వోయె. 13

పాన చషకము.

గీ. అధరపల్లవరాగ సమన్వితంబు
నుత్పలాచ్ఛాదితాస్తోక♦యుక్త గంధ
వారుణీపూరితంబగు ♦ పానచషక
మంగనలు వీడకుండిరి ♦ హర్షవశత. 14

స్త్రీల రతాంతావస్థ.

గీ. స్రస్తకబరీకలాపంబు ♦ శ్లథ సువర్ణ
మేఖలాదామ సంరోధ ♦ మృదిత విపుల
జఘనభాగంబు మృగనాభి ♦ సాంద్రగంధ
సురభిళోత్తమ తనుకాంత ♦ శోభితంబు
ప్రియజనౌఘోపభుక్తంబు ♦ ప్రేయసి తతి. 15

ఈ స్త్రీలు యింటికిఁ బోవుటను జెప్పుచున్నాఁడు.

గీ. కామకేళీరసాంభోధిఁ ♦ గడవఁజేసి
యువతి సార్ధంబు ప్రియుల నుత్సాహయుక్తి
చరణహేతిసమూహాని♦స్వనము దెసల
నెఱతెగక వించు విడిదల ♦ కేఁగిరంత. 16

దినాగమనము.

గీ. బంధనాలానచారువు ♦ బాసి గజము
రాత్రిసంతయుఁ గ్రుమ్మరి ♦ గాత్రసేక
మరల వేకువ దన తొంటి ♦ మనికిఁ జేరు
కరణి రవిరశ్మిధాతుసం♦కాద్రిముఖము
క్షుభిత కమలాకరము ఘుస్రికుంభి తోఁచె. 17

కమల వికాసము.

గీ. అరుణరశ్మిప్రబోధిత • యగుచు నుదితు
సరసిజాప్తుని కెదురుగా • జను మనీష
వాస కేందిరకృత పద•న్యాస యిచట
ననఁగ కమలాకరము విచ్చె నాక్షణమున. 18

శంఖముల అవస్థను జెప్పుచున్నాఁడు.

గీ. ఉదధజలమందుఁ గ్రమముగా • నొక్కటొకటి
వీడి యన్యోన్యమును శంఖ•బృందమప్పు
డుదయకాతరమయి తల్లి•యొద్ద కేఁగు
చందమునఁ గుముదమిత్రుని • ఛాయఁ జేరె 19

కమలసౌరభోద్గమము.

గీ. వికసితాబ్జసరోవర • విపుల గంధ
మధికతను గాంచి యత్తరి • నడ్డులేక
మారుతోద్ధూతమైనను • మాంసలతను
వీకకుండంగఁ బ్రసరించె • వివిధగతుల. 20

రాక్షసుల కపశకునములను జెప్పుచున్నాఁడు.

గీ. పోయివచ్చెద నాజికిఁ • బువ్వుబోడి
వంత వలదని తమతమ • వనితలకును
యాతుధానులు చెప్పెను • నవసరమున
వారొసంగిన పశ్చిమో•దార సుఖద
గాఢ పరిరంభణమె చాలు • కార్యహానికి. 21

యుద్ధముచే రాముని నిద్రాభంగము.

గీ. సమరవిఘ్నిత నిద్రుఁడు • సవితృవంశ
దీపకుఁడు రాముఁ డత్తఱిఁ • దీవ్రముగను.

సంక్రమముఖ వైరమోచన • ప్రియతనాఖ్య
దివస మేతేర లేచెను • దీప్రుఁడగుచు. 22

రాముని మనఃఖేదముం జెప్పుచున్నాఁడు

గీ. జానకిని బాసి దుఃఖంబు • నైచినట్టి
రఘుపతికిఁ జాలకాలంబు • లఘుతతోఁడ
గడచె యామచతుష్టయ•కాలఘటిత
మైన యామిని యుగమయ్యె • నతని కపుడు. 23

రాముఁడు ధనువువైపు చూచుట.

గీ. తెలిచినప్పాడె నిద్దుర•తీరని తఱి
నక్షిపాత్రిద్వయభ్రష్ట•మైన రాము
దృష్టి కర్కశ సంగ్రామ • దృష్టసార
కార్ముకమునందు దవిలెను • కనలు దోఁప. 24

రాముఁడు లేచుట.

గీ. క్లాంత కుసుమావళీస్మృత • కటీసతలము
నలుప పార్శ్వద్వయాగ్రంబు • కథిత తాప
భరము పాషాణశయనంబు • భాస్కరాన్వ
యుండు విడిచెను సరగున • యుద్ధపరత. 25

రాముఁడు జడలెత్తి కట్టుట.

గీ. అంతగిరివనసారాశ్రి•యంబు నచిర
భావి సీతాసమాగను • భవ్యనూద
కంబు భాసుర పీవర • కటీస వాను
భుజను మెల్లన నిమురుచు • భూమిపాలుఁ
డధిక సంరంభమునఁబీడె • నశ్లెశయ్యా. 26

గీ. కొంతవడి దేవపూజలఁ • గోరి చేసి
యంత సంత్యక్త పుష్పశ•య్యా సుగంధ
సాంద్ర నిశ్వాసకర్షణ • సరణి నడ్డు
జడలగుంపును రాముఁడు • చక్కనొత్తి
కొనియె నరిభంజకంబైన • ధనువుఁ జేత. 27

రాముఁడు ధనువుం గ్రహించుట.

గీ. గలిత బహుళాశ్రుసంతతి • కలుషితంబు
పూర్యమాణోత్కటక్రోధ • భూరి తామ్ర
మఖిల దుష్ప్రేక్ష్య తారక•మైన దృష్టిఁ
బఱపె రాముండు లంకపై • బద్ధదీక్ష. 28

గీ. సార దుర్వాసమవనిజా•శయన పార్శ్వ
భాగ సంస్థాపితము విస్ర•వాస జనిత
బహుళ దుగ్ధాశ్రుసంతతి • పంకిలాగ్ర
మైన చాపంబుగ్రహించె • నర్కకులుఁడు. 29

వింట నారి నెక్కించుట.

గీ. భూతలంబున కార్ముక శ్రీ ముఖ్యముంచి
వామకరమున దృఢముగాఁ • బట్టి దాని
కనకభూధర సమసార • తను బలాన
భోగిభోగోపమం బౌచు • పొలుపమీఱు
దక్షిణ భుజాన వంచి కో•దండశాస్త్ర
విదుఁడు దవిలించె నారి నా • వింటియందు. 30

రాముఁడు యుద్ధమునకు బయలుదేఱుట.

గీ. శ్వసితసంతతి మంధర • భార శీర్ష
కంప తర్జితు నొసరించి • ఖలు దశాస్య

చలిత పర్వత సదృశుండు • చాపమాత్ర
సాధనుం డౌచు రాముండు • చనియె ననికి. 31

కపిసైన్యము బయలు దేరుట.

గీ. తులితపర్వతశిఖర స, మ్మిళిత సభసు
నేక శైలమయంబుగా • నిరవుకొల్పి
బాహుశిఖరాగ్ర వినిహిత • బహుళ వృక్ష
విటపతతియైన వానర•వీర సైన్య
మప్పుడేగెను బవరాన • కలఘుగతిని. 32

కపుల తేజఃప్రకర్షముం జెప్పుచున్నాఁడు.

గీ. సమర సన్నాహ తత్పరుల్ • కుమతు లెపుడు
నిర్భరులు జగతి శౌండీర్య•నిలయు లెంచ
తనుబలంబె తనుత్రమీ • తరుచరులకు
ప్రతిభటము లేని భుజములే • ప్రహరణములు. 33

సేనాసన్నివేశప్రకారముం జెప్పుచున్నాఁడు.

గీ. జ్ఞాతరాక్షసబలము ని•ర్భీతికంబు
త్యక్తమాయాప్రయోగ సం•యచ్ఛణంబు
దానవేంద్రపురీమార్గ • తత్త్వవిత్తు
దగ విభీషణసైన్యంబు • దరలె నపుడు. 34

రాముఁడు యుద్ధమునం బ్రవేశించుట.

గీ. జన్యసంరంభకలితుఁడౌ • జానకీశుఁ
డిష్వసనపాణియై నిల్వ • నినతనూజుఁ
డితఁడొనర్చిన మేలున • కెద్ది మాఱు
సేయనోపుదునని యెంచెఁ • జిత్తమందు

సర్వరాక్షసవిలయ మాసన్నమయ్యె
ననుచు శోకించె నవ్విభీషణుఁడు మదిని. 35

రాముఁడు ధనురాస్ఫాలనముం జేయుట.

గీ. క్షోభితావనిధరవర • ఘోర విధుతి
కంపితాంభోధి సలిలంబు • కార్ముకమును
రాము డాస్ఫాలితము సేయ • రాక్షసపురి
నున్నగృహములు హర్మ్యంబు • లుచ్చసౌధ
పంక్తులును కంపమందెను • భయము జెంది. 36

రామధనురాస్ఫాలనశబ్దమును సీత వినుట.

గీ. పులకితాఖిలగాత్రియై • పుడమిపట్టి
యభినవాద్భుత విస్తార • హర్షఫుల్ల
వక్త్రసరసిజయై సీత • ప్రథమవచన
భంగినున్నట్టి వల్లభు • పాణిచాప
నాద మాలించి మదిలోన • మోదమందె. 37

కపుల కలకలధ్వని.

గీ. మూర్ఛితాసురయావత • ముక్తరవము
జానకీకర్ణపీయూష • సారవృష్టి
దాన వేశ్వరహృదయ వి• దారణోగ్ర
వజ్రపాతంబు వానర•బలకృతంబు
కలకలం బప్డు వినవచ్చె • గాఢముగను. 38

కపులు సకలదిక్కులకు బరుగిడుట.

గీ. తరుచరానీక రభస సం•త్యక్తసమయ
ధావితోదధి సలిల సం•ప్లావితంబు
నంబుపూరపరిపూర్ణ గు•హాముఖంబు

విరత ప్రతిశబ్దమైన సువేలశైల
మపుడు ధ్వనియించె కర్ణద్వ • యంబు వగుల. 39

రామధనుష్టంకారము విరమించినది.

సీ. నిష్పన్నతాశేష కపిసైన్య • నినద వాచు
కలిత రోషద శాననా • కర్ణితంబు
నాదిమాస్ఫాలనోత్పన్న • మధిక భయద
మినకులోత్తముచాప సంజనితరవము
శాంతినొందెను మెల్లగా • శత్రులలర. 40

రావణ జాగరణముం జెప్పుచున్నాఁడు.

గీ. అంత రాక్షసనాథుండు • హర్మ్యశాల
వ్యవహితాద్రిచరానీక • మాజిభూమి
కేఁగ సమకట్టియుండుట • నెఱిఁగి నిద్ర
విడిచి సైన్యాధిపతులను • బిలిచె ననికి. 41

రావణుని పార్శ్వపరివర్తనముం జెప్పుచున్నాఁడు.

గీ. అపగతాశేష నిద్రుఁడు • విపరివృత్త
పార్శ్వుఁడతిరక్తనేత్రుఁడు • పంక్తిముఖుఁడు
తంద్రికోకయుంతవశుఁడయి • తల్లడమున
వినె ప్రగేతసమంగళ • విజయగీతి. 42

రావణునిబద్ధకము పోవుట.

గీ. అంత మధుపానకృత మదా • త్యంత ముక్త
మక్షివింశతి మంద సంత్యక్తలోషిం
తత్వ మిక్ష్వాకుకులనాథు • దానవౌఘ
హృదయదారక చాప నినదహతంబు
నగుచు సాగెను రావణు • నధికనిద్ర. 43

### రావణుని యొడలివిరుపులు.

గీ. స్ఫురిత రత్నప్రభాజాల • శోభితాంగు
ళీయకంబులు మణితోరణాయతములు
సంచ నిజబాహుయుగళముల్ • సప్రక్కపైని
జాచి విడిచెను శయనంబు • సరభసముగ. 44

### యుద్ధవ్యాపారసూచకమైన రావణుని పటహరవము.

గీ. భయపలాయిత సురదంతి • భజ్యమాన
బంధనస్తంభ విహిత సు•పర్వకోటి
క్షోభకారణ మసురేంద్రు • ఘోర నినద
సమరసన్నాహ పిశున ని•స్సాణ మప్డు
మ్రోసె భీకరగతి లోక•వాసు లదర. 45

### స్త్రీలతో శయనించిన రాక్షసుల శృంగారముం జెప్పుచున్నాఁడు

గీ. అరుగుచున్నాఁడు వల్లభుఁ • డాజి కికను
భావి యెట్లుండునో యని • భయము చేత
గట్టిగా వారి మెడలను • గౌఁగిలించి
వదలకున్నట్టి యువతుల • బలు తెఱఁగుల
నూరడించి యథాలబ్ధ • వారవాణ
ఖడ్గ కుంత పరశ్వథ • కార్ముకాది
ప్రహరణంబులఁ జేఁబూని • సమున్నమైరి. 46

గీ. అంత నాకస్మికాహావ • హన్యమాన
పటహ ధణధణశబ్దంబు • భటుల చెవుల
సోఁక బ్రియురాండ్రు కడకేగి • సొంపుమీఱ
వారి వాతెఱ జవిఁగొని • వదల లేక

ఎట్టకేలకు వీడ్కొని • యెడద చింత
యుప్పతిల్లంగ సాగిరి • యుద్ధమునకు. 47

గీ. సమర సన్నాహ సూచక • సమర పటహ
రవము దెసలందుఁ జెలగంగ • రమణకంఠ
సీతినుంచిన కాంతల • పీనబాహు
యుగము సవ్యాజముగ జార్చి • యుద్ధ రభస
విస్మృతేతర విషయులై • విధృత చర్మ
నిశిత నిస్త్రింశులయి వేగ • నిశచరాళి. 48

గీ. సమర భేరీనినాదంబు • సమ్మదమున
విని నిశాచరనాథుని • వీరభటులు
వీర శృంగారరసజ వి • కారులగుచు
నాయుధంబుల గొనియు వి • హస్తులగుచు
నాత్మ వక్షఃస్థలీ వల • దాత్మ సతుల
కుచపరీరంభ సౌఖ్యంబు • కొనకుఁ ద్రోసి
యుత్సహించిరి పోవ యు • యుత్సులగుచు. 49

గీ. స్నేహభంగంబు మున్నెప్డు • జేయనట్టి
ప్రియుల యుద్ధ ప్రయాణంబు • భయముతోడ
బలు తెఱంగుల వారించు • లలిత యువతి
మానసంబున మానంబు • మఱుగు వడియె. 50

గీ. జన్యభూమికి నీవిప్డు • చన వలదని
వేయి విధముల వారించి • వేన వేలు
ప్రియులు చెప్పినకొలదిని • వీర తతికి
భర్తృపిండాభిమాన సం • బంధ వశత
సమర కుతుకంబు హెచ్చెను • శతగుణంబు. 51

రాక్షసుల యుద్ధప్రయాణము.

గీ. భటుల కాంతలు కరముల • బట్టుకొనిరి
ప్రణయ వశతను స్ఖాలిత్య • భావుకులైరి
స్నేహవృత్తి సమాకృష్ట • చిత్తులైరి
స్థిరత నొందిరి మానాన • దేవరిపులు
పోవసాగిరి సంగ్రామ • భూమికపుడు. 52

కొందరు యుద్ధసన్నాహముం జేయలేదని
జెప్పుచున్నాడు.

గీ. సురలతోఁ బోరు సల్పెడు • శూరులైన
రాత్రిచర వీరులెల్ల ర • రణ్యవాసు
లైన మర్కటభటులతో • నాజి సల్ప
వలసివచ్చెనటంచు స్వ•స్వాంతమందు.
లజ్జనొందిరి తమకగు • లాఘవమున. 53
పృష్ఠభాగ సుదీర్ఘంబు • వెడఁద యురము
నందు విషమంబు కవచంబు • నధిగమించి
చనె మహోదరుఁ డత్తటి • ననికి వేగ. 54

ప్రహస్తుని యుద్ధసన్నాహము.

గీ. దేవరాక్షస సంగ్రామ • దీప్రయశుఁడు
నసురనాథుని జంగము•నైన కోట
బాణమోక్షసుహస్తుండు • ప్రకట బలుఁడు
ననికి సన్నద్ధుఁడయ్యెఁ బ్రహస్తుఁడపుడు. 55

త్రిశిరస్కుఁడు సన్నద్ధుఁడయ్యెను.

గీ. అంతఁ ద్రిశిరస్కుఁ డమితబా•హాబలుండు
మూఁడుతలలకు బొమిడికాల్ • మొదటబెట్టి

కంకటముం దాల్చి బాహుపుష్కరమున కార్ము
కముల ధరియించి వెడలె సంగ్రామమునకు. 56

మహోదరుని సన్నాహము.

గీ. దానవేంద్రు మహోదరుతనువు నడువ
వసుధయంతయు వ్రేగున వడకఁజొచ్చె
వారవాణంబు శిథిలిత బంధమగుచు
క్షోణిపయిఁగూలె నిజమృతిసూచకముగ. 57

ఇంద్రజిత్తుని సన్నాహము.

గీ. నిస్సృతామరమాతంగ నిష్ఠురరద
ముసలఘాత నిఘర్షణ ముష్టవజ్ర
కాంతి గవచంబు నొకటి రాక్షసవరేణ్యు
లింద్రజేతకుఁ దొడిగి రహీనప్రీతి. 58

అతికాయుని యుద్ధసన్నాహము.

గీ. చాలనేపవ్వు డతికాయు సారమైన
కాయమున కొక్కకవచంబు కర్బురాళి
తొడుగ వానిశరీరంబు ధూతమేఘ
మైన గగనంబుమాడ్కి నతిశయిల్లె. 59

ధూమ్రాక్షుని సన్నాహము.

గీ. యుద్ధభూమికిఁబోవ సన్నద్ధుఁడైన
నేటి ధూమ్రాక్షుఁ డంతట మెఱుఁపులీను
దివ్యరత్నవరానీక దీప్తియుతము
వజ్రముఖభిన్నబంధంబు వారవాణ
మొకటి ధరియించి యనికేఁగె నుక్కుమిగిలి. 60

అశనిప్రభుని సన్నాహము.

గీ. అంతకోపముఁ డశనిప్రభాఖ్యుఁ డంతఁ
దాల్చెఁ గవచంబు దాని రంధ్రములనుండి
చిర సముత్పన్న వ్రణములు చిలికె రక్త
మేఱువలె బాలా లయమేఘ నీరమువలె. 61

నికుంభుని సన్నాహము.

గీ. వివిధ శస్త్రాస్త్రపాణులై భీకరులయి
దనుజవీర సహస్రంబు తన్నుఁ గొలువ
శూరుఁడైన నికుంభుఁడు తేజి నెక్కి
చనియె సంగ్రామభూమికి సత్వరుఁడయి. 62

శుకుని సన్నాహము.

గీ. పౌరుహూత మహాశని ప్రహృతి సహము
కవచము ధరించి శుకుఁడును కలని కరిగె
ముగ్ధమతియాట రాము కార్ముక విముక్త
బాణ దుర్జాత మేమియుఁ గానఁడయ్యె. 63

సారణుని సన్నాహము.

గీ. సరభసాస్పృష్ట కామినీ స్తన విలిప్త
మృగమదాది నిషద్వర మిళితమైన
వక్షమందు ప్రియాచిహ్నమక్షతముగ
గాచుకొని మరువు దొడుగక కడకతోడఁ
జనియె సారణుడాజికి సత్వరముగ. 64

రథ ఘటనము.

గీ. అంత మాయాసమాబద్ధ కుంత పరిఘ
ఖడ్గముసలాది హేతి సంకలితమగుచు

సంధకారధ్వజాంశుక మైనదాని
సురరుధిరలిప్తకేసర శోభితాహి
రశ్మిమత్సింహయుక్తంబు రథము నొకటి
కుంభకర్ణతనూజుండు కుంభుఁ డెక్కె. 65

రాక్షసులు ఖడ్గములం గ్రహించుట.

గీ. కోపజనికారణంబును గురుపరివృఢ
కృతికిఁ బ్రతికృతి శత్రువినాశ హేతు
వగు కృపాణంబు లేఁబూని యసురభటులు
సమరభూమికి నడచిరి సత్వరులయి. 66

అప్సరసల స్వయంవరోత్కంఠం జెప్పుచున్నాఁడు.

సీ. దక్షులగు దానవేంద్రులు తత్క్షణమున
యుద్ధసన్నద్ధులగుటయు నూరకుండు
నన్యులనుజూచి యప్సరోహరిణనేత్ర
లాత్మదేహప్రసాధన మాచరించి
తమ విమానాగ్రసీమల దఱచుగాను
వెలిఁ జనుదెంచి లోనికి వెడలుచుండ్రు. 67

లంకను కపులు ముట్టడి వేయుట.

గీ. ఎంతలో నిట్లు సంగ్రామ తృష్ణచేత
నిశిచరాఘంబు సన్నాహ నిష్ఠనొందె
నంతలో రాఘవేశ్వరు డన్ని దెసల
జూడఁ గపిసైన్యమంతయుఁ గూడె నచట. 68

లంకోపమర్దముం జెప్పుచున్నాడు.

గీ. భంజితాశేష నిష్కుటోపవనవితతి
దళిత రాక్షస హర్మ్య సరోద్భవసరాశి

శతప్రవస్వాక సారతో • సాటివచ్చు
లంకఁజెటిచిరి హరులు నిశ్శంకముగను. 69

వానరుల కోలాహలము.

గీ. సవిధ సంప్రాప్త నిశిచర • స్థార మధిక
ధీర ధారేయ సూర్య కుమార రక్ష్య
మాణ కపివర్గ మలువంగ • మాఱు లేక
యాతుధానాంగనాగర్భ • పాతమయ్యె. 70

దేవత లంతరిక్షమందు విమానములతో వచ్చుట.

గీ. సరభసాలీన గర్వితి • తరుచరాళి
భజ్యమాన గృహానీక • వాసి దీన
దనుజ కృతభీకరాక్రంద • దారుణంబు
నచ్చరలు గాంచి రత్తఱి • నసురపురిని. 71

కపులు లంకలో నలుదెసలఁ బరుగిడుట.

గీ. సాంపరాయిక సంరంభ • జాత వేగ
ధావమాన వనాట సంతాన సుదృఢ
సక్థిఘాత విశీర్ణాద్రి • సానురూఢ
భూజ నికరంబు గూలెను • భూతలాన. 72

రావణుని గజవ్యూహ రచనను జెప్పుచున్నాఁడు.

గీ. రచిత సన్నాహ వారణ • రమ్యశృంగ
సంస్థితుల రాత్రిచరులను • చదలు ముట్టు
సిడములు గలట్టి నిశిచర • సేనలపుడు
దుర్గసాలాంతరితములై • దూరమందు
జూడబడె నద్రిచరులచే • జోద్యముగను. 73

కపుల పరస్పరాలాపములు.

గీ. వాయుమార్గానుసారులై పలుదెసలకు
విరిసి తరుభంగ నినదాన విషమమహాచు
రాక్షసాగమసూచక రమ్యవార్త
లద్రిచరులెల్ల దమలోన నాడుకొనెడు
కలకలధ్వని దిక్కులఁ గ్రందుకొనియె. 74

లంకాపరిఘా తటభంగముం జెప్పుచున్నాఁడు.

గీ. దళితమాణిక్యమయతటస్థలము లౌచు
నికట వివరాళి పర్యస్త శకములయి
కపివరధ్వస్త పరిఘలు కలుషితాంబు
విసరతను బొంది నిర్ఝరవితతియయ్యె. 75

లంకాగోపురాతిక్రమముం జెప్పుచున్నాఁడు.

గీ. చిరసముత్పన్నములు జన్యసీమనుండి
కాందిశీకతనొందిన క్రతుభుగీశు
పాదవిక్షేపములు ప్రాంశు బహుళ గోపు
రాట్టవిధ్వంసనోద్యత్తులైన కపులు
మాయఁ జేసిరి రావణు మది కలంగ. 76

పరిఘా జలక్షోభము.

గీ. క్షణవనాట సమూహ విక్షురిత ఖేయ
తోయపూరప్రశాంత నిర్ధూయమాన
పంక్తికంఠప్రతాపంబు భగ్నహర్మ్య
శిఖర సంబద్ధకేతు విక్షేపమయ్యె
నసురపురి లంక నాశంబు నందె నపుడు. 77

పరిఘావేష్టనముం జెప్పుచున్నాఁడు.

గీ. నిస్తులప్రాంశుభూధరనిభశరీర
నికట సంస్థిత వానరానీకవృతము
పంక్తి కంఠునినగరంబు ప్రాఁల ఖేయ
యుగ సమావృతమైయున్న వగిది దోఁచె. 78

కపులు ద్వారమునతిక్రమించి ప్రాకారము నెక్కిరి.

గీ. సకలపరిఘావరోధంబు సలిపి నగర
మొక్కసరి సైన్యమంతయు నుక్కుమిగిలి
లంక పైఁబడ గోపురలంఘనంబు
జేసి ప్రాకారవలయంబు శీఘ్రమెక్కి
మండలాకారమైయుండె మర్కటాళి. 79

అదిచూచి యితరవానరులుకూడ బ్రాకారమెక్కిరి.

గీ. అంత రెండవవారిధి ననుకరించు
పరిఘపై నవరగిరి సేతువిరచనంబు
జేసి యన్యసువేలాద్రి వాసిగలుగు
సాలవలయంబు దాఁటిరి సరవి గపులు. 80

రాక్షసబలప్రయాణముం జెప్పుచున్నాఁడు.

గీ. కపులు ప్రాకారమునుదాఁటి కడక బోవ
వానరాక్రాంత రావణస్థానమందు
క్షయ కృశాను విధూనన క్షుభితపయోధి
జలము ధరపైని వ్యాపించు చంద మొప్ప
రజనిచరసైన్య మత్తఱి రణము కేఁగె. 81

నికుంభుని యుద్ధప్రయాణము.

గీ. సన్నిహిత దంతిలంఘన సరభసములు
యుగవిఖండిత కేసరయోగములును

నైన శరభంబు లమరిన ✽ హారిరథము
నెక్కి చనియె నికుంభుఁ డ✽హీనగతిని. 82

వజ్రజంఘుని యుద్ధప్రయాణము.

గీ. కష్టమునఁ దొడిగి కవచంబు ✽ కార్ముకేషు
దంశములఁ బూని కీశుల ✽ దళమునెల్ల
నేనె పరిమార్తునని మది ✽ నిశ్చయించి
చాపసృష్టప్రాణాన్నాశ్వ ✽ సంఘుఁడగుచు
జనియె జవమున నపుడు వజ్ర✽జంఘుఁ డనికి. 83

ఇంద్రజిత్తు యుద్ధప్రయాణము.

గీ. చలిత బహుకేతనాంశుక ✽ చారుదీప్తి
భర్మమయ వేశ్మ భిత్తి స✽వతుఁ దీప్త
కూబరాంచితమైనట్టి ✽ గొప్పరథము
నెక్కి పాకారిజేతయు ✽ నుక్కుమిగిలి
వెడలె సంగ్రామభూమికి ✽ వేడ్కమీఱ. 84

ఇంద్రజిత్తునిగుఱ్ఱములం జెప్పుచున్నాఁడు.

గీ. క్షణ పరిగృహీతపంచాస్య✽కాయములయి
క్షణ వినిర్మిత కుంజర ✽ కాయములయి
క్షణ విడంబిత సైరిభ✽కాయము లయి
క్షణ మహీధర రూపంబు ✽ గల్గి క్షణము
జలధరము లౌచు నింద్రజి✽త్స్యందనాశ్వ
వితతి వహియించె రథమును ✽ వివిధగతుల. 85

రాక్షసయోధు లొకరితో నొకరు చెప్పక
యుద్ధమునకుఁ బోవుట.

గీ. కలసి రణమున కరుగంగ వలె నటంచు
నాన యిచ్చిర భటులు నిజాజ్ఞమీఱి
రచిత కోలాహలధ్వని నించితుంగచు
దనుజవీరులు కలనికి దఱలి రపుడు. 86

ఆకాలమందు సేనలను తయారుచేయుట.

గీ. కవచములు దొడ్గుచుండెడి గాలిబంట్లు
గుంపుగాఁ జేర్పఁబడుచున్న కుంజరములు
సద్ధసల్యాణములు మహో యుద్ధహారులు
గలిగి నిశాచరసైన్యంబు వెలిగె మిగుల. 87

సైన్యము బయలుదేరుట.

గీ. దంతిగతులైన దనుజులు దాశరథిని
రథగతుని రాముతమ్ముని రవితనూజు
నశ్వగతు లంజనాపుత్త్రు నన్యకపుల
దక్కయోధులు తొడరంగ దలఁచి సమర
కర్మ బదరింపనేగిరి కలని కపుడు. 88

సైన్యముయొక్క నిష్క్రమణప్రకారముం
జెప్పుచున్నాఁడు.

గీ. స్యందనావళిఘట్టన స్ఖలితగతియు
గోపురాస్యచయాభవత్కుంభిఘటయు
భవనమధ్యప్రవేశన వ్యాకులంబు
నగుచు దానవబలమెల్ల ననికి నడచె. 89

రథములు పైకివచ్చుట.

గీ. వక్రియుగకోటి విఘటితశ ద్వార ఘటిత
పృథుకవాటంబు లుచ్చైస్స్వన శ వినత కేతు
నికరములు రాక్షసావళి శ వికట రథము
లుర్వి కంపింపఁ జనియె సశముద్ధతముగ. 90

భూమికి భారము హెచ్చైనది.

గీ. పాతితాశాగజేంద్రంబు శ భగ్న మూల
ఫణిఫణవ్రాత మాహతశఫణి పదంబు
దనుజసైన్యంబు దుర్భరశతా విషహ్య
మైన నికముందు లఘువగుశసంచు పుడమి
సంతసించెను శ్రీరాముశచాప మహిమ. 91

అర్ధబలనిర్గమముం జెప్పుచున్నాఁడు.

గీ. సైన్యములకెల్ల నగరసంశస్థను భజించి
మధ్యమున ద్వారముఖ రుద్ధశమానమగుచు
భరిత రథ్యాముఖంబయి శ బహుళ దనుజ
సైన్యమేగెను జవముతో జన్యమునకు. 92

సైన్యము పైకి వెడలుట.

గీ. ద్వారదేశ ప్రపుంజితోశద్దాను మగుచు
దానవానీకమిట్లు సాంశద్రతను బొంది
యేకమార్గదరీముఖశరోక గళిత
సమతలోత్తానితావగాశచ్ఛాయమైన
నదిని బురుడించి చనియెను శ గదనమునకు. 93

లంక సేనాశూన్యమగుట.

గీ. యుద్ధభూమికి రాక్షసయోధులెల్ల
జనగ వారిగృహాంగణ సముదయంబు
పూర్ణశుష్కనదీగత పులినశోభ
మయ్యె నత్తఱిలేకుండ నలబలంబు. 94

కపిసైన్యము రాక్షససైన్యమున కెదురుగాబోవుట.

గీ. లంక ముట్టడివేయంగ శంక లేక
సింహనాదార్భటులచేత క్షితివడంక
ద్వారనిర్యన్మహాసురధ్వజిని జూచి
ఖర జగత్ప్రాణవిక్షేప పరుషమైన
వనదవమువాడ్కిఁ గదలెను వనచరాళి. 95

రాక్షసబలసంచారక్రమముం జెప్పుచున్నాఁడు.

గీ. ప్రహరణాభీల నిర్గత పత్తిబలము
పార్శ్వసంచరదాశ్విక భట నికరము
ముక్తనిశితాంకుశవ్రాత ముఖ్యగజము
శిథిలతవ్రగ్రహాశ్వౌఘ రథ నికాయ
మగుచు వర్ధిల్లెఁ గ్రమముగా నసురబలము. 96

కపిసైన్యసంచార క్రమముం జెప్పుచున్నాడు.

గీ. ఏకరీతిక్రమాగతాహీన వేగ
మనవహీన మహాధైర్య మైకమత్య
శోభితము పాదవిన్యాస క్షోభవిధుతి
భూతలము వానరబలంబు వోయె ననికి. 97

ఉభయసైన్యసంఘట్టనముం జెప్పుచున్నాఁడు.

గీ. శ్లాఘ్యసంగ్రామ శౌటీర్యసంపద లయి
వీరభటులెల్ల శాత్రవసంహారణంబు
సేయదొడఁగిరి రిపులచేఁ జిక్కి నిహతు
లైరి పలువురుజోదు లాహవమునందు
విడచి ప్రాణానురాగంబు విపులయశము
గోరి పోరుచునుండిరి కొందరపుడు. 98

ఆంధ్రసేతుబంధ మహాకావ్యమునందు
ద్వాదశాశ్వాసము ముగిసెను.



# ఆంధ్ర సేతుబంధ కావ్యము.

## త్రయోదశాశ్వాసము.

---

వానరరాక్షసులకు ద్వంద్వయుద్ధము.

గీ. అవుడు నిర్గమమిళితులై యద్రిచరులు
రజనిచరులును ముక్త భైరవ నినాద
దారితాఖిల దిక్తటీదంతికర్ణు
లగుచు ద్వంద్వాహవమున కాయత్తులైరి. 1

వెనుకవచ్చినవారి వ్యాపారముం జెప్పుచున్నాఁడు.

గీ. యుద్ధలాలసులైయున్న యోధవరులు
పాతితానేకభటదేహ పంక్తులనయి
చరణ విన్యాస మొనరించి చయ్యన జని
ఖడ్గనిహతులఁ జేసిరి క్రవ్యభుజుల. 2

భటుల శీఘ్రకారిత్వముం జెప్పుచున్నాఁడు.

గీ. దనుజవీరులు మనములోఁ దలఁచినట్లు
నిబిడధూళి విదూషిత నేత్రులగుచు
బవరమందు విపక్షుల ప్రహారణముల
నుగ్గుచేసిరి ప్రేక్షకు లుగ్గడింప. 3

భటుల తేజఃప్రకర్షముం జెప్పుచున్నాఁడు.

గీ. శాత్రవవ్యూహ సంప్రాప్తి సముధికాసు
గతులు ముషితగృహీతోరు ఖడ్గలతులు

హాత విశేషవరానీక • శతులు జన్య
ప్రహృతివిషయులు సుభటులు • భంగపడరు. 4

ప్రహృతగజముల వైకల్యము.

గీ. ప్లవగ నిర్దయకరఘాత • పాతితములు
మందముఖఘూర్ణనాలిప్త • సిందురములు
కుంభతటఘాత సంభగ్న • కుజములైన
కుంభిగణములు తరువులఁ • గూలఁద్రోసె. 5

రావణుని గురించి యుద్ధము దురంతమగుట.

గీ. దాశరథ్యుగ్రరోషంబు • దానవేంద్రు
మస్సహాసంగ వికృతియు • దూర గతము
సుభయమున కొక్క సమయాన • నుచితమైన
దారుణంబగు పరిణతి • దారసిల్లె. 6

యుద్ధపరిణామము దారుణమైనది.

గీ. వారణంబుల చేతను • వారణములు
వారువంబుల చే గొప్ప • వారువముల
రథికవరుల మహారథ • వ్రాతములును
ప్లవగులకు దనుజ సైన్యంబె • ప్రహరణంబు
ప్రహరణీయంబు నుభయమై • పరిఢవిల్లె. 7

రాక్షస పౌరుషముం జెప్పుచున్నాడు.

గీ. శరవికీర్ణ మహీధర • చయులు ముద్గ
రాభిహత శైల శకలుల • వ్యాహతాజ్ఞి
లాహవ విశారదులు ఖండి • తాద్రిచరులు
సగుచు నసురులు పోరాడి, రాగ్రహమున. 8

కపుల ఆకారస్థౌల్యముం జెప్పుచున్నాఁడు.

గీ. విస్తృతాద్రి పరీణాహ • వికటమైన
వానర స్కంధమున మహా • వారణములు
స్థూలశుండాగ్ర భాగంబు • జుట్టఁబెట్టి,
గడమనడి గొంతభాగంబు • గానవచ్చె. 9

రాక్షసుల వక్షోవిక్షోభముం జెప్పుచున్నాఁడు.

గీ. వనచరోగ్ర మహాకోప • పాతితంబు
దనుజ పీవర వక్షంబు • దాఁకి యపుడె
భగ్నమై రజము మీఁదకు • బాఱె శిలలు
భూతలంబునఁబడియెను • పొలుపుఁ బాసి. 10

రెండుబలముల సాధారణోత్కర్షం జెప్పుచున్నాఁడు.

గీ. అరిచమూ మధ్యపతిత నిరా • యతనులు
సతత సూదిత నిపతిత • సర్వభటులు
లోకసంస్తుత్య రణవిక్ర • మైకగతులు
భటులతోఁ బ్రవలు చూడ • దుర్భరములయ్యె. 11

మఱల దానినే చెప్పుచున్నాఁడు.

గీ. యుద్ధ శౌండీర్య మెంతయు • వృద్ధినొందె
ద్విట్ప్రహారమనాదృతి • విషయమయ్యె
నంత కంతకు హెచ్చైన • రానుబంధ
మతిశయిల్లెను ప్రీతి సా • హసముల... 12

మఱల నా యర్థమునే చెప్పుచున్నాఁడు.

గీ. పతితమైనను శిరముక్కిక • బంధ మిలను
పడదు కత్తినిఁ బొడిచిన • వెడదయురము

భిన్నమునుకాదు శత్రులు ♦ భీతిరసము
గొలిపినను వీర మనముల ♦ గలుగ దెపుడు. 13

మఱల దానినే చెప్పుచున్నాఁడు.

గీ. వీ-భటులెల్ల శత్రుప్ర♦హారములను
దర్పహర గరిష్ఠులై ♦ సైచి పరుల
కభిముఖం బౌట నిర్భయా♦ధ్యవసితంబు
పైకిఁ జనుటయు నిసుమంత ♦ భయముకాదు
యుద్ధసౌకర్యమున కద్ది ♦ యుచితమగును. 14

కపుల పతనావస్థం జెప్పుచున్నాఁడు.

గీ. అసుర మాతంగదంతప్ర♦హారభిన్న
గాత్రపతితులు రోష వి♦కంపితోరు
కేసర సమూహములును ద♦ష్టకీర్ణదంత
మూలులయి మత్సరంబున ♦ మొఱ్ఱలిడుచు
విడిచి రసువులు వానర♦వీరభటులు. 15

మఱల శూరులగొప్పతనముం జెప్పుచున్నాఁడు.

గీ. ఎఱుగ రవధీరణము వీరు ♦ లించుకైన
ప్రాణసంశయ మొందిన ♦ ప్రభుప్రసాద
మెపుడు మరువరు మదిలోన ♦ హెచ్చులజ్జ
గలిగియుందురు వినిపాత♦ముల గణింప
రదిప్రచర రాత్రిచరవీరు ♦ లాహవమున. 16

కపుల తేజగినప్రకర్షముం జెప్పుచున్నాఁడు.

గీ. కపివ్యథుగ్బద్ధలక్ష్ములు ♦ క్షుర దపార
శోణితాపాండురాంగులు ♦ శోధన ప్ర

పాతవేదను లాహవ • పారదృశ్వ
లద్రిచరు లసురులను నంత•కాస్పదమున
కంపిరప్పుడు, పోరాడి • యాహవమున. 17

శూరుల స్వభావముం జెప్పుచున్నాఁడు.

గీ. శూరులగు వారికుండదు • దూరదృష్టి
సౌష్టవము! శాత్రవోత్కృష్ట • చర్యలెపుడు
నైన రెంతయు నసహన•స్వాంతులగుచు
నిర్వహింతురు తమమాట • నేర్పుతోడ. 18

శూరులయుద్ధముం జెప్పుచున్నాఁడు.

గీ. దివ్యవనితారతిప్రాప్తి • నవ్యగృహము
భగ్నయమలోకమార్గంబు • పాకవైరి
భవన ఋజుకాయతపథంబు • వానరాళి
దైత్యసంగ్రామ మిబ్భంగి • దారుణమయి
చెలఁగె దేవాసురాస్ఫోట • తులితమగుచు. 19

గీ. వానరానీకవక్షఃక•వాట పీఠ
పరిణతాత్మీయముఖభగ్న • కరిరదంబు
తెగిన సుభటాళి వరణావతీర్ణదివ్య
కామినీహస్తకంకణ • కంప ముఖర
వానరానీక సంబాధ • యానపథము. 20

గీ. ఉత్ప్లవనభగ్నరథబృంద • మూర్ధనున్న
విఘటమానగజేంద్రంబు • విద్ధసప్తి
యనుగతానోకహ విచరద్ఘ్నని కాయ
శాతనఖదీర్యమాణ ని•శాటకులము. 21

గీ. చందనావనిజాత రసాక్తబాహు
మధ్యసుఖసహ్యమాన సుమందవాత
కలకలధ్వాన జని సముద్ఘాటితాస్య
కుహరనిర్గచ్ఛదంబకకోటియుతము. 22

గీ. తరుచరానీకవారిత దంతిఘటము
రుద్ధనిర్గత చక్రిత • విద్ధపత్త్రి
యధికరక్త ప్రభిన్న శతాంగపథము
శుష్కఫేనౌఘముఖజాత శూన్యహేషి
తాశ్వసముదాయహర్షదమై చెలంగె. 23

గీ. శత్రుహింసన తోషిత సాధుకార
రావ గర్భిత నిపతచ్ఛరంబు శత్రు
ప్రహృతి నిర్భిన్న మూర్ఛిత భట ముఖాంత
రాళ శిథిలిత ఫూత్కారరవయుతంబు. 24

గీ. క్ష్మాధరాఘాత భీషిత స్థాపితోరు
దంతిసంచయరుద్ధపదాతిగణము
భగ్నకేతనచిహ్నసంపాత ఘుషిత
సైనికజ్ఞాత సురుచిర స్యందనంబు. 25

గీ. భూధరప్రేరితానేక యోధవర్య
రథ సమాకర్షణాయాసరక్తవమథు
మిళితఫేనౌఘ దంతుర మీలితాస్య
వీత వితతియునై యొప్పె భూతధాత్రి. 26

గీ. కపివరక్షిప్త చూర్ణిత క్ష్మాధరాఘ
జ్ఞాయమాన సరిన్మార్గ మాయతాసి
ఖండ్యమాన నిశాచరకాండ ముద్య
దసురయోధవిదారి తాహార్యచరము. 27

గీ. ధావమానాద్రిపరముక్త । పీవరాంస
లంబమాన నిరాయత । లలిత కేస
రాళి మధ్యాంత నిపతిత । శూలఘాత
మారితాశేష రాక్షస। వారణంబు. 28

గీ. కరగృహీత నిశాచర । ఖాద్యమాన
వానరానీక శీర్షంబు । వక్రదశన
దశ్యమానాయతాక్రోడ । దైత్యవితతి
కృత్తబాహూరుకర్ణంబు । కీశకోటి. 29

గీ. మాతహస్తతలాఘాత । పాతితోత్థ
వాజిసంఘ సమాకృష్ట । బహుళరథము
బాణఘాత విచూర్ణిత । పతితశైల
పీతరక్తస్రవంతికా । జాతమయము. 30

కపి రాక్షసబలముల యావర్తనముం జెప్పుచున్నాఁడు.

గీ. ఒకరియుత్కర్ష నింకొక । రోర్వలేరు
విజితులై కొందరత్తఱి । వేగిరించి
పఱచిరాహవభూమికి । వదలి మోము
లెత్తకయె లజ్జ శత్రుల । యెదుటనుండి. 31

రాక్షసుల విజయం జెప్పుచున్నాఁడు.

గీ. వానరానీకఖండిత । ప్రబలతనులు
నధిగత లక్ష్య సంప్రేషిత । తాసిహతులు
మూర్ఛదోగుచుఁ గన్నులు । మూసికొనెను
దానవులఁ జైకిదీసిరి । తజ్జనాళి. 32

ఉభయసైన్యములందు శరీర నిరపేక్షముగఁ బోరాడుట.

గీ. యుద్ధచాతుర్యమున సుసమిద్ధవీర్య
మభినవచ్ఛాయసుప్రభాతుల । నాప్తజనుల

విక్రమంబుల జీవాస । సక్రమాభి
మానమును గాయనాశాన । మహితయశము
గాచుకొని రాజి వీరులు । కపి దితిజులు. 33

రాక్షసుల యుద్ధాభిలాష.

గీ. కొండదెబ్బలఁ బగిలెను । గుండెలాజి
హృదయ మెప్పటియట్లుండె । పిరిదుల లేదు
రథము చెడెగాని హెచ్చె సంగ్రామదీక్ష
ఖండితములయ్యె శిరములు, । గాని భటుల
యాహవోత్సాహమేమియు । నడఁగ లేదు. 34

మొదటిపుట్టినధూళి శాంతించుట.

గీ. యుద్ధభూమి సముద్భూత । వృద్ధరజము
గగనమున శైల నిర్ఝర । గణముచేత
క్షతజబిందుహాక్షితంబయి । క్షితితలాన
గజఘటలయందు మదవారికణ వితతిని
శాంతినొందెను జయ్యాన । సైన్యములర. 35

కపుల భుజభంగముం జెప్పుచున్నాడు.

గీ. పోథ ఖడ్గప్రహారముకల్పురుచి రేఖ
దంతముసలాగ్ర ఘర్షణ । దారితములు
పర్వతోత్క్షేప సంజాత । వక్రిమములు
ప్లవగభుజములు ఖండింప । బడియె నాజి. 36

పక్షుల రుధిరత్యాగము.

గీ. అతి పిపాసితమైయున్న । పతగ మాజి
గవచ శకలావృతంబయి । క్షతములోని
రక్తమొకకొంత రుచిజూచి । రక్తి లేక

రూఢ లోహాతి సంస్పర్శ * రూషితములు
రుచివిహీన మటంచును * రోయ దొడగె. 37

కబంధముల వేగము.

గీ. ఖండితంబైన బాహువు లగ్రములఁ జొచ్చె
లోన ముఖములఁ గోప విక్రలుప్తి లేదు
కృత్త శిరము కబంధంబు * కీర్ణ రక్త
ధారతో నేల బరుగిడె * దారుణముగ. 38

రణరసముం జెప్పుచున్నాఁడు.

గీ. వైరిదత్త ప్రహారంబు * వీరతతికి
నిచ్చె నుత్సాహ మెంతయు * హెచ్చు వైర
బంధమభివృద్ధి నొందించెఁ * బటు పరాక్ర
మంబు సంగ్రామ రసభంబు * మానిసులకు. 39

భటులయుద్ధమందు కాలఁజేసిన సహిష్ణుతం
జెప్పుచున్నాఁడు.

గీ. యశము సాధించుకని లోన * సహితుని వలె
జాగు సైచడు రిపుకృతచ్ఛలము వీడి
సౌఖ్యమును గోరునట్లు నాశంబు గోరు
నాయుధము వీడినట్టుల * నాత్మ విడుచు
భటుడు సంగ్రామరతుడౌచు * బవరమందు. 40

కపుల మూర్ఛావస్థ.

గీ. పోఢ ఖడ్గ ప్రహారుల * చ్యోత దధిక
శోణిత-క్లాంత నిస్సార * శుష్క భుజులు
దనుజ మారణ విక్షిప్త * ధరసమూహ
పాత నిర్భిన్న గాత్రులై * పడిరి కపులు. 41

ఉభయ సైన్యవీరుల జీవిత నిరపేక్షతం
జెప్పుచున్నాఁడు.

గీ. మానమును రక్షసేయు సుక్షేమంబు పగిది
విశ్వసింపరు సంవృద్ధ కీ విమల కీర్తి
జీవలోకాదృతంబైన కీ జీవితంబు
తృణముగా జూతురని లోన కీ ధీరమతులు. 42

గీ. నిహతగాఢ మహాయోధ కీ నిచయముగల
సైన్యభర మంతకంతకు కీ క్షయమునొంద
వర్ధమాన మహారణ కీ భారముగల
దళము లెదిరింపసాగిరి దక్షులపుడు. 43

గీ. కీర్తిధురమును లక్షింత్రు కీ కీర్తి పరులు
బాహు విక్రాంతి కేతెంచుఁ బరిభవంబు
నింక కంతయు నోర్వరు కీ హెచ్చు రోష
మాత్మ నిలుపుదురెల్లప్పు కీ డధిక బలులు. 44

గీ. కత్తి వాటుల గల్గించు కీ గాఢ సుఖము
మూర్ఛలో నున్న సమయాన కీ ముషిత యుద్ధ
విజయవాంఛ నిజప్రాణ కీ విత్తలబ్ధ
సురవధూజన సంప్రాప్తి కీ శోభితంబు
నైన కదనంబు రెండుసైన్యముల కయ్యె. 45

గీ. వ్యసనములయందు సాహస కీ వ్యవసితులను
సాభిలాషులు జీవిత కీ సంశయాన
సమితరతులైనవారలు కీ హర్షులత్వ
మొందుదురు మూర్ఛదశలందు కీ సుభటులు. 46

యుద్ధపరాగమును వర్ణించుచున్నాఁడు.

గీ. కరితురంగమవానరా - సురచమూత్థ
ధాత్రిరజమెల్ల నూర్ధ్వప - థంబు కేగనె
సర్వభిన్న దినంబునఁ - బద్మినీశుఁ
బట్టబోయెనో స్వర్భానుఁ - డెట్టి వింత
రాత్రి యాకృష్టమయ్యెనో - రవి వెలుంగ
ననుచు శంకించి రిలగల్గు - జనము లపుడు. 47

గీ. సాంద్రమైయుండె నుద్ధను - స్థానమందు
మధ్యవైరళ్యమొందె న - మర్త్యజగతి
పుంజితంబయ్యె దిక్కుల - భూరి రజము
విస్తృతంబయ్యె జగమున - వివిధగతుల. 48

గీ. విడుచుచున్నది భూమిని - వేయిగతుల
దెసల కేగయునుఁ గప్పును - దిగ్వితతిని
తొలఁగిపోవంగఁ దెఱువేమి - తోఁచదెద్ది
సక్తమయ్యెను చదలున - సాంద్రరజము. 49

గీ. ప్లవగయోధాన్వితంబు కపి - పాటసైన్య
మవనిధూళిచ్ఛటావృత - మగుచు నపుడు
మంచుచే నావృతంబైన - మణిధరంబు
మోల నిల్చిన చాడ్పున - ముద మొసంగె. 50

గీ. ధూళిధూసరకేతన - తూలపటము
మలినితాశ్వముఖోద్గత - మంజుఫేన
మంబరంబున వ్యాపించె - నధిక మగుచు
భూరజోనివహ మప్పుడు - ముంచె జగము. 51

గీ. ప్లవగ శార్దూల రభసావపాతితాభ్ర
పథ నిపతితాద్రి మార్గానువర్తియైన
ఖగముఖాఖప్రకాశంబు కలుషమగుచు
సాధవహదంబుధారా సుసామ్యమూనె. 52

గీ. కుపితదానవవీరులు కుజచశాఖ
మాంసలాంసప్రదేశ నిమజ్జితాసి
స్రావనరక్తాక్త ధారాగ్రదష్టరజము
సాంద్రమధుకోశ సన్నిభచ్ఛవి వహించె. 53

గీ సమర వసుధాంగణస్థలీ భ్రమణ విహ్వా
లములు చండార్కకిరణ సంక్రాంత మీలి
తాక్షములు సామజేంద్రంబు లాస్యరేణు
పుంజమును శీకరాంబువు బోసి తడిపి
తాపశాంతి నొనర్చెను తత్క్షణమున. 54

గీ. రక్తనదులున్న చోట భూరజము పైకి
నెగరజాలదు లేనిచో నెగురుచుండు
భూమిపై విరళమైయున్న బోయిపైకి
గలియునా రెండుధూళులు గగనమందు. 55

గీ. దంతి చూత్కృత తిర్యక్ప్ర ధావితమయి
రథనికాయ ధ్వజాంశుక గ్రస్తమగుచు
సర్వతోదిక్కమైపోవు నుర్విరజము
ననిల మంబర పథమున కనిచె నపుడు. 56

గీ. సమర వసుమతి నెదురుగా జనెడు దంతి
దృష్టి పథమును గప్పుచు దీర్ఘరజము
మారుతాకంప్య మానమై మారికగాల
వదన సన్నిధి ముఖపటా భంగిబూనె. 57

గీ. అంత వీర భటాళి నిర్ఝరాయితాతి
కఠిన వక్షోవ్రణ ద్వార * గళిత రుధిర
సింధుజాలంబుచే నెల్ల * క్షితి రజంబు
కూల వృక్షము గతివడి * గూలిపోయె. 58

రజశ్శాంతిం జెప్పుచున్నాఁడు.

గీ, ప్రలఘు నీహారనిభము సంబద్ధ కమల
కాండసూత్రాభ మిషద్వి * ఖండితంబు
వాయునున్నంబు ప్రశమిత * ప్రాయమగుచు
దెసల ధూళివ్రజంబు శాంతించె నపుడు. 59

గజములు పడిపోవుట.

సీ. రుధ్యమానస్జ మార్గంబు * బధ్యమాన
క్ష్మాధరాంతర సువిభక్త సరిదపార
వారి శాఖాయుగంబును * మిఱి పవన
ధూత కేతన వనసౌఘ * మాతతంబు
పతిత గజబృంద మధ్యాన ♦ బలము నడచె. 60

సీ. ప్రోథ దుస్సహ రిపుశస్త్ర * సూదితములు
బహుళ సంగ్రామ భార నిర్వహణ చిహ్నలు
మథిత దుర్గమ మార్గులు * మాని త్రొక్కి
పతి సమాదేశులవనిపైఁ * బడిరి కపులు. 61

యుద్ధసమృద్ధిం జెప్పుచున్నాఁడు.

గీ. బంధు వధ బద్ధ వైరంబు * పతిత వీర
శత సహస్ర కళేబర * సంకులంబు
శీర్షహీన కళేబర * శేషప్రనృత్య
ప్రీణితాశేష వీరంబు * పెద్ద యుద్ధ
మపుడు జరిగెను కపి రాక్ష * సాళికటల 62

నక్కల సందడి.

గీ. దనుజవీరుని మణిబంధ • దత్తకవచ
ఖండ వలయిత బాహువ • ఖండ భార
దుర్భరంబని చింతించి • తోలనమున
శక్తిహీన సృగాలంబు • చాలదయ్యె. 63

రక్తనదీ ప్రవాహముం జెప్పుచున్నాఁడు.

గీ. శోణితావర్త నిపతిత • శోణవర్ణ
శోభితంబులు పార్శ్వ సం•స్యూత రక్త
ఫేనపిండంబు లార్ద్రితా•బృంహితములు
చామరంబులు మునిగెను • క్షతజ నదుల. 64

గజముల దురవస్థం జెప్పుచున్నాఁడు.

గీ. ఊర్ధ్వముఖ ముక్త నాదంబు • లూర్ధ్వభాగ
భారయంత్రిత పశ్చిమ • భాగ యుతము
లైన గజములు వానర • హస్తముక్త
దృషదనీక నిఖాతోర్ధ్వ • తీవ్ర సృణులు
గలుగు కుంభంబుల గదల్చె • కదనమందు. 65

రాక్షసులు పారిపోవుట.

గీ. యుధ్యమానాద్రి చరఘాత • మోర్వలేక
దానవారి పరాభూతి • దాన దక్షు
లగు నిశాచర యోధు ల • హంకృతులను
లజ్జ విడనాడి యదియె ప•లాయనంబు
మొదటిదన బారి రసురులు • మోదమెడలి. 66

సైన్యపరావృత్తిం జెప్పుచున్నాఁడు.

గీ. భగ్న పరివర్తిత గజంబు • ప్రథన భూమి
ప్రతి సమానీత రథతతి • భగ్నపత్తి

మండలీదత్త తురగంబు • హిండమాన
సైనికము దనుజసైన్యంబు • చలితమయ్యె. 67

సైన్యములు పారిపోవుట మరల జెప్పుచున్నాఁడు.

గీ. తొలి సమర్షము బోనాడి • తొలగి పోవ
ద్రుమదర ప్రేరణంబున • ద్రుత గతులయి
రజనిచరవీరులెల్లరు • రణమువీడి
ప్రాణతృష్ణా పరీతులై • పఱచి రపుడు. 68

రాక్షసుల పలాయనావస్థం జెప్పుచున్నాఁడు'

గీ. రథయుగాసజ్యమాన తురంగములు
తురగ పృష్ఠసలద్యోధ • వరశతంబు
యోధ పరివర్తితోద్దండ • యుద్ధ గజము
గజ ఘటాభగ్న రథసంక్తి • గహనమగుచు
దైత్యసైన్యంబు ఘూర్ణిల్లె • దైన్యమంది. 69

గీ. గురు క పీవర భుజయుగ్మ, కులిశ భగ్న
పృథుల భూరుహ ని హతారి • వీరమగుచు
విహ్వాలావసరదీ్భత • వీరదైత్య
మదిరచర సైన్యమత్తటి • నధిక సుఖము
నొంది నిట్టూర్పు నిగుడించె • యుద్ధభూమి. 70

రాక్షసులు పారిపోవుటను దిరిగి చెప్పుచున్నాఁడు.

గీ. సమర దుర్ధర్ష భుజవీర్య • సాహసికులు
కపివర ప్రవర్తమాన భంగావసరులు
భగ్నులైనను రాక్షసుల్ • భయము గొనక
సంచరించుచు నున్నారు • సమర కాంక్ష. 71

రాక్షసుల పలాయనమును జెప్పుచున్నాఁడు.

గీ. యోధవరులెల్లఁ గరసంజ్ఞ • యుద్ధమునకు
బిలుచుచున్నను కపిసైన్య • భీతులగుచు
మానము గణింపకయె వీర•మానులైన
క్రవ్యభక్షులు కాందిశీ • కతను గనిరి. 72

గీ. వానరౌఘ పరాఙ్ముఖ • పటు నిశాట
వితతి కపిబల కలకల • భీతచపల
హస్తి పృష్ఠచ్యుతానేక • హస్తిపకము
ధావమానాశ్విక వ్రాత • తరళ బలము. 73

గీ. తరళ మర్కట నికరాను • ధావితాశ్వ
నూగృహీత చలద్వాల • మవక్రికంపి
తాశ్వ సంకృష్యమాణ శ•తాంగ మధి
చరభటా హత సారథి • సముదయంబు. 74

గీ. ఆజిభూమిక్షోనిపూదిత • యాతుధాన
సైన్య విరళిత మార్గంబు • శైల చరులు
పోయి రవ్యాహతంబుగఁ • బోటు బంటు
లని విపక్షులు వొగడంగ • ననియొనర్చు. 75

రాక్షసుల పరావృత్తి.

గీ. త్యక్తమాత్సర్య లఘువులు • త్యక్తలజ్జు
లాత్మ నిపతిత దశకంఠు • లాజి భయము
వదలి క్రమ్మర సంగ్రామ • బద్ధ దీక్షు
లగుచు మరలిరి శత్రుల • కభిముఖముగ. 76

రాక్షసుల పౌరుషమును జెప్పుచున్నాఁడు.

గీ. భగ్న సంహిత కీర్తులు • భ్రష్ట లబ్ధ
పౌరుషోద్రేక రాజితుల్ • మేరలేని

బాహుబవీర్య ప్రదర్శన • పాతితాద్రి
చరులు రాత్రించరులు శ్లాఘ్యు • చరితులైరి. 77

మఱల యుద్ధముం జెప్పుచున్నాడు.

గీ. అపుడు పరిభూతి లజ్జితు లైన దైత్య
భటులకును వర్ధమానోగ్ర • బాహు వీర్య
యుద్ధసంరంభ దుష్ప్రేక్ష్య • యోధులైన
కపులకును ఘోరసంగ్రామ • ఘటనమయ్యె. 78

సుగ్రీవ ప్రజంఘులకు ద్వంద్వయుద్ధము.

గీ. వన్యగజదాన సౌగంధ్య • భరితమైన
సప్తపర్ణావనీజాన • సౌరి సమర
ఖేద మెడలించి సురలోక • మోద మొసగి
సుఖితుఁ జేసె ప్రజంఘుని సురలు వొగడ. 79

ద్వివిదునకు శనిప్రభునకు ద్వంద్వయుద్ధము.

గీ. ద్వివిద విక్షిప్త చందన • వృక్షఘాత
నిహతు డశనిప్రభుండప్డు • నేలగూలె
తదవనీజ సుసంఫుల్ల • తరుణ పుష్ప
గుచ్ఛగంధంబు మూర్కొని • కొఱత లేని
సుఖము చేబలె మూసెను • సౌరిది కనులు. 80

మైందునకు వజ్రముష్టికి ద్వంద్వయుద్ధము.

గీ. భీష్మదృష్టి యుగోద్భూత • వికట వహ్ని
కీలసంస్ఫుటితాక్షుఁడై • కీతిని గూలె
మైందముష్టి ప్రహారాన • మస్తకంబు
వ్రయ్యలై చచ్చెనప్పుడు • వజ్రముష్టి. 81

సుషేణ విద్యున్మాలుల ద్వంద్వయుద్ధము.

గీ. కుపితుఁడైన సుషేణుండు • కొంతసేపు
ఘోరసంగ్రామ హర్షితుఁ • గ్రూర దనుజు
జేసి నిజపాదయుగమునఁ • జిక్క ద్రొక్కి
వాని భుజములఁ జెండెను • వాడి గోళ్ల. 82

నల తపనుల ద్వంద్వయుద్ధము.

గీ. నలుడు తపనాఖ్యదనుజుని • దారుణ తల
ఘాతమున ద్రెంచి తచ్ఛిరగి • ఖండమంత
వానికుక్షిని జొన్పి క•బంధ మవని
జొచ్చునట్లుగ నొనరించె సురలు మెచ్చ. 82

హనుమజ్జంబుమాలుల ద్వంద్వయుద్ధము.

గీ. అనిలపుత్రుండు జంబుమాల్యా•ఖ్య దనుజు
సకల తలగాఢ తాడనో•చ్చలితశీర్ష
రక్తమస్తిష్క పంక సం•రంజి తాను
డగుచు నచ్చోట నెడబాసి • యవల జనియె. 84

అంగద మేఘనాదుల ద్వంద్వయుద్ధముం జెప్పుచున్నాడు.

గీ. ఒకని భటులను మఱియొక•దుద్ధతముగ
శమను వీటికి నంపుచు • శక్తికొలదిఁ
బోరుసలుపుచు జయలక్ష్మి • బొలుపు మీరఁ
దులకు నెక్కించి యంగద • బల నిహూద
నాదులుభయుల సంగ్రామ • మంతకంత
కుత్తరోత్తర వృద్ధితో • నుగ్ర మయ్యె. 85

గీ. వాలిపుత్రుడు నారాచ • వర్షపిహిత
దశదిశాముఖు రావణా•త్మజుని వేగ

బాహుయుగళ సముత్క్షిప్త • సర్వశాలి
గప్పెఁ గపులెల్ల వాఁగడంగ • గడియ సేపు. 86

గీ. కుసుమ నిర్భర విటపోస • గూఢ మధుర
సమ్రములు కీర్ణ ఫలభార • కమ్ర శాఖ
లాయతంబులు లూన మధ్యంబులైన
యవనిజంబులఁ గురిపించె • నంగదుండు. 87

గీ. మేఘనాథుని శరములు • మేఘవాహ
నాత్మజుని పుత్రుదాకక • యంతరాళ
మందె ద్రుమవృష్టిచే నంత • మందె నప్పు
డంగదుని వృక్షజాతంబు • లతని బాణ
సంహతిని ఖండితములౌచు • క్షమను గూలె. 88

గీ. ఊర్ధ్వ విక్షిప్త లోధ్రసు•మోత్కరంబు
దశముఖాత్మజ నారాచ • తాడితోర్ధ్వ
సిత చందన గంధంబు • ధూత కల్ప
పౌష్ప ధూళిచితంబుల • వంగ సరస
దళవితతి గర్భితంబయ్యె • జలద పథము. 89

గీ. అసకృదాత్మీయ సైనికా•ఖ్యాత సాధు
వాద మాస్ఫోట దర్శితా•వంధ్యతుల్య
హస్త మాయుద్ధ మత్తటి • నంగదునకు
రావణికిఁ బేర్చె సురతతి • రంజిలంగ. 90

గీ. తరుసుమాంతర నిర్గత • శర విలగ్న
మధుకర వ్రాత మవముక్త • వ్రథవచలిత
పక్షయుగ సైన్యసంవీక్ష్య•పరుషతగల
యాజి యుప్పొంగె నింద్రజి•దంగదులకు. 91

గీ. రాక్షసాధిపపుత్రి నా • రాచపుంజ
ఛాదితాంబర సంచర • చ్ఛక్రిపౌత్రి
మంగదక్షిప్త భూరుహా • హార్య నికర
రుద్ధజిత దేవపరివృఢా • రూఢరథము. 92

గీ. నిశిచరాసి విఖండిత • నిపతదద్రి
చర సమూహ తనుస్రవ త్క్షతజపూర
కలిత దిఙ్మండలంబు శా • ఖామృగాళి
నఖముఖోత్కృత్త దానవ • ముఖ వినిర్య
దధిక శోణితకర్దమ • మయ్యె నవని. 93

గీ. ఇంద్రజిచ్చాపల వేధజ • రుంధ్రి బాధ
మూర్ఛితాంగద వీక్షణ • మూర్ఛితాద్రి
చర సమూహంబు భూధర • సంఘ పాత
భిన్న రావణి దర్శన • ఖిన్న దనుజ
సంచయంబయ్యె నత్తఱి • సమర వసుధ. 94

గీ. అపుడు తారేయ భుజబలా • హతనిశాట
దౌస్థ్య వీక్షణ సంజాత • దనుజ రవము
దానవేశ సుతాహత • వానరౌఘ
దుఃఖ వర్ధిత రాక్షస • తోష రవము. 95

గీ. ఇంద్రజిద్బాహు నిపతితా • హీన పరిఘ
మంగదుని మీద నిష్ఫల • మైన కపులు
సంతసిల్లిరి యట్లనే • శక్రిపౌత్రి
నుత్త శైలంబె రావణి • నున్న దైన
యురము దాకి విభిన్నమై • యుర్వి గూల
హర్ష మొందిరి దైత్యుల • య్యవసరమున. 96

గీ. అంత దశకంఠసుతు డంగ • దాఖ్యుతోడ
కొంతవడి పోరి గ్లాని చే • కుంఠితాజి
రాగుడై యోసరిల్లెను • రణము నుండి
హతుడు వీడయ్యెనని కపుల్ • హర్ష మొంద
మాయయని యెంచిరసురులు • మనము లోన. 97

అంధ్ర సేతుబంధ కావ్యమునందు
త్రియోదశాశ్వాసము
ముగిసెను.



# ఆంధ్ర సేతుబంధ కావ్యము.



## చతుర్దశాశ్వాసము.

రామవ్యాపారముం జెప్పుచున్నాఁడు.

గీ. అపుడు రాముండు నిష్ఫల • క్షపిత దివసు
డాత్మఁ గోరుచు దశకంఠు • నావహంబు
లంక కభిముఖుఁడై యుండి • లాఘవమున
గడిగె బరిమార్ప దనుజ సం•ఘముల వేగ. 1

రాముని శరతితీక్ష.

గీ. ఆత్మపక్షీయులగు దాన • వాళిసైన్య
మంత గొనిరాడు దశకంఠు•డాజి కనుచు
మనమునం దెంచి రాముండు • మారులేని
విక్రమముఁ జూపి దనుజుల • వేగ దునిమె. 2

రాముడు బాణముల విడుచుట.

గీ. రామబాణ విఖండిత • రాక్షసంబు
గాగ రణభూమి కపులెల్ల • గలక జెంది
చేయునది లేక క్రీడాప•రాయణులయి
వ్యర్థ తిరుకంపన వ్యగ్ర•యత్నులైరి. 3

కపుల వేగోత్కర్షముం జెప్పుచున్నాఁడు.

గీ. వానరాళి విముక్తంబు • లైన శిలల
దాలిని భేదించి యవ్వాల • దునిమె సరుల

రామశరములు కపికోటి • రాక్షసాళి
హననభగ్న మనోరథ౯మాచు వెఱఁగు
తోడ వీక్షించి యేమియు • దోఁచకుండె. 4

మఱల నాయభిప్రాయమునే చెప్పుచున్నాఁడు.

గీ. ప్రహరణాన్విత రాక్షస • బాహుదండ
మినకులోద్భవుశరముల • ననువుతోడ
ఖండితంబయ్యె దనుజుల౯కాండ వితతి
చేరుటకుమున్నె రాక్షస• సేన నపుడు. 5

ఆ యభిప్రాయమునే మఱల జెప్పుచున్నాఁడు.

గీ. రామశరభిన్న రాక్షసో౯రఃస్థలాన
వానరక్షిప్త శిలలెల్ల • బడియె వెనుక
రామశరవంచితాతుల • భీమబలము
గలుగు కీశులు విసరిన • క్ష్మాధరంబు
రామశరపాత పిష్ట శి౯రంబుపైని. 6

గీ. సంతతము రామశరములు • సంహితములు
సంతతము కార్ముకంబును • చక్రవిధము
సంతత ముపాత్యమానారి • సైన్యశీర్ష
నికరముల భూతలంబెల్ల • నిండఁబడియె. 7

గీ. విషము సంలగ్న హుతవహ • భీషణములు
విషధరత్యక్త బిలముఖ • విస్తృతములు
బాణనిర్గమమార్గముల్ • బహుళ దైత్య
కాయములయందుఁ గన్పట్టె౯గాని రాము
తనువుసందించుకంతయుఁ • దాఁకలేదు. 8

మఱల నాయభిప్రాయమునే చెప్పుచున్నాఁడు.

గీ. శరము సంధించు దైత్యుల • కరములందు
వనచరులు వధ్యులని యెంచు • వారి పైని
యరచుచుండెడివారి యా • స్యముల యందు
దనుజ శీర్షనిపాతన • దక్షములగు
రామశరములు గనసయ్యె • భీమముగను. 9

గీ. ఎవ్వడెచ్చట గనబడె • నెవని కంత
నాద మే దిక్కునను బుట్టి • నడచె నెవ్వఁ
డెటు చలించెనొ నిలిచెనో • యెవ్వఁ డెచట
నందరికి నన్ని చోట్ల న • నుందవృత్తి
రామశరవృష్టి కురిసెను • రణవసుమతి. 10

గీ. జానకీజానిశరములు • దానవోరు
సైన్యముఖమునందుఁ జొచ్చి ని • శ్శంకముగను
హస్తసంతతిఁ బరిమార్చి • యాశ్వికాళి
శమనుపురి కంపి భటులను • సమయఁజేసె. 11

గీ. ఆజినుండి పలాయితు • లైనవారి
ధార్మికులు చంపఁబోరని తలఁచి • దనుజ
సైన్యములు రామశరములఁ • జాలనొచ్చి
బవర మెంతయుఁ జాలించి • పాఱిరపుడు. 12

గీ. ఇట్లు రాఘవశరకృత్త • మిల నిపతిత
మైన రాక్షససైన్యాళి • యాక్షణమున
నయ్యె నత్తఱి శుకసార • ణావశిష్ట
మసురబృందంబు హర్షాబ్ధి • యందు మునిఁగె. 13

సంధ్యావర్ణనము.

గీ. లోహితారుణరాక్షస • వ్యూహ సదృశ
తిమిరసముదాయ మవనిజా • దీర్ఘ విరహ
భారఖిన్నాత్ముఁడైన యి • క్ష్వాకువంశ
తిలకునకు నొక్కదివసంబు • తీరుగలుగు
దివస మసురులభయమును • దీర్చునట్టు
లంత మొందెను యోధులు • హర్ష మొంద. 14

మఱల మేఘనాదుఁడు యుద్ధమునకు వచ్చుట.

గీ. అంత కరధృతచాపుఁడై • యుద్ధనాథుఁ
డంగద విభగ్నరథమును • రింగున దిగి
నిజతనుప్రవివర్ధిత • నిబిడ తిమిర
గగనపథమున జరియించె • గపులు బెగడ. 15

రామలక్ష్మణుల బంధనోపక్రమము.

గీ. అపుడు ఖరదూషణాది దై • త్యాళిహనన
వైరమూలుల దశరథ • ప్రభుసుతులను
రామసౌమిత్రిలను నాగ • రజ్జువులను
గట్టివైచెను రావణి • గాఢముగను. 16

నాగపాశబంధమును విడిచినాఁడు.

గీ. సద్మసంభవదత్తముల్ • ప్రకటభుజగ
విషశిఖివ్యాప్తజిహ్వాముల్ • విశిఖములను
నికవ వేసితరాక్షస • నివహములగు
రామలక్ష్మణభుజముల • రావణాత్మ
జాతుఁ డత్తఱి బంధించె • సాంద్రముగను. 17

కట్టివేయుటం జెప్పుచున్నాఁడు.

గీ. రాఘవులపైని రాక్షస • రాజసుతుఁడు
సర్పశరముల విడిచిన • సమయమందు
బాహుపురులుండు బాహువుల్ • భగ్నమయ్యె
దారితములయ్యె నుభయుల • దక్షిణంపు
కరములు బిగించె ద్రికమును • శరముతోడ. 18

ఈసర్పశరముల పృష్ఠలగ్నములైన యితర బాణములం
జెప్పుచున్నాఁడు.

గీ. నీలఘాతాయసద్రవ్య • నిర్మితములు
విషమయానలకణజాల • విస్తృతములు
కార్ముకోన్ముక్తముల పూర్వ • ఘనశరౌఘ
విభ్రమంబులు సర్పము • వెడలెనపుడు. 19

ఆ బాణములు రామలక్ష్మణులపైఁ బడుట.

గీ. స్ఫురితశంపాలతాజాల • సుందరములు
తాలవృక్షాభ్యధికలోహ • దండనీల
వర్ణములు బాణవితతు ల • వారితములు
నీలజలదోదరముభంగి • నివ్వటిల్లు
దనుజమాయాంధకార సాం • ద్రాంబరంబు
నుండి శరములు రాఘవు • నొడలిపైనిఁ
బడియె కపిసేన మిక్కిలి • భయమునొంద. 20

ఈబాణములు నానారూపములుగా నున్నవని
చెప్పుచున్నాఁడు.

గీ. ఆ శరంబులు గగనమం • దతులభయద
వృత్తితాచు మహోల్కల • విధముఁ దాల్చి

ప్రతియ రవిబింబబృందంబు • భంగి వచ్చి
రామలక్ష్మణభుజముల • గ్రమ్ముకొనియె. 21

వానరాదుల చేష్టలం జెప్పుచున్నాఁడు.

గీ. దండశూకాస్త్రబద్ధుల • దాశరథులఁ
జూచి సురలెల్ల మున్గిరి • శోకజలధి
మేఘనాదుని గానక • మోఘుతాచు
జేయునది లేక కపిసేన • చేష్ట లుడిగె. 22

కపుల యవస్థ.

గీ. దాశకంఠి నభంబున • దారుణముగ
నఱవసాగెను కపిబల • మన్ని దెసలఁ
జెదరె జెదరని ధైర్యాన • సీతభర్త
శాత్రవేక్షణదత్తలో • చనయుగుండు
శాద్రవేయాస్త్రఖండిత • కాయుఁ డయ్యె
నప్రకంపితధైర్యుఁడై • యతిశయిల్లె. 23

రామలక్ష్మణశరీరములందు సర్పముల చలనముం
జెప్పుచున్నాఁడు.

గీ. సర్పశరములు రాముని • సకలదేహ
బంధశక్తంబు లయ్యును • బహుళరోష
వహ్నికీలంబు ప్రజ్వల • ద్బాడబాగ్ని
సదృశమౌ హృదయదేశంబు • వదలె నవ్వి. 24

రామలక్ష్మణుల భుజములయవస్థం జెప్పుచున్నాఁడు.

గీ. దాశరథిబాహువులు సర్ప • దామబంధ
వేష్టితము తాచు మలయాద్రి • వికటసాను
జాత చందనవృక్షాళి • చాడ్పుమీర
స్థిరములై నిష్ప్రకంపన • స్థితిని జెందె. 25

రామలక్ష్మణావస్థం జెప్పుచున్నాఁడు.

గీ. అంతి దశరథ పుత్రులు • హర్షమేది
హస్తవిధృత మహేష్వాసు•లయ్యునపుడు
బాణ నిర్భిద్యమానోరు • బాహులగుచు
దంతదంశన మాత్ర ప్ర•దర్శనాతి
నిష్ఫలీకృత రోషులై • నెగడి రంత. 26

వారి శరీరమునుండి రక్తము కారుట.

గీ. కాండపూరిత దుర్దర్శ•గాత్రులౌచు
కంకపత్రాంతర క్షుర•గ్రాథశుష్క
రుధిరధారలు ప్రవహింప • రుద్ధదృష్టు
లైన రాముని సౌమిత్రి • నధికబాధ
నొందఁజేసెను రావణి • యుగ్రుఁడగుచు. 27

రామలక్ష్మణుల జడీభావము.

గీ. అంబక స్యూత సక్థిద్వ•యంబు గల్గి
బాణకీలిత విహ్వల•పాదు లౌచు
నిగళితాశేషకాయాంగ•నివహులగుచు
బుడమిపై నిశ్చలంబుగఁ • బడిరి వారు. 28

వారి చేతులనుండి ధనువులు నేలఁబడుట.

గీ. దృష్టిపథగోచరాతీత • దేవశత్రు
బాణతాడన వక్రిత • వామహస్త
విగళితంబైన రాముని•విల్లు సురల
హృదయములతోడఁ బడె నప్డు • డిలను వేగ. 29

అంతరిక్షమందు దేవస్త్రీలు మొఱ్ఱలిడుట.

గీ. సంయుగాలోకనాగత • స్వర్గనిలయ
నారులెల్లను దివిపివిమా•నములనుండి

రామకార్ముక విచ్యుతి • త్రిస్తహృదయు
లాచు నాక్రందనము జేసి • రాక్షసులు. 30

రాముడు నేలబడుట.

గీ. అపుడు హర్యక్ష నిశిత న • ఖాంకుశాగ్ర
నిహతిపాతిత వనకరి • నికట వర్తి
యతుల భూజంబుమాడ్కి ని•రస్తమయ్యె
పంక్తి కంఠవధాశ సు • పర్వులకును. 31

లక్ష్మణుడు పడిపోవుట.

గీ. తుంగ భూరుహ మిలపైని • ద్రోయబడిన
దానితో గూలునీడ చం•దాన నేలఁ
బడియె సౌమిత్రి వ్రణతుడై • పడిన యన్న
ననుకరించుచు కపులు శో•కాబ్ధి మునుగ. 32

దేవతలువచ్చి వారిని జూచుట.

గీ. వసుధగూలిన భాస్కర • వంశభవులు
సౌసువులో కారో యని పరీ•క్షణము సేయ
రథశతంబుల నెక్కి గీ•ర్వాణు లెల్ల
సమర భూమికి నేతెంచి • సాక్షు నేత్రు
లగుచు వగచిరి స్వీయ•భాగ్యంబుఁ దలచి. 33

త్రైలోక్యశోకముం జెప్పుచున్నాడు.

గీ. హృదయ పతనాన మూఢత • హెచ్చినట్లు
భాస్కరుడు గ్రుంక దనుముక • బడిన యట్లు
శీర్ష పతనాన జీవన•చ్ఛేద మట్లు
లయ్యె ముల్లోకములు రాము•డవని గూల. 34

కపుల రాఘవ పరత్వము.

సీ. ఇనకులోద్భవ రక్షితా • హీన గతులు
శూన్య దిఙ్ముఖ వీక్షణ • శూన్య మతులు
త్రాసనిశ్చల పుంజిత • తరుచరాళి
పతితుఁడైయున్న రాముని • పార్శ్వమెపుడు
వదలకుండంగఁ గాచిరి • పరమభక్తి. 35

కపులు నిశ్చేష్టులగుట.

సీ. ఖండితోత్సాహ మత్యంత • కలుష ధైర్య
మతి విలోల మనంబు భ • యాకులంబు
రాఘవానన దత్త నే • త్రంబు నౌచు
తరుచరావళి చిత్రప్ర • తంబు బోలె. 36

రాముని ముఖప్రసాదముం జెప్పుచున్నాఁడు.

గీ. పతితుఁడై యున్న భాస్కర • వంశ్యముఖము
సహజ ధైర్యంబుతోడఁ బ్ర • సన్నమయ్యె
దినకరాత్మజు వీక్షించి • తేరి మూర్ఛ
సాంత్వ వాక్యంబుఁ బలికెను • సరసభంగి. 37

సుగ్రీవునకు మరల నిండ్రజిద్దర్శనము

గీ. సీదస దశకంఠభ్రాత • విభీషణుండు
దనుజవానరుల నెరుగంగ • నయనోసంగు
మంత్రతీర్థంబు కనులకు • మందుబెట్టి
నానకేందు్రండు కార్ముక • పాణి జనకు
నాజ్ఞ సనిసేయ నింగిపై • నతిరయమున
సంచరించెడు రావణి • సరగునఁ గనె. 38

సుగ్రీవపౌరుషముం జెప్పుచున్నాఁడు.

గీ. అంత వానరభూకాంతుఁ • డతుల రోష
కలిత మానసుఁడై పృథు • క్ష్మాధరంబుఁ
బెరికి యొక్కటి రావణి • భీతినొంద
నెదురుగాఁ జనె; వాఁడును • బెదరి లంకఁ
జొచ్చె నత్తఱి నవ్వంగ • శూరులెల్ల. 39

రావణోత్సాహముం జెప్పుచున్నాఁడు.

గీ. రాఘవుల నేఁడు చంపితి • రణములోన
ననుచు సూనుఁడు చెప్పంగ • నతిముదమున
విని దశగ్రీవుఁ డవనిజ • తనకు వశ్య
యయ్యెనని పొంగె నత్తఱి • నాత్మలోన. 40

సీత మూర్ఛితుఁడైన రామునిఁ జూచుట.

గీ. దశముఖుని యాజ్ఞచే నప్డు • దనుజ సతులు
సీతఁ గొనిపోయి రణభూమిఁ • జేష్టలుడిగి
నేలబడియున్న రాఘవు • వ్రీలితోడ
జూప మొఱలిడి మూర్ఛిల్లి • సుదతి మిన్న
క్షణిక వైధవ్యదుఃఖంబు • నైన లేదు. 41

రాముని విలాపముం జెప్పుచున్నాఁడు.

గీ. గళిత మోహుండు కాకుత్స్థ • తిలకుఁ డపుడు
మూర్ఛితుండైన సౌమిత్రి • మోము జూచి
ధరణిజాదీర్ఘ విరహ సం • తాప శుచముఁ
గొంతవడి డాఁచి వెనుకకుఁ • గొందలమున
నిట్లు విలపించెఁ దమ్ముని • యేటుదలచి. 42

లక్ష్మణోత్కర్షపరమైన రాముని విలాపము.

గీ. ఎవని చాపంబు సజ్యమై • యేపుమీఱ
ముజ్జగంబులు సందేహ•మున మునుంగు
నట్టి లక్ష్మణుడే యిట్లు • హతిని జెంద
దైవ వక్రత నన్యుల • దశ యెటుండు. 43

రాముఁడాత్మనిందాపరమైన వాక్యములాడుట.

గీ. నయవిదుండును సౌమిత్రి • నాకనుంగు
కృత్యవేది మదర్థమై • మృత్యుపదము
నొందె నేనొక్కఁడనె యి•ప్పుడుర్వి మీద
నిష్ఫలవ్యాధ భుజభర • నిష్ఠచేత
లాఘవాస్పద జీవిత • లబ్ధినుంటి. 44

సుగ్రీవునితో రాముని వచనము.

గీ. లక్ష్మణాను మృతి స్థైర్య • లబ్ధ దీక్ష
నాత్మ నిధనవ్యవ స్థాపి•తాతిధైర్య
సహజగాంభీర్య సదనంబు • సరస మధుర
మైనవాక్యంబు వచియించె • నర్కకులుడు. 45

సుగ్రీవాది ప్రశంసాపరమైన వాక్యములం జెప్పుచున్నాఁడు.

గీ. వానరాధిప సుగ్రీవ • వాగతీత
మైన యుపకృతి నొనరించి • తయ్య నాకు
సేతుబంధాది నిర్మితి • చేతఁ గపుల
ఋణము దీర్పంగ జాలిన • బుద్ధిలేదు
అబ్ధిలంఘన చతురుడౌ • ననిల సుతుడు
పరనసిన యుగంబునకుఁ బ్రతి • పుడమి లేదు. 46

విభీషణుంగూర్చి విచారముతోఁ జెప్పుచున్నాఁడు.

గీ. బంధుజనములతో బద్ధ • వైరుఁడైన
యల విభీషణు నాలంక • కధిపుఁ గాను
జేయనైతి నటంచు నా • చిత్తవృత్తి
నారసము బెట్టి కొట్టిన • తీరుగలిగి
యమిత బాధ నొసంగు నా • యాత్మ కిపుడు. 47

రాముడు సుగ్రీవునకు స్థలాంతరమునకుం
బొమ్మని చెప్పుట.

గీ. వగవ వలదయ్య సుగ్రీవ • వానరేంద్ర
తరుచరాధిప సేతుబం • ధంబు బట్టి
యురుగు మెచ్చోటి కైన నీ • యాప్తబంధు
వర్గమును జూచి దుఃఖంబు • బాపికొనుము
కాలమెవ్వారి కైనను • గడువ రాదు. 48

సుగ్రీవుని ప్రత్యుత్తరముం జెప్పుచున్నాఁడు.

గీ. అపుడు భాస్కర తనుజుఁడయ్యర్క కులజు
మాటలకు బదులు చెప్పక • మాఱు లేని
రోషలంఘిత విధుతాస్య • రూఢదుఃఖ
నేత్రజలబిందు సంక్లిన్న • గాత్రుఁడగుచు
వానరుల జూచి యీరీతిఁ • బలికె వేగ. 49

గీ. తరుణపల్లవ సంఘాత • విరచితాతి
మృదుల శయనంబుపైనుంచి • మేటి రాము
లక్ష్మణునితోడ గొనిపోండు • లఘుపుగాను
మనదుకిష్కింధ కనివల్కె • నినసుతుండు. 50

గీ. వినుడు నామాట కపులార • విద్యుదోఘ
పతన సమతీత సంపాత • పరిగృహీత
కార్ముకుని గగనపథమందు • గలిసి బలిమి
భుజముచందున్న పరిఘంబు • భోరునగొని
శూన్యహస్తునిఁ జేసెద • సురలు మెచ్చ. 51

గీ. స్కంధదేశ మధిష్ఠించి • కరయుగాన
నాయుధంబుల చంద్రహాసాఖ్య ఖడ్గ
వరము నురుముగఁ జేసెదఁ • బట్టితేరు
భగ్న మొనరింతు గనుడు నా • బలిమి కలిమి. 52

గీ. వజ్రసన్నిభ మన్ముష్టి • పాతభిన్న
వక్షు జేసెద వింశతి • బాహువులను
విరిచి నిప్పులు జేసెద • వినుడు కపులు
నూరు లేసట్టి మద్బాహు • సారగరిమ. 53

గీ. బాహువులచేత శిరములఁ • బట్టి నట్టి
చీరి ముక్కలుగాజేసి • క్షితిని వైతు
జానకీ వ్యర్థలగ్న దశాస్య హృదయ
మింత లింతలుగాఁ గోతు కనింపుమిర. 54

గీ. ఇప్పుడీరీతి దశకంఠు • డీల్ల సీత
దీసికొనిపోవ మత్పురి • కాసదీర
ననుగమించు నె ఖిద్యమాణు • డగు నిజేశు
నసువులుండంగ వీక్షించి • యులరు నొక్కె. 55

రాముడు గరుడు నాహ్వానించుట.

గీ. ఖరకరాత్మజు రావణావరజు దప్ప
వేల నీకట్టిదైన్యంబు • తాళుమంచుఁ

బలికి యౌదార్య భాస్కరకులతిలకుఁడు
మనమున స్మరించె గారుడ • మంత్రములను. 56

రామునొద్దకు గరుడు డేతెంచుట.

గీ. అంత విక్షిప్త జలధి • తోయ ప్రసంధి
ప్లావితాద్రి సువేలంబు • ప్రేరయ వాయు
కీర్యమాణాసుర క్షేత్ర • పూర్యమాణ
మై చెలంగెను భూతలం • బాక్షణాన. 57

గరుడదర్శనముం జెప్పుచున్నాఁడు.

గీ. కనకమయపక్షపింగళ • కాంతి విసర
ఖండిత మహాంధకారంబు • కమలనేత్రు
వాహనము నూత్న పక్షాళి • వర్ణ్యమాన
మృదులలోమంబు విదళిత • పన్నగాళి
వచ్చి రాముని వీక్షించె • భక్తి మీర. 58

గీ. దుర్ధనేందరీవరాయుధా•తుల నిఘాత
విగళితైక పతత్త్రుండు • విష్ణురథము
భుజగలోక సమాకృష్ట • భుజగ మొకటి
కంఠమునఁ జుట్టి రామునిఁ • గానవచ్చె. 59

నాగపాశత్యాగముం జెప్పుచున్నాఁడు.

గీ. అపుడు గరుడుండు దివినుండి • యవనికి దిగి
దూరముననుండి కల్మష • దూరు రాము
వినయమున మ్రొక్కి సమ్ముఖ•మునకు రాగ
దశరథాత్మజ తనులగ్న • దందశూక
శరములెచ్చోటి కేగెనో • యెఱుఁగఁబడదు. 60

గీ. ఆంత శరబంధముక్తుఁడై • యర్కకులజు
డంకజాధీశ పరిరంభ • హృత మహోర

గాత్రు నిర్వ్రణాంగులై యున్న • గారి దత్త
గారుడోపనిషన్మంత్ర • గరిమచేత
నపగతవ్యథ నొందె న • య్యమరులకును. 61

ధూమ్రాక్షుని యుద్ధోద్యమము.

గీ. అపుడు శరబంధనిర్ముక్తు • లైరి రామ
లక్ష్మణులటంచు చారుల • లపితము విని
తార్క్ష్యకృత మిద్దియని మదిఁ • దలఁచి కుంది
పిలిచి ధూమ్రాక్షు రాక్షస • వీరవరుఁడు
యుద్ధభర మెల్ల నీతల • నున్నదనెను. 62

ధూమ్రాక్షుని యుద్ధప్రయాణము.

గీ. అంత ధూమ్రాక్షుఁ డధికసై • న్యానుయాతుఁ
డతుల రోషారుణాక్షుఁ డు • ద్యమపరుండు
హర్షసంఫుల్లహృదయుఁ డ • య్యవనిపాల
తనయయుగళంబునందు దు • ర్దాంతవైర
మొద వహించి రణావని • కేఁగె వేగ. 63

హనుమంతునకును ధూమ్రాక్షసైన్యమునకును యుద్ధము.

గీ. సైల్యనైపుల్యములయందు నపనదీశుఁ
బోలియున్నట్టి ధూమ్రాక్ష • పాలితంబు
నిశిచరానీక మహార్వాగ్ని • నిభ సమీర
తనయు సమ్ముఖమందుండె • తల్లడించి. 64

ధూమ్రాక్షునకు నాంజనేయునకు యుద్ధము.

సీ. కపినిశాటుల కప్డు సం • గ్రామభూమి
దారుణాయోధనక్రీడ • మీరుచుండ

నంజనాపుత్త్ర విహితాక్ష•హతి దలంచి
కురిసె శరవృష్టి హనుమపై • ఘోరముగను. 65

ధూమ్రాక్ష రథభంగము.

గీ. వాయుపుత్త్రుండు ధూమ్రాక్ష•బాణ వితతి
నాత్మరోమాళికూపము•లందుఁ దగల
దులిపివైచి బలోద్రేక • విలసితుఁడయి
వాని రథమెక్కి బలియుఁడై • వానిధనువు
విఱిచి వెకవెక నవ్వెను వీరు లలర. 66

హనుమంతుని దేహదార్ఢ్యముం జెప్పుచున్నాఁడు.

గీ. వాయుపుత్త్రుని భుజముచే • వ్రయ్యలయ్యె
ధూమ్రనేత్త్రుని పరిఘంబు • తొలుత వాని
విపులవక్షఃస్థలంబును • భిన్నమయ్యె
ముష్టిఘాతంబున నె లేదు • ముసల మొకటి
దానవుని హేతి మారుతిఁ • దాఁకి యపుడె
యంతమొందెను తజ్జగీ•షాశతోడ. 67

ధూమ్రాక్షుని మరణముం జెప్పుచున్నాఁడు.

గీ. వాయుపుత్త్రుండు నిజదీర్ఘ•వామకరము
వానిమెడఁజుట్టి గళమును • వంచి జీవ
నిర్గమంబు నిరోధించి • నిర్యదతుల
సింహనాదంబు కుక్షిలోఁ • జిక్కఁజేసె. 68

గీ. ఆయుధంబులఁ బూని య•య్యనిలతనయు
నణవ నుంకించి చలియించు • నసురహస్త
యుగళ మంకించి యంత ర•యోద్ధతముగ
ద్రిప్పి పడగొట్టె నేలను • దివిజు లలర. 69

అకంపనుడు యుద్ధమునకు వచ్చుట.

గీ. అంత ధూమ్రాక్షుఁ డంతకు • నంతికమున
కరుగ హతశేష నిశాచరు•లంద రపుడు
పంక్తిముఖునకుఁ దెలుపంగఁ • బటురయమున
బంపె వీరు నకంపను • బవరమునకు. 70

అకంపను డాంజనేయుని చే జచ్చుట.

గీ. వజ్రమయమైన మారుతి • వక్షమందు
కొండవర్షంబు గురియ న•కంపనుండు
దానినంతయు సైరించి • దనుజ తనువు
గాఢముష్టిప్రహారాన • ఖండములుగఁ
జేసి విసరెను దెసలకు • శీఘ్రగతిని. 71

నీల ప్రహస్తులకు ద్వంద్వయుద్ధము.

గీ. అపుడకంపను డీల్గిన • యవసరమున
నద్వితీయ భటుండు ప్ర•హస్తు డనికి
రావణాజ్ఞప్తుఁడై చని • రయముతోడ
దురము లేమి కతంబున • దుఃఖ మొందు
నీలు చతుష్పథంబున • వ్రాలె నంత. 72

నీలుని వక్షఃస్థలమందు ప్రహస్తుడు బాణములతోఁ గొట్టుట.

గీ. అంత నీలుండు నిశిచరు • నంతికమున
కేఁగ వాఁడొకతూపున • వేగ నతని
యురము ఛేదించి రక్తపు • వఱద చేసి
సింహనాదంబుఁ జేసె నె•చ్చెలులు వొగడ. 73

నీలుడు ప్రహస్తునిపై కల్పవృక్షమును విసరుట.

గీ. వేగ పశ్చాత్కృతానేక • విటపచయము
సురమదేభ నుదోక్షిత • సురభిళంబు

గతసథాసక్త చంచరీ • కంబునైన
కల్పభూరుహ మొకటి య•నల్ప శక్తిఁ
బెరికివైచె బ్రహస్తుడు • భీతిజెంద. 74

ఈకల్పవృక్షము ముత్యములవర్షించెను.

గీ. ఆ తరువువచ్చు మార్గాన • నంబువాహ
గళిత జలలవ గుచ్ఛ సం•కాశమైన
విమల ముక్తాఫలానీక • విపులవృష్టి
గురిసె దశకంధరామాత్యు • నురము నందు. 75

ఆచెట్టు ప్రహస్తుని గుండెలపైబడి భిన్నమయ్యెను.

గీ. నీల బాహ్వాగ్ర విక్షిప్త • నిర్జరముగ్రి
మంబు వ్రణరోక భృతమహా•క్తి•కంబునౌచు
భగ్న విటపాంతరచ్యుత • పట్టవస్త్ర
పీతశోణితమహా వాని • పీనవక్ష
మందుబడి నుగ్గునూచంబు • నయ్యెనపుడు. 76

నీలుని సమక్రియత్వము.

గీ. దనుజు శరవృష్టి నీలుండు • తప్పకొనెను
కప్పె భూరుహవితతిచే • గగన తలము
అశ్మవృష్టినిఁ గురిపించి యన్ని దెసలఁ
గానరాకుండఁ జేసెను • వానరుండు. 77

అంతరిక్షమందు నీలాస్త్రఖండనము జెప్పుచున్నాఁడు.

గీ. ఛిన్న భూరుహషండ వి•చ్ఛేదతతుల
బాణఘాత విభిన్న పా•షాణ హతుల
దళిత భూధర నిస్సర•ద్జ్వలిత నిర్ఝ
రంబు లయ్యెను గగనస్థ•లంబులెల్ల. 78

నీలునియవస్థం జెప్పుచున్నాఁడు.

గీ. శైలధాతు పరాగ సం◆ఛ్ఛిన్న దేహుఁ
డంసదేశ విపర్యస్త ◆ హారిసటుఁడు
సాంధ్య రవికాంతి రూపిత ◆ సజల తోయ
దంబుకైవడి నభమందు ◆ దారుణైన
నీలుఁ డొప్పెను భుజవీర్య ◆ నిర్జితారి. 79

నీలుఁడు ప్రహస్తుని ధనువు పట్టుకొనుట.

గీ. కపివరుండంత వేగనా◆కసము నుండి
దిగి ప్రహస్తుని కరముసఁ ◆ దేజరిల్లు
ధనువు హరియించి మీఁదను ◆ జనియె మఱల
నంపగములఁ బ్రహస్తుఁ డ◆వ్యాహతముగ
బరపినను నిశ్చలుండయి ◆ పాఱకుండె. 80

నీలునిపైఁ బ్రహస్తుఁడు ముసలముం బ్రయోగించుట.

గీ. అసమశక్తిఁ బ్రహస్తుండు ◆ ముసలమొకటి
నీలునొసటికి విసరంగ ◆ నిశ్చలుఁడయి
దాని వెసబట్టి దనుజుపై ◆ బూనికొట్ట
నుక్కుఁగోల్పోయి మ్రొగ్గెవాఁడుర్విపైని. 81

నీలుఁడు ప్రహస్తుని శిలలతో గొట్టుట.

గీ. జ్వలన తనయుండు నిస్సమ ◆ శక్తియుతుఁడు
దానవ స్థూల కఠిన వ◆క్షోనురూప
పరిమితిగలట్టి కృష్ణాశ్మఁ ◆ బర్వతమున
బెఱికె నొకదాని భీకరవృత్తి నతఁడు. 82

నీలుడు పాషాణము నాకాశముమీదకు విసరుట.

గీ. అంబరముమీఁద కెగిరిన • యద్రిచరుడు
విసరివ్రైచె మహీధర • వికట శృంగ
మేగి భాస్కరుఁ గప్పంగ • నిలను దివస
మంధకారావృతంబయ్యె • నపుడు చూడ. 83

ప్రహస్తవధచే నాశ్వాసము నంతపుచ్చుచున్నాఁడు.

గీ. అపుడు నీలుని గాఢప్రహార బాధ
సంప్రహారానురాగాన • సైచి దనుజు
డసువులను వీడె హస్తగతాస్త్ర వితతి
తోడ నమరులు మింటను • స్తుతులొనర్ప. 84

ఆంధ్ర సేతుబంధ మహాకావ్యమునందు
చతుర్దశాశ్వాసము
ముగిసెను.



# ఆంధ్ర సేతుబంధ కావ్యము.

## పంచదశాశ్వాసము.

---

### రావణుఁడు యుద్ధమునకు వెడలుట.

గీ. మంత్రివరుఁడు ప్రహస్తుండు ♦ మడియుట విని
నేత్రగోళౌఘ నిర్గత ♦ నిబిడ వహ్ని
శిఖల దిశలెల్ల నెరియంగ ♦ క్షిప్రగతిని
బయలువెడలెను సంగ్రామ♦బద్ధదీక్ష. 1

### రావణుని హాసము.

గీ. ఎట్లు భయమహాసధారులై ♦ యెల్లభటులు
నిశ్చలంబుగ నాస్థాన♦నిలయ భిత్తి
లీనులైయుండి రత్తరి ♦ జానుదక్కి
యట్లు కుపితుండు దశకంఠుఁ ♦ డన్ని దిశల
నల్లుకొనునట్లు హాసంబు♦నంత విడిచె. 2

### రావణుఁడు రథము నెక్కుట.

గీ. అంతరాక్షసనిచయసమావృతంబు
పదభరన్యాస వినమిత ♦ పశ్చిమైక
భాగ మురువాజియుక్తంబు ♦ ప్రచలకేతు
మయము సారథిసంరుథ్య♦మానహయము
నెక్కె నరదంబు దశకంఠుఁ ♦ డింపుమీర. 3

రావణుఁడు యుద్ధమునకు వచ్చుచున్నాఁడని
కపు లెరుంగుట.

గీ. సభను హుంకారములచేత • సైన్యరచిత
కలకలంబున లంకలోఁ • గపిబలంబు
లెరిఁగె సంగ్రామభూమికి • హెచ్చువేడ్క
వెడలె దశకంధరుం డను • వింతవార్త. 4

రావణుఁడు లంకనుండి బయలుదేరుట.

గీ. దశముఖంబులపైని సి • తాతపత్త్ర
ఛాయ సర్వాంగ పురినుండి • సైన్యయుతుఁడు
పంక్తికంఠుండు వానర • బలముఁ జంపఁ
బోయె నుద్వృత్తుఁడై యుద్ధ • భూమి కపుడు. 5

కపులు పారిపోవుట.

గీ. వదనమాత్రంబె దశకంఠు • నైపు ద్రిప్పి
పశ్చిమోత్కట కేసర • పంక్తి నిహతి
భుజశిరస్కులు పరుగునఁ • బోవుచున్న
వారివెంటనె పఱచిరి • వానరాళి. 6

నీలుఁడు వారిని పోకూడఁదని మరలించుచున్నాఁడు.

గీ. పంక్తిముఖదత్తభయకంప • భగ్నచిత్తు
లాత్మజీవిత సంత్రాణ • హత యశస్కు-
లగుచు పరుగిడు కపుల నయ్యనలసుతుఁడు
చూచి యిట్లనె సంగ్రామ • చోదకుఁ డయి. 7

నీలుఁడు కపులను మరలించుమాటలు.

గీ. పఱచు టర్హంబె సంగ్రామ • ధురము విడిచి
భుజ సముత్క్షిప్తమలయాద్రి • భూరి శిఖరుఁ

డిపతనూజుండు మీరిపు • డెద్ది గావ
యత్న సరులైతిరో దాని • హతముజేయ. 8

రావణుండు రాముం జూచుట.

గీ. అతఁడె రాముఁడు సుమ్మని • యంత ప్రీతిఁ
జెప్పినను జానకీసక్త • చిత్తుడైన
యసురనాథుండు రాముని • యందుఁ బ్రీతి
జూప లేనెంతమాత్రంబు • సుదతి కిపుడు
వల్లభుపటంచు బహుమాన • వంతుపయ్యె. 9

రామశరహతిని రావణుడు లంకకు బాఱిపోవుట.

గీ. రామశర భిన్న గాత్రుండై • రావణుండు
ప్లవగులందరు వెనుక జంప్పట్లు కొట్టి
వెంట దరుముంగ విరగిన • వెల్లగొడుగు
సిడముతోనున్న రథమున • సిగ్గు లేక
చేరె లంకకు దనుజులు • చింత నొంద. 10

కుంభకర్ణుని లేపుట.

గీ. అపుడు సంప్రాప్తనాశుండు • కుపితయశుఁడు
త్యక్త శౌటీర్యుఁడౌచు నా • దైత్యనాథుఁ
డతిసుఖంబుగ నిద్దుర • ననుభవించు
గుంభకర్ణున కాలానఁ • గోరి లేపె. 11

కుంభకర్ణుని యుద్ధప్రయాణము.

గీ. అపుడు దైత్యప్రబోధితుం • డైన కుంభ
కర్ణుఁ డతినిద్రఁజాలించి కలయఁజూచి
యావలించి యకాలశ • య్యాప్రహాణ
మున విదిర్చుచు గాత్రంబు • నినకు లేను
గెల్చు టిదియెంతపనియని • క్రోధిఁజేసె. 12

కుంభకర్ణుని దేహమహత్త్వముం జెప్పుచున్నాఁడు.

గీ. క్రాంత చండాంశురథపథ • ఘనతఁ బూని
కనకసాలంబు తత్సంధి • ఘటితమగుచుఁ
ద్రోఁచె బంగరులాగును • దొడిగినట్లు
కుంభకర్ణుండు నోవంగఁ • గోట దాఁటి. 13

కుంభకర్ణుడు లంకాప్రాకారముం దాఁటుట.

గీ. లంఘితోన్నత వరుణాద్రై • లంకనుండి
కుంభకర్ణుండు సంగ్రామ • కుతుకమునను
బోవ విసలాయమానోరు • భుజగ మకర
నికరసంకుల పరిఖస్థ • నీరమంత
జానుదఘ్నము గానయ్యె • దానవునకు. 14

కుంభకర్ణుంజూచి కపులు బరుగెత్తుట.

గీ. కుంభకర్ణుని వీక్షించి • కుజచరాళి
త్రాస విహ్వలులై చేతి • ధరణిధరము
లెల్లబోనాడి రణకర్మ • నొల్లకపుడు
విముఖులైపోయి రాత్మ జీ•వితము గోరి. 15

కుంభకర్ణుని యుద్ధము.

గీ. ధరణిధరభూజముద్గర • పరిఘములను
ఖడ్గదండాయుధాళి మా•ర్గణముసుంతి
చక్రకుంతాదిసాధన • సమితి చేత
వానరబలంబుఁ జక్కాడె • దానవుండు. 16

గీ. రామశరపీడితుండయి • రాక్షసుండు
వానరావళి దానవ•వ్రజము వాజి
సంఘముల హస్తిగణముల • శంక లేక

నిజబలంబున శాత్రవా•నీకమందు
నున్న వారిని భక్షించె • నురికి యురికి. 17

కుంభకర్ణ భుజచ్ఛేదము.

గీ. కపులతోఁ గుంభకర్ణుఁడు • కలిమి మెఱయఁ
గొంతవడి పోర రాముండు • ఘోరబాణ
వితతిచే వానిభుజములు • పృథివిఁ గూల
నేసె నెత్తురువఱదలై • యేపుమీఱ. 18

రెండుభుజములు పడినస్థలముం జెప్పుచున్నాఁడు.

గీ. అంతవినికృత్తభుజయుగ•మందు నొకటి
రుద్ధబహుళనదీముఖా•రూఢ మగుచు
నబ్ధితీరానఁ బడె సువే•లాద్రి పగిది
రెండవభుజంబు కడలిలో • రెండవదగు
సేతుబంధంబుబోలిన•స్థితి వహించె. 19

కుంభకర్ణుని శిరచ్ఛేదము.

గీ. కృతిరఘూత్తముఁ డాకర్ణ•కృష్టమైన
శితశరంబున దానవు • శిఖిమయంబు
శీర్షమును రాహుశిరమును • శ్రీశుఁ బోలి
నేలఁగూల్చెను నిర్జర•నికర మలర. 20

కుంభకర్ణ శిరఃపతనము.

గీ. వాయుపూరిత ముఖగుహా•స్వనయుతంబు
భగణపద చుంబి సంభిన్న•పతితమైన
కుంభకర్ణశిరంబు త్రి•కూటగిరికిఁ
గొత్త గాఁబుట్టు నాల్గవ•కూట మనఁగఁ
దేజరిల్లెను యుద్ధప్ర•దేశమందు. 21

గీ. కుంభకర్ణుండు ధరణిపైఁ • గూలనపుడు
దూరధావిత దరభగ్న • వారిసింహ
దేహపరిమాణ పూర్ణనదీశ్వరుండు
బాడబాగ్నిని ముంచెను • బహుళముగను. 22

రావణుని కోపము.

గీ. సచివుఁడైన ప్రహస్తుని • చావుకంటె
నధికమైన నిజానుజ • వధ నెఱింగి
యమితకోపాతపారుణ • మగు ముఖాళి
నూనె నవ్వుచు దశకంఠుఁ డుద్ధతముగ. 23

మరల రావణుని యుద్ధప్రయాణము.

గీ. కోపవర్ధితగాత్రుఁ డ • కుంఠితాతి
విక్రముఁడు పంక్తికంఠుఁ డ • వ్వేళ సమర
రంగమున కేఁగ సమకట్టి • రాజభవన
రాజితస్తంభ పూగాంత • రాళ మపుడు
స్ఫుటదయ్యెను తద్దేహ • పరిమితిఁ గన. 24

ఇంద్రజిత్తు తండ్రితో విన్నవించుచున్నాఁడు.

గీ. స్థానముల రెంటిమధ్యను • దూరి తోలని
పిదప వక్షఃస్థలంబున • సదనపటల
మెత్తి సాగిలపడి భూమి • నెత్తి మోపి
జానువులఁ బ్రాకి త్రిశేవంగఁ • జనగవచ్చు. 25

తండ్రితో నింద్రజిత్తు విజ్ఞాపనముం జెప్పుచున్నాఁడు.

గీ. తండ్రి సాహసకృత్యంబు • ధరణినొకటి
జేయు పుత్రుఁడు సద్భాని • జేసినయెడ
నధికుఁడగురాను వానిచే • నాత్మజాత
జన్మసుఖమును బడయుఁను • జనకుఁ డెపుడు. 26

స్వోత్కర్షపరమైన విజ్ఞప్తినే చెప్పుచున్నాడు.

గీ. తాత, నేనుండ మానుష • జాతియైన
దశరథాత్మజు కొఱకేల • తల్లడంబు
రాక్షసాన్వయ జాతుఁడై • రమ్యయశముఁ
గొన్న నాకీర్తి నాయమే • కొఱతపఱుప. 27

రావణోత్కర్షముం జెప్పుచున్నాఁడు.

సీ. త్రిభువనంబులు గలిసిన • దేవ నీకు
సమమె సంగ్రామమున గెల్వ • శంభుశైల
మెత్తితి విశేషభుజగేంద్రు • నెత్తినున్న
రతనముహరించితివి దేవ•రాజవరము
విరిచితివి సాటియెవరింక • వీరవర్య. 28

రాముఁడు సేతువుకట్టినాఁడనికాబోలు గొప్పవాఁడని యనుకొనుచున్నావు. దానికిచెప్పుచున్నానువినుము.

గీ. ఏకమార్గణశోషిత • శ్రీకజలధి
రాముజంపుదు నా రణ•రంగమందు
బాడబానల సంతప్త • వార్ధిసప్త
కంబు నింకింతు నా పరాక్రమము జూడు. 29

ఇంద్రజిత్తుయుద్ధప్రయాణముం జెప్పుచున్నాఁడు.

గీ. ఇట్లు విజ్ఞప్తదశముఖుం • డింద్రజిత్తు
యంత తెచ్చిన కవచంబు • నంతలోనఁ
దొడిగి శీఘ్రసదన్యాస • ధూతరథుఁడు
రామవధ కుద్యతుండయి • రణముకేఁగె. 30

సీ. కేతుశిఖరాగ్రసంస్థ జీ•మూత నిచయ
ముచ్యమానాశనివ్రాత•ముఖ విలసిత

రవికిరణజాలమై యొప్పు • రథము నెక్కి
యంతికస్థితి రఘునాథ • హస్తలగ్న
చాపటంకారరసముల • నేపు వినుచు. 31

ఇంద్రజిత్తు యుద్ధప్రయాణము.

గీ. ఇట్టులాజికిఁ బోకుండ • నింద్రజిత్తు
సంక్తి కంపుని వారించి • బహుళ యుద్ధ
భరము నిజభుజ పీఠికఁ • బదిల పఱచి
సైనికులుగూడి జయపెట్ట • సాంయుగీన
రథమధిష్ఠించి చనెను సంగ్రామమునకు. 32

రథవేగముం జెప్పుచున్నాఁడు.

గీ. రయముతోఁబోవు శక్రజిద్రథజవంబు
జనకు మోఁప్రల నెటుండునో • తనదు నగరి
రథ్యనట్లుండె కపిసైన్య • రణము నందు
నదియె వేగంబు తగ్గలేదల్పమైన. 33

గీ. శక్రజేత రణావని • సంగతుఁడయి
తొలిని రామునితోఁబోరఁ • దలచుచుండ
వానరానీక నిహత • స్వసైనికుఁడయి
వాయుపుత్రాది కపియోధ • వరుల చేతఁ
జుట్టుబడి యుద్ధమొనరించె • శూరులలర. 34

వానరవీరులందరితో నింద్రజిత్తు యుద్ధము చేయుట.

గీ. జ్వలనతనయుండు విసరిన • శైలవరము
ద్వివిద విక్షిప్తసాలంబు • వీరవర్యు
డనిలపుత్రుండు వైచిన • యద్రిశేఖర

మన్నిఁటిని శక్రజేతయు ♦ నన్నిమార్గ
ణముల ఖండించె నొకపరి ♦ నయవిదుండు. 35

విభీషణ మంత్రణము.

గీ. అంత నాశితకపిసైన్యుఁ డమరనాథ
విజయి యిటుపైని కుంభిల ♦ జేరిల్చిఁబోవు
సిద్ధ మిది వీడు తత్కార్య ♦ సిద్ధిఁ గన్న
నస కజేయుఁడటంచును ♦ దనుజనాథు
ననుజుఁ డటఁ బల్కె రామానుజునకు వేగ. 36

మేఘనాథ వధ.

గీ. అపుడు సురనాథజేత మాయాబలాస
శరవరంపరశస్త్రాళిఁ ♦ గురిసి రాము
ననుజుపైఁ గొంతవడి పోరి ♦ వనజసంభ
వాస్త్రమున ఖండితుండయి ♦ యవనిఁద్రెళ్లె. 37

రావణుఁడు పుత్రునికొఱకు శోకించుట.

గీ. తనయవధవార్త విని యంత ♦ దశముఖుండు
బాష్పపూరితలోచన ♦ పంక్తియయ్యె
దీప ముత్తేజితంబైన ♦ నేపుతోడ
నగ్ని ఘృతమునుఁ గరగించునట్లె యపుడు. 38

రావణుని రోషవిషాదములం జెప్పుచున్నాఁడు.

గీ. క్షణములో మార్పుఁజెందిన ♦ ఖలవిధాత
కరయుగంబునుబోలిన ♦ ఘనవిషాద
రోషములచేతఁ బడగొట్టి ♦ రూఢవైర
మాత్సరుఁబూని దశగ్రీవు ♦ నహహచిత్ర
మన్మతేలంగ నాలాబు ♦ వడుగుముట్టె. 39

మఱల రావణుఁడు యుద్ధమునకు బోవుట.

గీ. నిహత సర్వాప్తసుతబంధు నికరుఁ డైన
పంక్తికంఠుండు బహుభుజా వర్గమునను
ముఖబహుత్వము చేఁ జూడ భూజనులకు
దనుజలోకావృతుం డైన యనువు దోఁప
నరికె సంగ్రామమునకుఁ దా నొక్కరుండె. 40

రావణుఁడు రథ మెక్కుట.

గీ. కీర్ణవాయుప్రణోదిత కృష్ణకేతు
పటవిశేషాంధకారిత భానుపరిధి
మత్తగీర్వాణగజవర మద వినీల
కేసరాంచత్తురంగమ భాసురంబు. 41

గీ. చక్రనున్న రజోభర సాంద్రమలిన
దూషితోదర కేతు నిర్ధూత చంద్ర
బింబ పశ్చిమభాగంబు పృథురథంబు
నెక్కి దశకంఠుఁ డుక్కుతో నేఁగె ననికి. 42

రాక్షసస్త్రీల కుద్వేగము.

గీ. అనికిఁ బోయెడు దశకంఠు సంతఁ జూచి
మంగళముఁ గోరుచుండు దైత్యాంగనాళి
కన్నులకుఁ బుట్టు నశ్రూదకంబు పైకి
వెడలకుండంగఁ జేసిరి బిగియబట్టి. 43

రావణుఁడు కపిసైన్యముం జూచుట.

గీ. కరతలస్థితభూధర గళిత నిర్ఝ
రాంబు శీకర నిర్వృతాయత భుజాంత
రాళమూ కపిబలంబును రావణుండు

దృష్టిచేతను మార్గణ • వృష్టిచేత
సమముగా నెంచె లాఘవా • స్పదమటంచు. 44

విభీషణుఁడు కనుపించుట.

గీ. ప్లవగసైన్యావృతుండౌచు • పార్శ్వవర్తి
యగు విభీషణు వీక్షించి • యన్నయపుడు
దీనుఁడని సోదరుండని • పూని కృపను
సంహితేషువు విడువ డా • సమయమందు. 45

లక్ష్మణుని రావణుఁడు శక్తితోఁ గొట్టుట.

గీ. సోఢ పత్రిథమపత్రిహారుండు • రూఢకోప
సంహితోద్ధుర బాణుండు • సహజబలుఁడు
లక్ష్మణుం డశనిహతి స • లక్షణమగు
భూరుహముమాడ్కి నురమున • భూరిశక్తి
గొట్టఁబడి కూలె రామాశ్రు • కోటితోడ. 46

లక్ష్మణునకు విశల్యకరణము.

గీ. పావమాని సమానీత • పర్వతస్థ
భవ్యదివ్యౌషధీశక్తి • నవ్యగాత్రుఁ
డగుచు నగ్రజుఁ డలరంగ • నధిక మోద
యుక్తుఁడై లేచిపోరెను • యుద్ధమందు. 47

ఇంద్రుఁడు రామునికొఱకు రథముం బంపుటను
జెప్పుచున్నాఁడు.

గీ. తురగసంఘాతఖురఘాత • దర విదీర్ణ
జలధరావళిస్పృష్టంబు సన్నిషణ్ణ
వజ్రధరచిహ్నిత స్వర్ణ • వర్ణ కేతు
దండనిర్గత పరిమళ • ధార గలదు. 48

గీ. వామబాహుగృహీతోరు • వప్రగ్రహాళి
మాతలిభరావనమ్రదీర్ఘాతిభార
యుగసమాలంకృతంబయి • యుద్ధతాంబు
వాహ శీకరనికరార్ద్ర • పక్ష్మచామ
రముల నొప్పుచుఁ జూడ్కికి • రమ్యతరము. 49

గీ. శశినిఘర్షతుషారార్ద్ర • చండ రశ్మి
రశ్మిశుష్కధ్వజాంశుకా • గ్రము విశాల
పశ్చిమాంగంబు ఖగపతి • వలెను గగన
భాగముననుండి పుడమికిఁ • బఱచుచున
దిగు రథంబును గనెను బ్ర • ధ్వీశుఁడపుడు 50

రాముఁడు మాతలితోఁ గలిసికొనుట.

గీ. అంత రాముండు సౌజన్య • హారివచన
రచన మాతలిహృదయంబు • రంజిలంగఁ
బలుక నతఁడును వలగొని • పాదయుగళి
కెఱఁగి వరుఁడని భావించె • నినకులేశు. 51

మాతలి రామునకు కవచము నిచ్చుచున్నాఁడు.

గీ. కరయుగోద్ధృత విస్తార • పరిమితిగల
కవచమొక్కటి దీసి భా • స్కరకులేశు
చేతి కందిచ్చి తొడుగంగఁ • జేసె నాన
దాని ధరియించి రఘుకులో • ద్వహుఁడు వెలిఁగె. 52

రాముఁడు కవచము ధరించుట.

గీ. దేవనాయక సర్వాంగ • దీప్రనేత్ర
సుఖకరస్పర్శ సవిశేష • శోభితంబు
జానకీదీర్ఘ విరహావ • సన్నమైన
రాముపజౌన శైథిల్య • మోఘమయ్యె. 53

కవచబంధనముం జెప్పుచున్నాఁడు.

గీ. పాకశాసన కరయుగ • స్పర్శచేత
ఘనతనొందినరథమును • వినతుఁడైన
యింద్రసారథిభూమిపై • నింపుతోడ
దింప నెక్కెను రాముండు • దీప్తితోడ. 54

లక్ష్మణుఁడు రామునితో విన్నవించుట.

గీ. అపుడు నీలార్కజులతోడ నన్వితుఁడయి
లక్ష్మణుఁడు చాపగర్భవి • లక్షణంబు
కరము ధరమోపి రామునిఁగని వినీతి
నిట్టులనె భావిసంగ్రామ మెదఁదలంచి. 55

లక్ష్మణునివిజ్ఞప్తి వాక్యస్వరూపముం జెప్పుచున్నాఁడు.

గీ. అన్న నీచాపవర మిప్పు • డటనినుండి
శిథిలగుణబంధ విశ్రాంతి • జెందఁగాక
వహ్నిజుఁడుగాని నేఁగాని • ప్లవగరాజు
గాని జీవించియుండంగ • దానవేంద్రు
కాలు సేతులు ఖండించి • కాలుకడకుఁ
బంపెదము చూడు పరిపంథి • భయదవీర. 56

గీ. అస్మదాదులు సాధింప • నలవిగాని
కార్యవర్గంబుఁ బచరింప • క్షముఁడవీవు
చిత్తగింపుము వసుమత్త • సింధురంబు
లుచ్చతలములఁ బడద్రోయ • నురుకుగాని
ముట్టవెప్పుడు నది వప్ర • భూస్థలముల. 57

ప్రభువు సమర్థుఁడైనను కార్యభారమును పరిజనముం జే
యం చుపన్న మాటను దృష్టాంతముతోఁ జెప్పుచున్నాఁడు.

గీ. అర్ధనేత్రేక్షణంబున • నఖిలశత్రు
పురములు దహించు శక్తి యా • హరుఁడు కున్న

సతనియాజ్ఞనె మన్నించి • యమరులెల్ల
చేసిరనుమాట రఘుపతి • చెవినిఁబడదె 58

రాముని ప్రత్యుత్తరము.

గీ. అపుడు దశకంఠవీక్షణ • విపుల రోష
జాత ఘర్మాంబుబిందు సం • ఘాత కలిత
ఫాలతలుఁడౌచు రఘువంశ • పావనుండు
వహ్నితనయార్కతనయుల • వైపుజూచి
ప్రణతుఁడైయున్న లక్ష్మణు • బలికె నిట్లు. 59

రాముని వాక్యము.

గీ. పనుల నెఱవేర్చు మీచేయు • ప్రతినలన్ని
యెఱుఁగు నాదగు మనమేమి • యెగ్గు లేదు
కాని దశకంఠువధఁ బూన • లేని భుజము
భారమై తోఁచుచున్నది • భ్రాతవినుము. 60

గీ. కుంభవధచేత సుగ్రీవు • కోర్కెదీరె
నగ్నిజుఁడు గీర్తిఁ బడసెఁ బ్ర • హస్తుఁ జంపి
లక్ష్మణుం డింద్రజిద్వధ • లబ్ధయశుఁడు
మీరలందరు కృతకృత్య • వీరులైరి
సింహాసృగ్గోచరంబైన • సింధురంబు
పగిది నాకంతఁబడినట్టి • పంక్తికంఠు
విడువ నీకఁ జంప వేయేల • విడువవిడువ. 61

రావణుని బాణప్రయోగము.

గీ. ఇట్లు రాముండు సౌమిత్రి • యినసుతుండు
కలసి భాషింపఁ దద్భుజ • కంబుగాగ
పంక్తికంఠుని మార్గణ • ప్రకర మప్డు
సైన్యమందున్న కపులను • జక్కజేసె. 62

రామరావణ యుద్ధము.

గీ. బాణమార్గబహిర్గస్థిత • స్వజనబృంద
వీక్ష్యమాణంబు సమసార•వృద్ధవిజయ
కాంక్ష యన్యోన్య నిహనన•కర్మబద్ధ
దీక్ష రాఘవరావణ • తీవ్రరణము
సాగె నత్తఱి లోకభీ•షణముగాను. 63

రావణుఁడు రామునివక్షఃస్థలమందు బాణములం బ్రయోగించుట.

గీ. కుండలాంతర్గస్థమణిరశ్మి•కుల విదీప్ర
గుణ సుసంహితమైన మా•ర్గణము నొకటి
రామువక్షఃస్థలంబున • రావణుండు
గాడనేసెను రుధిరంబు • గారనపుడు. 64

రాముని క్షోభము.

గీ. వేగ నిపతిత నారాచ • విద్ధగాత్రుఁ
డగు రఘుస్వామి ధీరాత్ముఁ • డైన వడఁకె
నతనితోఁగూడఁ గంపించె • నవనియెల్ల
సుర సమూహంబు హృదయసం•క్షోభమొందె. 65

రామబాణప్రయోగము.

గీ. తాళభూరుహఖండన • దక్షమైన
రామబాణంబు కేయూర•రమ్యమైన
దశవదనుబాహువనము ఖం•డించెలీల
వ్రచ్చె బృందారకౌఘంబు • మెచ్చి పొగడ. 66

రావణుని బాణత్యాగలాఘవముం జెప్పుచున్నాఁడు.

గీ. సంహితేషువు రావణు•చాప మొకటి
యదియె యాకృష్టమై వంగ • నన్యమయ్యె

త్యక్తశరమైన నదియె య॥న్యాదృశంబు
సంక్తివదనుని కరలాఘ॥వంబు జెప్పఁ
శక్యమేరికి ధానుష్క॥సంఘమందు. 67

రామునిహస్తలాఘవముగూడ నట్టిదియే.

సీ. నిరతసంహిత నిర్గత॥శరగణంబు
నిరత నేత్రాంతభాగ సు॥నిష్ఠగుణము
నిరతకుండలితోదర ॥ నిభృతమగుచు
రామచాపమ్ము రాజిల్లె ॥ రణమునందు. 68

ఉభయసాధారణమైన కౌశలముం జెప్పుచున్నాఁడు.

గీ. చాపబడియుండె నుభయుల ॥ సవ్యకరము
దక్షిణకరంబు లోచనాం॥తగతమయ్యె
కార్ముకోజ్ఝితమార్గణ॥గణము లప్పు
డంతరాళ ప్రదృశ్యము॥లయ్యె నాజి. 69

గీ. ధాత్రిపుత్రీవియోగ సం॥తప్తమయ్యు
ధైర్య సుస్థిరమై యొప్పు ॥ దశరథేశు
పుత్రహృదయంబు రావణ॥పత్త్రివితతి
భిన్నమైనట్టు లెఱుఁగదు ॥ పెద్దవింత. 70

రాముఁడు రావణుని గొట్టుట.

గీ. రఘుకులాంభోధిచంద్రుండు రాముఁడపుడు
నిశిత విశిఖాళిఁ గీలించె ॥ నిశిచరపతి
ఫాలదేశాన నది భిన్న॥భాగమయ్యె
వికటమైనట్టి భ్రుకుటిని ॥ విడువలేదు. 71

రావణుఁడు మూర్ఛిల్లుట.

గీ. అపుడు మూర్ఛితుఁడైన య॥య్యసురనాథు
వదనపంక్తి నిరర్గళ॥వాహి రుధిర

పూరపూరిత లోచన • వారమగుచు
బాహుశిఖరాగ్రముల గూలెఁ • బహుళ బాధ. 72

రావణుఁడు మూర్ఛఁదేరి మరల రామునిం గొట్టుచున్నాఁడు.

గీ. మూర్ఛఁదేరి దశాస్యుఁడు • భూరిరోష
వహ్నిశిఖలక్షి. వింశతి • వలన బుట్టి
సర్వదిశలందుఁ జెదరంగ • సాహసమున
గుణము కర్ణాంతమునఁ జేర • ఘోరశరము
విడిచె రాముని యురమునఁ • బడెనురీతి. 73

మరల రామశరత్యాగము.

గీ. ప్రళయకాలాగ్ని సదృశంబు • భానుకోటి
పూర్యమాణాఖిల దిశంబు • భూతిభయద
మైన రావణనారాచ • మరుగనూడ్కి-
నర్ధపథమున రాఘవా•త్యంత ఘోర
బాణరాహుముఖంబునఁ • బడియె నంత. 74

రాముని చరమబాణ సంధానము.

గీ, అగ్రహస్తాన రఘునాథుఁ•డాత్మతూణి
నుండి శరమెత్తి పంకజశ్రీ మండితంబు
నికట కాసారమునుఁబోలె • నిశ్చలముగఁ
జూచె దశకంఠు దశముఖ•స్థానమపుడు. 75

శరసంధానముం జెప్పుచున్నాఁడు.

గీ. శరముసంధించె రాముండు • చాపమందుఁ
జేరనుంకించె రావణ•శ్రీ తదీయ
సోదరు విభీషణుని భూమి•సుతకు శుభము
దెలుప వామాక్షి యదరెను • తీవ్రముగను. 76

రావణున కపశకునము గల్గుట.

గీ. రఘుపతికి దక్షిణాక్షియు ♦ రాక్షసులకు
వామనయనంబు రాజ్యసం♦ప్రాప్తి బంధు
వధము సూచించుచును భ్రాతృ♦వరుని నేత్ర
యుగము స్ఫురియించె నవ్వేళ ♦ నుద్ధతముగ. 77

రాముని ధనురాకర్షణము.

గీ. జానకీజాని పూరితో•త్సాహుఁడగుచు
బాణసంహిత చాపంబు ♦ బలిమిలాగ
కంకపత్రాళిచేఁబలెఁ ♦ గారమున్న
తోయజాక్షుల కన్నీరు • తుడువఁబడియె. 78

గీ. తొల్లి నిజచంద్రహాసాసిఁ ♦ ద్రెల్లినట్టి
దశముఖముఖాళి దశరథ ♦ ధాత్రీవరుని
తనయుఁ డొక్కొకయమ్మునఁ ♦ దప్పకుండ
నిపుడు ఖండించి యొనరించె ♦ నిలకు బలిని. 79

రావణుని శిరచ్ఛేదము.

గీ. ధరణీతలమందుఁ గూలిన ♦ దశవదనుని
శీర్షసంఘంబు తెగి నేలఁ ♦ జెదరకుండ
కాయబంధంబుతోనుండె • గన విచిత్ర
మభినవంబుగ శిరము ల•య్యవసరమున
మరల మొల్చిన చందాన • మాయచేత. 80

రావణ జీవ నిష్క్రమణము.

గీ. రణముఖంబున హతుఁడైన • రాక్షసేంద్రు
నాత్మ యొక కాలమందె ద•శాస్యకుహర
వితతి వెలువడి కీర్తాఘ • వితతమైన
యగ్నికైవడి నిష్క్రాంత • మయ్యెనపుడు. 81

రాముఁడు యుద్ధముం జాలించుట.

గీ. రామ బాణాభిహతుఁడౌచు • రావణుండు
సొరి సద్మకునేఁగ దైత్యారు లెల్ల
సంతసిల్లిరి రాముండు • చాపమందు
నారి దించెను ముఖమందు • ఘోర మైన
భ్రుకుటిబంధంబుఁ జాలించెఁ • బొందె శాంతి. 82

రావణశోభం జెప్పుచున్నాఁడు.

గీ. ముజ్జగంబులఁ బ్రఖ్యాతిఁ • బూనినట్టి
దైత్యనాథుని విక్రమా • దార్య మెల్ల
నెఱిఁగి యున్న కతంబున • నిచ్చగలిగి
యతని మరణంబు మాయగా • నాత్మనెంచి
విడువ లేదయ్యె రాలచ్చి • విబుధరిపుని. 83

విభీషణుని శోకాలాపము.

గీ. భ్రాతృ నిధనోత్థ శోకాగ్ని • వహ్యమాన
హృదయుఁడైన విభీషణుఁడెదఁ గలంగి
దాశరథి మోళ్ల నాతనిఁ • దలచి తలచి
వలుదలై పొలుఁగన్నీరు • వంతఁజెందె. 84

విభీషణ ప్రలాపము.

గీ. అన్న సకలామరవిజేత • వైన నీవె
యిట్లు మరణంబు నొందంగ • నింక నేల
కాల్చునా నాకు నమరత్వ • కాంక్ష నీవు
చన బహుళ దుఃఖవార్ధిని • మునిఁగియుంటి
ననుచు నేడ్చె విభీషణుఁ డాతురుఁ డగుచు. 85

గీ. తొల్లి నెవ్వాడు నేమను నిర్ధాతుఁ జేసి
చూచె వేడుకఁ బత్పురి • సుఖముగాను

అట్టి నీవిప్డు సామాన్యు • ననుకరించి
చూడఁబోయితి వేమందు • పాడువిధిని 86

గీ. వలదకార్యంబు పుచ్చుము • పరకళత్ర
మని హితంబువచించిన • యనుజుఁడోకఁడె
కుంభకర్ణుండు సీతోడఁ • గూలి భర్త్రృ
సింహసదృశంబు చేష్టించె • వీరధన్యుఁ
డయ్యె నాకట్టి భాగ్యమే • దయ్య చెపుమ. 87

గీ. సదృశసుఖదుఃఖబాంధవ • సంచయంబు
నిన్ను వీడకయుండంగ • నిన్ను విడిచి
పరులఁజేరిన పరమపా • పాత్ము నన్ను
ధార్మికుండని చెప్పిన • ధర్మపరులు
జగతిలో నెట్టివారయ్య • జ్ఞాత లేంద్ర. 88

రెండుపద్యములచే విభీషణుఁడు రామునకుం జెప్పుచున్నాఁడు.

గీ. భ్రాతృవధజాతశోకంబుఁ • బట్టలేక
కాల్వలై పాఱఁ గన్నీరు • కటకటఁ బడి
సూర్యకిరణప్రతాప సం • శుష్క సలిల
హ్రదినీవదనముగలట్టి • యవనిధరముఁ
బోలినవిభీషణుఁడు వల్కె • భూపుతోడ. 89

గీ. అర్కకులనాథ విడువు • మనుగ్రహించి
పోయివచ్చెద శమనుని పురికి నేడు
కుంభకర్ణ దశాస్యుల • శుంభ దంష్ట్ర
యుగముపైఁబడి యవ్వల • నుత్కటాను
రాగమున మేఘనాదుని • రమ్యగుణుని
శిరము మూర్కొందు ముద్దాడి • చిత్తమరల. 90

రావణాదుల దహనాది సంస్కారము.

గీ. భూమిపైఁబడి పొరలుచు • భూరిశోక
భారవివశు విభీషణుఁ • బరమ మిత్రు
గని రఘూద్వహుఁడప్పుడు • కనికరమున
నౌర్ధ్వదైహిక కర్మల • నాతుల కెల్ల
నాచరింపంగ ననిలజు • కానతిచ్చె. 91

సుగ్రీవ సాహాయ్యోపసంహారము.

గీ. పంక్తికంఠుని బరిమార్చి • బవరమునకు
పరమ కల్యాణి సీతను • పరను భక్తి
రాముతోఁగూర్చి వానర • రాజు శౌరి
సాగరాంతము వలె ననా•సాధ్యమైన
ప్రతికృతికి నంత మీఁడించెఁ • బ్రౌఢిగల్గి. 92

మాతలిని, రథమును స్వర్గమునకుఁ బంపివేయుట.

గీ. దేవతల కార్యమీరీతిఁ • దేజమొప్పఁగఁ
జేసి మాతలి కడుభక్తి • క్షితిపు నాజ్ఞఁ
బడసి జలదోదరానిల • వ్యాకులాయ
మాన కేతువు రథమును • మఘవు పురికి
దీసికొనిపోయె మనమున • దివిజులలర. 93

రాముని యయోధ్యాపురప్రవేశముతో నాశ్వాసమును
ముగించుచున్నాఁడు.

గీ. స్వర్ణపంకంబుకైవడి వహ్నిశిఖల
శుద్ధురాలైన భూసుత • శుద్ధచరిత
జేకొని రఘూద్వహుం డప్డు • శ్రీనియాన

మెక్కె భరతానురాగంబు • నిక్కముగను
జేయ సఫలంబు నిజపురిఁ • జేరె నంత. 94

గ్రంథసమాప్తిని జెప్పుచున్నాఁడు.

గీ. రావణాసురవధ మను • రమ్యకావ్య
మవనిజాలంబ రామదేవాభ్యుదయము
కొసల ననురాగ శబ్దానఁ • గూడినదియు
సకలకవిహారికావ్యంబు • సాంతమయ్యె. 95

ఆంధ్ర సేతుబంధ మహాకావ్యమునందుఁ
బంచదశాశ్వాసము
ముగిసెను.



# శ్రీ రా మ చ ం ద్రు ని

# ప ట్టా భి షే క  మ హో త్స వ ము.

గీ. భ్రాతృ బంధు సుహృజ్జన పరివృతుఁడయి
జొచ్చి నిజసద్మ పరికర్మ శోభితంబు
వరుసగా మాతృవర్గ పాదవనజములకుఁ
బ్రణతుఁడయి జానకీపతి భక్తితోడ. 1

గీ. కొందరిని గౌగిలించుచు మందహాస
సుందరాస్యుఁడు మ్రొక్కుచు సూరిజనుల
బంధువుల క్షేమ మరయుచుఁ బౌరజనము
లిచ్చు నజరుల మెప్పుతోఁ బుచ్చుకొనుచు. 2

గీ. జనులనందరి నానంద సాగరమున
నోలలాడంగఁ జేయుచు నువిదతోడఁ
జేరెఁ గల్యాణమంటప సీమ నంత
సన్నిహితమయ్యె నభిషేక సమయ మనుచు
మంత్రివర్గపురోహితామాత్యు లలర. 3

గీ. అంత రాముని సీతతో నఖిల రత్న
కాంచనోజ్జ్వలపీఠాన నంచితముగఁ
బెట్టి వసువులు వాసవు విధము దోఁప
సకల తోయధి నదనదీ సజ్జలముల
జలక మాడించి రప్పుడు జనులు పొగడ. 4

గీ. ఆడి రచ్చర లతిహర్ష మావహిల్ల
సురల నికరంబు కురిసెను సూనవృష్టి
దివ్యగాంధర్వగానంబు తేజరిల్లె
నిర్భరానంద మందిరి నిఖిల జనులు. ౫

గీ. దాశరథిరాజ్యమేలెడి - తఱిని జనము
లాయురారోగ్యసంపద - లతిశయిల్ల
పుణ్యరతులౌచు నిరతంబు - భూరిధర్మ
సంగ్రహణపరత నొప్పిరి - క్ష్మాతలమున. 6

గీ. దశముఖారికిఁ దొలి నల - తరణిసుతులు
సేతు నిర్మితిఁ దోడ్పాటు - జేసినట్లు
సేతుబంధంబుఁ దెనుగున - జేయు వేళ
ధర మహీధరవంశము - క్తాఫలుండు
పండితుం డాంధ్రగీర్వాణ - భాషలందు
ఆర్యవినుతుండు కామేశ్వ - రాహ్వయుండు
నాకొనర్చిన సాహాయ్య - మేకనిష్ఠ
నింతయని చెప్ప దగదౌనె - యెంచిచూడ. 7

గీ. అత్రిముని గోత్రసంభూతుఁ - డఖిలశాస్త్ర
మర్మవేత్త సుహృన్మిత్ర - మానితుండు
ప్రాచ్య పశ్చిమ గణితాబ్ధి - పారదృశ్వ
కర్ణ శిబి కల్పభూరుహ - కామధేను
వితతి మించిన వితరణ - విశ్రుతుండు
ధర కిడాంబి కులాంభోధి - తారకేశుఁ
డమల సజ్జన సంస్తుత్య - హారిగుణుఁడు
పండితులయందు దయఁబూను - పండితుండు
ఆర్యచరితుండు రంగార్యుఁ - డధికకృపను
జూపి నాయెడ స్వీకృతి - పొగసుమీఱ
నెల్లవ్యయములఁ దానె భరించి ముద్ర
తంబుఁ జేయించి యలరెను - తద్జ్ఞు లలర. 8

శ్రీ రామార్పణమస్తు.

## గ్రంథకర్త రచియించిన గ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| 1 | పార్థసారథి శతకము. | ... | 0—3—0 |
| 2 | ఆంధ్రగీర్వాణశతకోపసహస్రము. (2 భాగములు) | ... | 2—0—0 |
| 3 | శ్రీకృష్ణచరిత్రము (గద్యము) | ... | 1—0—0 |
| 4 | బాణుని హర్షచరిత్రము (వచనము) | ... | 1—0—0 |
| 5 | అలంకారశాస్త్రచరిత్ర. | ... | 1—0—0 |
| 6 | దేవవ్రత చరిత్ర. | ... | 1—8—0 |
| 7 | సేతుబంధ మహాకావ్యము. | ... | 2—0—0 |
| 8 | నాయచ్చార్ ప్రబంధమునకు (పద్యరచన) | | 0—8—0 |
| 9 | తిరుప్పావు (తెలుగు) | ... | 0—4—0 |
| 10 | కులశేఖరాళ్వారి ప్రబంధము (పద్యరూపము) (అచ్చగుచున్నది) | | |

మేడేపల్లి వేంకటరమణాచార్యుఁడు,
దాసన్నపేట, విజయనగరము.